## విషయ సూచిక:



---

# ఉపోద్ఘాతము

కంకార్డునగరానికి సమీపంలో వాల్డెన్ చెరువువొడ్డున అడవిలో స్వయంగా కట్టుకొన్న ఇంట్లో ఒంటరిగా జీవిస్తూ ఉన్న కాలంలో ఈ పుస్తకంలో చాలాభాగం వ్రాశాను. ఆ యింటికి దాపున ఇళ్ళు లేవు. ఇరుగుపొరుగులు అని చెప్పకో దగ్గవారు మైలుదూరంలోకానీ లేరు. అలాగా ఒంటరిగా రెండు సంవత్సరాల రెండునెలలు స్వాతంత్రంగా, స్వశక్తిపై ఆధారపడి వళ్ళువంచి పనిచేస్తూ జీవితం గడిపాను.

నా జీవితాన్ని గురించీ, నన్ను గురించీ కొంత ఆసక్తీ, ఆదరణాగల మనుష్యులు తరచు అనేకప్రశ్నలువేసి ఆ విషయాలు తెలుసుకోవాలని కుతూహలపడి ఉండకపోతే నే నీ సంగతులన్నీ వ్రాయకపోదును. నా సొదతో ఎవ్వరికాలాన్నీ వృథాచేయాలనే సంకల్పమూ లేదు.

అక్కడ నాజీవితం చాలా సహజంగానూ, సౌమ్యంగానూ గడిచింది.

"అక్కడ ఉంటున్నప్పుడు నువ్వు ఏమితిని బ్రతికావయ్యా? అక్కడ నువ్వు ఒంటరిగా ఉంటూఉన్నందుకు బాధ

పడలేదూ?" అని కొందరూ, "నీ ఆస్తిలో ఎన్నోవంతు ఖర్చు పెట్టి దానధర్మాలు చేశావయ్యా? నువ్వు ఎంతమంది బీద విద్యార్థులను పోషించావేమిటి?" అని అంటూ మరికొందరు నన్ను ప్రశ్నించారు. ఇంకా అనేక ప్రశ్నలువేశారు. ఈ పుస్తకంలోవాటికి కొన్నింటికి సమాధానాలుచెప్పడానికి ప్రయత్నం చేస్తాను.

ఎవరైనాసరే తమతమ పుస్తకాలలో, తమ భోగట్టా అంతా సంపూర్ణంగా ఇవ్వాలి. సమాధానాలు చెప్పుకోవాలి నా శక్తివంచనలేకుండా నే నలాగా చెప్పుకొంటాను. నాకు నాసంగతి తెలిసినంత అధికంగా మరొకరిసంగతి తెలియదు కనుకనే కేవలమూ నా అనుభవాన్ని పురస్కరించుకొని, అది, కొద్దిపాటిదే కావచ్చుకాక, స్వవిషయంవ్రాస్తాను. ముఖ్యంగా బీదవిద్యార్థులకోసమే వ్రాస్తున్నాను. మిగిలిన తమకు సంబంధించిన భాగాలను గ్రహిస్తారని అనుకొంటాను. అంతమాత్రం జరిగితే చాలును-సంతోషమే.

నే నిప్పుడు ఎక్కడో ఏదూరదేశంలోనో నివసించే ఏ చైనీయులను గురించో ఏదో ఉబుసుపోకకు చెప్పడంలేదు. అలా చెప్పేమాటలు కావివి. అలాగా చెప్పేవిషయాలు మీకు సంబంధించినవీ, మీకు ముఖ్యమైనవీ కాకపోవచ్చును. కాని ఇప్పుడు నేనుచెబుతున్నది సరిగ్గా మిమ్మల్ని గురించి * న్యూ ఇంగ్లాండులో, ఈ కంకార్డునగర పరిసరప్రాంతాలలో

* అమెరికాలోని బ్రిటిషువారి వలసప్రాంతాలకు "నవ ఇంగ్లాండు"అని పేరువచ్చింది.

నివసిస్తూవున్న మిమ్మల్ని గురించి. ఇప్పటి మీ స్థితి-మీ చుట్టూ ఉన్న ప్రపంచపరిస్థితులు ఇంత దరిద్రంగా ఎందుకున్నాయి? ఇవి ఎప్పుడూ ఇలాగే ఉండిపోవాలా? పీటినికాస్త చక్కపరచుకోనేందుకు అవకాశం ఉన్నదా? ఈవిషయాలు చర్చిస్తాను.

కంకార్టులో చాలభాగం కాలినడకను తిరిగి చూశాను. దుకాణాలలో, వివిధములైన కచేరీలలో, పొలాల్లో ఇంకా ఇక్కడా అక్కడా ఎక్కడ కన్పిస్తే అక్కడల్లా జనం అంత మందీ పాపపరిహారార్థం శరీరాలను కష్టపెట్టుకొంటున్నట్లుగా కన్పిస్తున్నారు. నాలుగు అగ్నులమధ్య కూర్చునో, అగ్నిపై తలక్రిందుగా వ్రేలాడుతూనో, కాక పద్మాసనం వేసుకొని కళ్లు మూసుకొని దృష్టిని ఊర్ధ్వలోకాలపై కేంద్రీకరించో తపస్సు చేస్తూ తమతమ పాపాలను పరిహరించుకోవడంకోసమై బ్రాహ్మణులు శరీరాలను కష్టపెట్టుకొంటారట. ఇక్కడ మనుష్యులు పడుతున్న అవస్థ చూస్తుంటే ఆవిషయాలు నాకేమంత ఆశ్చర్యకరంగాగానీ, నమ్మడానికిమరీ వీలులేనివిగాగానీ కన్పించడంలేదు.

గ్రీకు పురాణాల్లో "హెర్క్యులెస్" పన్నెండుసార్లు విజయయాత్రలుచేసి సంపదలు పోగుచేశాడు. కాని మనవాళ్లు అంతకంటే ఎక్కువ ప్రయాస పడుతున్నారు. అతని ఆశకు అంతు అంటూ - హద్దు అంటూ ఒకటి ఉన్నది. వీళ్ళ కది లేదు. ఇంకా ఇంకా అధికంగా భాగ్యవంతులమై పోదామని తాపత్రయ పడుతున్నారు. పోనీ ఆ గ్రీకు నాయకుల్లాగా ఏ రాక్షసులనో జయించీ, చంపీ ఏవైనా మహాత్కార్యాలు సాధించారా అంటే అదీలేదు. కేవలం తాపత్రయం!

## ఒట్టి పేరాశ

ఇళ్లూ వాకిళ్లూ, పొలం పుట్రా, గొడ్డూ గోదా, ధనం ధాన్యం, ఇవన్నీ కాక సామగ్రీ– తాత ముత్తాతలనుండి ఆస్తిగా సంక్రమించిన కొందరి వ్యక్తుల దురదృష్టాన్ని చూడండీ – వాటిని నిలబెట్టుకోవడానికీ, కాపాడుకోవడానికీ వాళ్ళుపడే అవస్థ– ఆ యమయాతన కాస్త గమనిస్తే ఆ బాధ మనకు అర్థం అవుతుంది. వాళ్లు వాటిని ఒకపట్టాన వదిలించుకోనూ లేరు, కాపాడుకోనూ లేరు. ఏ ఆస్తిపాస్తులూ లేకుండా మనిషి ఏ అడివిలోనో జన్మిస్తే బాగుండును. ఏ ఆవో, గేదో ఇన్ని పాలిస్తే సరిపోతుంది– ఎందుకంత భూమి? మనిషికి, ఒక్క మనిషికి, అరవైఎకరాల భూమూ? అదంతా తినడానికే? ఆరి పేళ్ళ ఇళ్ళు బంగారంగానూ – ఎందుకలా, పుట్టాగానే తమగోరీలు తామే కట్టుకొంటున్నారు? వరాసగా, శ్రద్ధగా, గుంటలు త్రవ్వేసుకొంటున్నారు? అసలూ ఇవన్నీ అవతలకు నెట్టివేస్తూ మనిషి– మనిషిగా బ్రతకాలి. మనిషి– ఎంత ఉత్తమంగా జీవించడానికి వీలవుతుందో అంత ఉత్తమంగా జీవించాలి. నేను పెద్ద ఆస్తి ఉండి విపరీతమైన బాధ్యతలను నెత్తిన వేసుకొని నడవలేక నడిచే మనుష్యులను చూచాను. ఎందుకంత పొలం ఆవ్యక్తికి? సొంత పొలాలులేనివాళ్లు కాస్తంతభూమి దున్నుకొని కాయకష్టంపై ఆధారపడి హాయిగా, సుఖంగా, స్వేచ్ఛగా జీవిస్తున్నారుకదా! మరి అతనికి – అంత ఆస్తిగల ఆసామికి లభించదేం ఈసౌఖ్యం? మనుష్యులు ఒక దురభిప్రాయంలోపడి ఇంతచేటు కష్టపడుతున్నారు. అకారణంగా క్లేశాన్ని అనుభవిస్తున్నారు. అది

వాళ్ళ ఖర్మమని అనిపిస్తుంది మనకు. కాని వాళ్లు - తామూ పనులు అవసరంకొద్దీ చేస్తున్నామంటారు. ఒట్టి మాటలవి. ఊరికే డబ్బు పోగుచెయ్యగానే సరికాదు. ముందు కాక పోయినా చిట్టచివరికైనా తాము ఒట్టి నైరాశ్యజీవితం గడిపామని వాళ్ళకూ తెలిసివస్తుంది.

కొన్ని దేశాలతో పోల్చుకొన్నప్పుడు మన దేశం వాటికంటె ఎక్కువ స్వతంత్రదేశమే. కాని ఈ దేశంలోకూడా పొరపాటువల్ల అనండీ, అజ్ఞానంవల్ల అనండీ - చాలామంది మోయలేని బాధ్యతలూ చెయ్యలేని చాకిరీ నెత్తిన వేసు కొన్నారు. (నిజానికి ఆ బాధ్యతలు కేవలం గొప్పకోసం తెచ్చి పెట్టుకొన్నవి. ఆ చాకిరీ అసహ్యమైనది. వదిలించుకోవాలను కొంటే ఆ రెండూ తేలికగా వదిలించుకోడానికి వీలున్నది.) వాళ్ళకు సరియైన జీవితపు ప్రతిఫలం ముట్టడంలేదు. వాళ్ళు దాన్ని అందుకోలేకపోతున్నారు. బండపనులు చేయడంతో మొద్దుబారిపోయి వాళ్ళ వేళ్ళు వణికిపోతూ దాన్ని తాకడానికి కావలసిన సౌకార్యాన్ని అవి కోల్పోతున్నాయి. ఈ రకంగా ఇంత ఎక్కువగా కష్టంచేసే వ్యక్తికి అసలు తీరికేదొరకదు కదా! మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన బాంధవ్యాన్ని నిలుపుకోలేకపోతున్నాడు. కేవలం ఒక యంత్రంగా తయా రయిపోతున్నాడు. తన్మూలంగా అజ్ఞానిఅవుతున్నాడు. మనిషి పెరగడానికి జ్ఞానం అవసరంకదా! దాన్ని అతడు అనుక్షణమూ ఉపయోగించుకోవాలికదా! కానీ తాను అజ్ఞానంలో ఉన్నట్లు గుర్తెరగడానికి వ్యవధి ఏదీ? అతనికి కావలసినంత తిండీ, కోరి

నన్ని గుడ్డలూ మనం అందచేయవచ్చును. కాని, పండ్లల్లో కనిపించే ఒక వికాసము, ఒక సనత్వము, ఒక సహజసౌకుమార్యమువంటి గుణము - సౌమ్యత, అతనిలో అంతరించిపోతున్నది.

మీలో కొందరు నిజంగా బీదవాళ్లు. ఆ విషయం అందరూ ఎరిగినదే. కొందరు బ్రతకడమే కష్టంగా ఉండి ఉండవచ్చు కూడా. కొన్ని సమయాల్లో నిజంగా నిస్పృహ చెంది ఉండవచ్చు కూడానూ. నిజమే. కాదనను......

మీకు ఎన్నోచోట్లకు-ఎన్నో విందులకు వెళ్ళవలసి వుండచ్చు. ఎల్లాగో కాస్త వీలు చేసుకొని ఈ పుటలు నాలుగు చదవడానికి శ్రమపడుతున్నారను కొంటాను. ఎంత వ్యవధి లేకుండా ఉన్నదండీ మీకందరికీ! బ్రతుకు తెరువుకోసం తోటి వాణ్ణి "అయ్యా మీ బూట్లు, కోట్లు కాకపోతే హేట్లనైనా నన్ను చెయ్యనివ్వండి. అదీ వీలుకాదూ - మీకు కావలసిన కిరాణా సరుకులు నన్ను దిగుమతి చెయ్యనివ్వండి; పోనీ మీ ధనం బ్యాంకులో పెట్టి భద్రపరచి నన్ను కాపలా, కాయనివ్వండి." అని అంటూ ప్రాధేయపడుతూ, ఎంతగా ప్రార్థిస్తున్నారండీ! ఎందు కింత శ్రమ? ఎందుకీ ఆరాటం? అమెరికాలో నీగ్రోలను గురించిన సమస్య ఒకటి ఉత్పన్నమైంది. ఉత్తర రాష్ట్రాల వారు దాన్ని వ్యతిరేకించారు. కూడదన్నారు. దక్షిణ రాష్ట్రాల వారు అనుకూలించారు - బానిసలు ఉండక తప్పదన్నారు. ఆ విషయమూ ఆ తర్వాత జరిగిన అంత ర్యుద్ధం సంగతీ అందరూ ఎరిగినదే కదా! కాని అసలు

సమస్య ఎవరికీ అంతుపట్టలేదు. తెల్లవారు ప్రత్యక్షవిధానంలో నీగ్రోలనూ, పరోక్షవిధానంలో తమజాతి - తెల్లవాళ్ళనూ బానిసలుగా చేసుకొంటున్నారు. చిన్న చిన్న సౌఖరీలు ఇచ్చి వారిచేత వీలయినంత చాకిరీ చేయించుకొంటున్నారు. అందు వల్ల అందరికీ బాగా తెలిసిఉన్న సంగతి - అంటే నీగ్రోలను బానిసలుగా ఉపయోగించటం సంగతి - దాని మంచి చెడ్డల విషయమై చర్చా - వదలి పెట్టు. ఎందుకంటే ముందు నీవే ఒక బానిసవు కదా? నీకూ, నీ మనస్సుకు, నీ అవసరాలకు నీవే ఒక బానిసగా తయారయి కూర్చున్నప్పుడు నీగ్రో బాని సల చర్చ ఎందుకూ అంటాను.

మా న వు ల లో దై వ త్వ మా !

ఎందుకు దాన్ని గురించి అంత లేసి ఉపన్యాసాలు ఇవ్వడం? అటు చూడండి. ఆ గుఱ్ఱాలనూ, ఆ కంచరగాడిదలనూ మంద కొందగా-వాటిపై మోపెడు సామానులు వేసుకొని-తోలుకొని పోతున్నాడు - ఒక పెద్దమనిషి. ఏదో వాటికింత దాణా వేసి ఇన్ని నీళ్లు పట్టడంతో తనవిధి నెరవేరిపోయింది అనుకొంటున్నా డతను. అతని మనస్సంతా ఆ సరుకుఅమ్మి సొమ్ముచేసుకో వడంమీాదనే ఉన్నది. ఎలాగయినాసరే భాగ్యవంతుణ్ణయిపో దామని అతని తాపత్రయం. అతను రోజంతా ఎందుకో ఏదో భయపడుతూనే ఉంటాడు. కీర్తి సంపాదించుకోవాలని అతని ఆశ. తన కేర్పడిన ఒకానొక అభిప్రాయానికి అతను బానిసఅవుతు న్నాడు. సంఘం ఏమనుకొంటుందో అన్న భీతి, తాను వెంటనే ధనవంతుడు కాకపోతే సంఘం తన్ను గౌరవించదేమో

నన్న పెనుభూతంలాంటి అనుమానం అతన్ని బాధిస్తున్నాయి. వ్యక్తి అభిప్రాయాలను లొంగతీసుకోవాలని ప్రయత్నంచేసే సంఘంయొక్క అభిప్రాయాలు ఎప్పుడూ బలీయంగానూ తరచు భయంకరంగానూ ఉంటాయి. సామాన్యంగా మనిషి తనకున్న ఆదర్శాలకోసం కష్టపడి పనిచేస్తాడు. వాటిని సాధించడానికి ప్రయత్నం చేస్తాడు. అతని ఆదర్శాలు మంచివైనప్పుడు అతను ఉత్తమస్థాయిని అందుకుంటాడు. అలా కాక ఊరికే డబ్బు పోగు చెయ్యటంవల్లనే తానేమో గొప్పవాణ్ణయిపోతున్నానని గనుక భావిస్తే – అతను దీన కోరికలమూలంగా తానుగా – దిగజారిపోతున్నా డన్నమాట.

ఏమైనా, మొత్తంమీద మనుష్యులు అంతనుండీ–ఒక విధమైన నిస్పృహలో పడిపోయారు. అంటే తాము చేస్తున్న పనిలో తమకు ఆనందం కన్పించడం లేదన్నమాట. అయినా యంత్రాలలాగా పనిచేస్తున్నారు. కలిగిన నిస్పృహను హృదయాలలో దాచుకొంటున్నారు. వాళ్ళు "ఇది మా ఖర్మం. మే మింకోలాగున చెయ్యలేము" అని అనుకోలేరు కూడానూ. అల్లా అనుకోవడమంటే తమ నిస్పృహను బహిరంగపరచి, ఉన్నస్థితిని అంగీకరించడము అవుతుంది. అదీ చెయ్యరు వాళ్లు. వాళ్ళు ఏంచేస్తున్నారంటే – ఆ నిస్పృహను హృదయాల్లో దాచుకొని పట్టణాలనుండి పల్లెప్రాంతాలకూ, గ్రామాలనుండి నగరాలకూ ప్రయాణమై పోతున్నారు. ఊరికే ఒకచోటనుండి మరొకచోటకు పరుగులు పెడుతున్నారు. ప్రదేశం మారినంత మాత్రాన బాధ ఎక్కడకు పోతుంది? అందులోనూ ఉన్న

ఆదర్శమేమో ఎప్పుడూ ఒక్కటే స్వార్థంతో కూడినదై ఉన్న ప్పుడు మార్పు ఎల్లావస్తుంది? వాళ్ళ ఆటల్లో పాటల్లో వినో దాలలో కూడా ఒకేవిధమైన బాధా - నిస్పృహా తొంగి చూస్తూనే ఉంటాయి. ఆ వినోదాలూ అవీ అంత యాతన పడిన తర్వాత ఆ మనుష్యులకు ఆహ్లాదాన్ని కలిగించవు.

నిజమైన సౌఖ్యాన్ని అనుభవిస్తూ జీవించడానికి అనేక మార్గాలున్నాయి. అందుకు అనువైన జీవనవిధానాలు చాలా ఉన్నాయి. కానీ ఏళ్ళంతా గడిపే జీవనవిధానాన్ని చూస్తే మరొక విధానం మరొకపద్ధతి లేదా అనిపించేస్తుంది. లేదని అనుకొనే వారు పాతవిధానాన్ని తప్పించి మరొకటి ఎంచుకో వడం వీలుగాక చేతగాక దాన్నే అనుసరిస్తున్నారు. నిజానికి అనేక మార్గాలున్నాయి. అట్లా యాంత్రికంగా తయారు కా నక్కరలేదు. ఉత్సాహవంతులూ ఆరోగ్యవంతులూ అయిన వారికి ఈ విషయం-అంటే, డబ్బు కూడబెట్టడం ఒక్కటే జీవితాదర్శనము కాదనీ, కేవలమూ, అందుకోసం ఉపయోగ పడే పద్ధతిమాత్రమే జీవనవిధానము కాదనీ తెలిసివస్తున్నది. ఇప్పటికీ మించిపోయిందేమిలేదు. వారు తమ తప్పుడభిప్రాయా లను మార్చుకోవచ్చును. ఒకవిషయాన్ని గురించి ఆలోచించ డంలో గానీ ఒకపనిని నిర్వర్తించడంలోగానీ అవలంబించే పద్ధతి పురాతనమైనంత మాత్రంచేత అనుసరించడానికి వీలు లేదు. దానికి ప్రత్యక్షంగా ఋజువు కన్పించాలి. ప్రత్యక్ష ప్రమాణం కన్పించాలి. ఒకనాడు అందరూ ఏకగ్రీవంగా "ఇది సత్యము" అన్నదే మరోనాడు అసత్యమైపోతుంది. ఒకనాడు

పొగనుచూచి వర్షింపగల మేఘమని కొందరు అభిప్రాయ పడవచ్చును. తర్వాత కాలంలో అది కేవలం పొగ అన్న నిర్ణయానికి రావచ్చును. అలాగే మరికొన్ని అభిప్రాయాలు (అవి నిజానికి అసత్యాలే అయినా) పరమసత్యాలుగా భాసించినా మరోనాడు వాటిస్థితి మారవచ్చును. మన పూర్వులు "మీరెవ్వరూ ఈ పనులు చెయ్యలేరు." అన్న పనులనే మన మీనాడు ప్రయత్నించి సాధింపవచ్చును. ఒక విషయం చూడండి–పూర్వపువాళ్ళకు ఈ విషయం అంతగా తెలియదు. ఈనాడు ఆవిరియంత్రాలను కనిపెట్టారు కదా – వాటిలో ప్రపంచమంతా చుట్టివస్తున్నాము కదా! పక్షులకుండే గమన వేగంతో మనంకూడా నడవగల్గుతున్నామా లేదా! అవునా – మరి ఈ విషయంలో వాళ్ళకెంత తెలుసు చెప్పండి ! కనుక చెప్పవచ్చిన దేమంటే – ఎప్పుడూ వాళ్ళ అభిప్రాయాలనే గ్రుడ్డిగా అనుసరించకూడదు, వాళ్లు చెప్పినదంతా వేదం అనుకోకూడదు. మనమంతా "మహామేధావి" అనుకొనే వ్యక్తినే ఒకర్ని తీసుకోండి. అతను కేవలం – బహుకాలం జీవించి ఉండడంచేతనే నాశాశ్వత ప్రయోజనకారియైన విజ్ఞానం సంపాదించింది ? నిజానికి – నిజంగా నిజమే చెప్పవలసివస్తే మన ముసలివాళ్ళు మన యువలోకానికి ఇవ్వగల సలహా – ప్రముఖమూ ప్రధానమూ అని చెప్పుకోగల సలహా – ఒక్కటీలేదు. ఎందుకంటే వారి అనుభవంకూడా పాక్షికమైనదే. వాళ్ళ హయాములో వాళ్లుకూడా ఘోరంగా ధక్కాముక్కీలు తిన్నారు. నామట్టుకు నేను అక్కడ ముప్ఫైవేళ్ళ

జీవితం గడిపాను. కాని నా పెద్దలనుండి నే నీ విషయంలో పనికివచ్చేదీ, విలువైనదీ అనతగ్గ సలహా నాకు ఒక్కటీ అంద లేదు. వారు చెప్పలేదు. చెప్పలేరుకూడా. వాళ్ళంతా తమలో ప్రతిఒక్కరూ ఒక్కొక్క "మోటారు" అని అనుకొంటారు. ("మోటారు" అనే వ్యక్తి హోమరు రచించిన ఇలియడ్ అన్న గ్రంథంలో వచ్చే గ్రీకునాయకులలో ఒకడు) అనుకోవడం మటుకే నాకు ఉపయోగపడే మాట ఒక్కటీ చెప్పలేక పోయ్యారు. జీవితం ఒక ప్రయోగం. స్వయంగా అనుభవించి సొంతమార్గాలను కనిపెట్టాలి. ఆ సొంతమార్గాలలో ధైర్యంగా నడచి వెళ్ళాలి. గ్రుడ్డిగా అనుకరిస్తే చాలదు.

ఆహారవిషయం చూడండి. మీరందరూ మాంసా హారం అవసరమంటారు. నిజానికి అవసరంకాదు. నాతో ఒక సారి ఒక రైతు మనం శాకాహారంపైనమాత్రమే బ్రతుకలేమనీ, ఎముకలు వృద్ధికావడానికి మాంసాహారం అత్యవసరమనీ అన్నాడు. అతను పూర్వపునమ్మకాన్ని అనుసరిస్తూ మాంసా హారం ఎముకల పుష్టికోసమని తీసుకొంటూనే ఉన్నాడు. కాని అతను తనముందు నడుస్తున్న ఎద్దును అసలు గమనించనేలేదు. అది బ్రతికిఉన్నన్నాళ్లూ శాకాహారంమీదనే ఆధారపడి ఉం టుంది. అదికనుక ఒక్కతన్నుతంతే- కేవలం శాకాహారంవల్లనే ఎముకబలం సంపాదించుకొన్న ఆ ఎద్దు తంతే, ఆ తన్నుకు ఇతను ఏమైపోతాడో! అట్లాగే ఉంటుంది. శాకాహారంమీద మనిషి లక్షణంగా బ్రతకవచ్చును. నిరభ్యంతరంగా బ్రతుక వచ్చును. కొన్నిసందర్భాలలో కొన్ని ప్రత్యేకపరిస్థితులలో

ఏదో అవసర మవుతుంది. అంతమాత్రంచేత అదే అన్ని సంద ర్భాలలోనూ సర్వకాలసర్వావస్థలలోనూ అవసరంకావాలని ఎక్కడున్నది?

మన పూర్వపు తరాలవారు అనేక కష్టాలనూ సౌఖ్యాలనూ చవిచూచి, ప్రగాఢమైన అనుభూతి సంపాదించిన తర్వాతనే కొన్నినిర్ణయాలకు వచ్చారని సామాన్యంగా అనిపిస్తుంది. అందువల్లనే తరువాతవారికి తమముందు వారిని కేవలం గ్రుడ్డిగా అనుకరించి అనుసరిస్తే చాలుననికూడా అనిపిస్తుంది. అది కూడదు.

చెప్పడానికైతే మన పూర్వీకులు దాదాపు అన్ని విషయాలూ చెప్పారు. చెట్లను పెంచడంలో ఒకచెట్టుకూ మరొక చెట్టుకూ ఎంతెంతదూరం వదలిపెట్టాలోకూడా నిర్ణయించి చెప్పాడు సాలమన్ మహాశయుడు. రోమునగర న్యాయాధికారులు ప్రక్కవాడి పొలంలోకి వాలిన మన చెట్లనుండి రాలినపండ్లపై మన కెంతవరకు అధికారమున్నదో మనం ఎన్ని అడుగులు అవతలవాడి పొలంలోకి వాణ్ని అడక్కుండానే వెళ్లి ఆపండ్లు ఏరుకోవచ్చునోకూడా నిర్ణయించి నియమాలు-శాసనాలు వ్రాసివేశారు. క్రీస్తుకు పూర్వం 5 వ శతాబ్దానికి చెందిన ప్రసిద్ధవైద్యుడు "హిపోక్రేట్సు" మనం గోళ్ళు ఎలా కత్తిరించుకోవాలో, ఎలా వాటిని శుభ్రంగా ఉంచుకోవాలో కూడా వ్రాసిపోయాడు. వీటి నన్నిటినీబట్టిచూస్తే వాళ్ళు తడమకుండా వదలివెళ్లిన విషయమేమీ కన్పించదేమో నని

పిస్తుంది. జీవితంలోకలిగే బాధ, విసుగుదల అది మానవునికి...
బైబిలును అనుసరించి మానవులకు తండ్రివంటివాడైన ఆదా
ముకు కూడా - సుపరిచిత మైనవే.

అల్లాగా మన పూర్వులు అన్ని విషయాలూ చెప్పా
రనే అనిపిస్తుంది. చెప్పినమాట నిజమే, చెప్పకుండా వదలి
వేసిన విషయాలుకూడా చాలా ఉన్నాయి.

మానవుని శక్తిసామర్థ్యాలను కొలిచి సరిగ్గా చెప్పేయ
లేము. అవి మారుతూ ఉంటాయి. అనంతమైనవి. అందువల్ల
మన పూర్వులు, పూర్వకాలంలో ఒక విషయంలో ఏదో
కొంత చేసినంతమాత్రంచేత ఇక ఆ విషయంలో చేయదగిన
దంటూ ఏమీలేదని అనుకోవడం తగదు. చేయవలసినది
ఇంకా చాలా మిగిలే ఉంటుంది.

కొన్ని విషయాలు మనకు స్వల్పమైనవిగా అతి చిన్న
విషయాలుగా కన్పిస్తాయి. జాగ్రత్తగా పరిశీలిస్తే వాటివిలువ
అర్థమవుతుంది. జీవితంలోనే ఒకానొక నవ్యత గోచరిస్తుంది.
ఒక నూతన దృక్పథం ఏర్పడుతుంది.

సూర్యుణ్ణీ నక్షత్రాలనూ చూడండి. ఎంతవిచిత్రమో!
ఇక్పటిదాకా ప్రపంచానికంతటికీ మనమొక్కళ్ళమే అతి
ప్రధానమైన వారమని అనుకొంటున్నాము. కానీ మనకు
వేడినీ వెలుగునూ ఇస్తున్న ఆ సూర్యుడే ఆ నక్షత్రాలే ప్రపం
చంలోని అన్ని యితర ప్రాంతాలలో ఉంటున్న మానవు
లందరకూ వాటిని అందిస్తున్నాయి. కాస్త జాగ్రత్తగా పరిశీ
లించండి...కనుక వాళ్ళు ఎంతో; మనమూ అంతే.

మానవ ప్రవృత్తి చాలా చిత్రమైంది. అందులో చాలా వైవిధ్యం ఉన్నది. ఒక మనిషికీ మరో మనిషికీ ఎంతో తేడా కన్పిస్తున్నది. మనుష్యులలో వారి వారి దృక్పథాలలో, వారి ఆలోచనలలో ఎంతటి వైవిధ్యం ఎంతటి విభిన్నత ఉన్న దంటే; మనముంటూ ఉన్న ప్రపంచంలో అటువంటి కొందరు నివసించడమే లేదనుకొనేటంత వైవిధ్యమున్నది. వాళ్ళు ఏదో పుస్తకాలలో చరిత్ర, పురాణ, కావ్యగ్రంథాలలో తటస్థపడే వ్యక్తులవలే కన్పిస్తారు కూడా. అంతేకాక ఒక కాలంలో ఒక పరిస్థితిలో జీవించిన మనిషికీ వేరొక కాలంలో వేరొక పరిస్థితిలో జీవించిన మనిషికీ కావాలసినంత వ్యత్యాస మున్నది. ప్రతివాడికీ తనదీ అనతగిన వ్యక్తిత్వం ఒకటి ఉటుంది. అందువల్ల ప్రతివాడూ అన్ని కాలాలలోను పాటించి తీరాలని కొన్ని నియమాలు చేసేస్తే ఎల్లా ?

గతంలో నేను కూడా ఏవో సంప్రదాయాలనూ, ఆచా రాలనూ అనుసరించడంవల్ల మంచివాణ్నినిపించుకొన్నాను. అవి తప్పయినా ఎందుకు గుడ్డిగా అనుకరించానా అన్న విచారం ఇప్పుడు కలుగుతున్నది.

క్రొత్తవాటికి స్థానం ఇస్తూ ఆచారాలు మారుతుం టాయి. ఒక ఓడను తీసుకోండి. అది ఒకప్పుడు ఎంతగా ఉప యోగపడినప్పటికీ పాతపడి పనికిరానిదై పోయినప్పుడు దాన్ని విడిచిపెట్టేసినట్లు ఒకతరంవారు సాధించినదాన్ని అనుస రించిన ఆచారాన్ని క్రొత్త తరాల వారు విడనాడుతారు.

మనం స్వశక్తిపై ఇంకా కొంచెం ఎక్కువ నమ్మకం

ఉంచుకోవాలి. మనం ఒకవేళ మన తెలివితక్కువతనంవల్ల ఏమైనా తప్పులు చేసినా వాటిని మనంతట మనమే సరిదిద్దుకో గలం. ప్రకృతి అలాటి శక్తిని మనకు ప్రసాదిస్తుంది. స్వశక్తిపైవిశ్వాసం ఉంచుకోవాలి. ఎక్కడ ఏంతప్పు తమవల్ల జరిగిపోతుందో అని హడలిపోతూ విపరీతంగా అంతులేకుండా ఆదుర్దాపడుతూ కాలం గడుపుతున్నారు. అల్లా ఎప్పుడూ; ఆఖరికి నిద్రలో కూడా సౌఖ్యమన్నది ఎరుగకుండా ఆదుర్దా పడుతూ ఉండడము - నిజానికి ఒకరకమైన వ్యాధికిందకు వస్తుందేమో !

మన పూర్వులు సాధించిన ప్రతి చిన్నవిషయాన్నీ గోరంతలు కొండంతలుగా చేసి చెప్పుకోవలసిన పనిలేదు. అలా చేస్తే - ఇంకా సాధించవలసినవి అనేకం ఉన్నాయనే విషయమూ, జీవితం అంటే నిరంతర సాహసకార్య నిర్వహణము అన్న విషయమూ మరచిపోతాము. అప్పుడు స్వశక్తిపై నమ్మకం క్రమంగా సన్నగిల్లిపోతుంది. అప్పుడు ప్రతిదానికీ మన పూర్వులుచేసిన పనులపై ఆధారపడతాము. అంటే అప్పుడు ఆత్మవిశ్వాసం అదృశ్యమవుతుం దన్నమాట. ఏదో ఆచారానుసారంగా ప్రార్థనలుచేస్తూ సౌఖ్యం ఎరుగక-ఆఖరికి నిద్రలోకూడా ఏం జరిగిపోతుందో అని భయపడుతూ ఆదుర్దా పడుతూ జీవించటం ఏమీ బాగుండలేదు.

మన ముంటూ ఉన్న - మనచుట్టూఉన్న ప్రపంచం అనుక్షణమూ మారుతూఉన్నదన్న విషయం గమనించాలి. ప్రపంచాన్ని కాస్తజాగ్రత్తగా పరిశీలనచేసి అనేక విషయాలు

అవగాహన చేసుకోవాలి. కనీసం ఈవిషయం - కన్ఫ్యూషి యస్ (చైనీయుల ప్రసిద్ధ వేదాంతి) చెప్పినట్లు - మనకు తెలి సింది మాత్రమే తెలుసుననీ, తెలియందేమో తెలియదనీ మనం గుర్తించగల్గితే అంతకుమించిన విజ్ఞానం మరోటిలేదు.

ఒక విషయం నెమ్మదిగా ఆలోచిద్దాం. నేను మన వాళ్ళు పైన చెప్పినట్లుగా ఏదో ఆదుర్దాతో, ఏదోబాధతో, ఎంతసేపూ డబ్బు పోగుచెయ్యాలనీ, కుప్పలు పొయ్యాలనీ ప్రయత్నంచేస్తూ కాలంగడుపుతున్నారని మనవిచేశాను. అయితే ఏమిటీ ఆదుర్దా? ? ఎందుకది? దాన్ని మనం ఎంత వరకు న్యాయంగా అనుభవించి సహించి తీరాలి-అన్నవిషయం విచారిద్దాం.

విపరీతంగా పెరిగిపోయిన నాగరకతా ప్రపంచంలో మనం నివసిస్తున్నా-ఆదిమనివాసులు పల్లెల్లో అడవుల్లో నివసిం చిన విధంగా నివసించగల్గితే అది మనకు కొంతవరకు ఉప యోగకరంగా ఉంటుంది. ముందు "అప్పటివాళ్ళ నిత్యజీవితా వసరాలు ఏమిటి? వాటిని సంపాదించుకోడానికి వాళ్లు ఏమి చేశారు?" అన్నవిషయాలు తెలుసుకోవాలి. అతి పురాతన కాలాలలో ఈ వెర్రినాగరికత ఇంతగా బలియక పూర్వం మనుష్యులు తమకు అత్యవసరమైన వస్తువులనుమాత్రమే సంపా దించుకొనేవారు, అవిమాత్రమే విపణివీథుల్లో దొరికేవి. ఆ తర్వాతమాత్రమే విలాసవస్తువులు-నిజాని కివి లేకపోతే జీవితం గడవకపోదు-దుకాణాలలో కన్పించడం మొదలుపెట్టాయి.

మానవుల ఆకారాలు బహుళ వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ వుండవచ్చును. అవి మారుతూ ఉండవచ్చునుకూడా. కాని మానవుల అస్థిపంజరంలో మార్పు ఉండదు. అన్ని అస్థిపంజరాలూ ఒక్కలాగానే కన్పిస్తాయి. సరిగ్గా అల్లాగే మానవ జీవితంలో "అత్యవసరాలు" అన్నవి కొన్ని ఉన్నాయి. మనుష్యులకు అవిలేనిదే గడవదు. అవుగో అవి ఎప్పుడూ ఒక్కలాగే ఉంటాయి - అస్థిపంజరాల్లాగా. ఇంక పోతే, విలాసవస్తువులు మానవుల ఆకారాదులలాగానే కాలాన్నిబట్టి మారుతూ ఉంటాయి.

## ప్రాథమికావసరాలు:

వేటిని మానవుడు తన సొంతపరిశ్రమవల్ల సాధించాడో, ఏవైతే బహుకాలంగా ఉపయోగంలో నిలచిపొయ్యాయో, మొరటుతనంవల్ల కానీండీ - పేదతనంవల్ల కానీండీ - వేదాంత జ్ఞానాభావంవల్ల కానీండీ - వేటినైతే అతడు విడనాడలేక పోయాడో, ఏవి లేకపోతే అతను జీవించలేడో అవుగో అవి మాత్రమే నా దృష్టిలో ప్రాథమికావసరాలు.

చాలా ప్రాణులకు ఆహారము - తిండి అన్నది మొట్ట మొదటి జీవితావసరం. అదిలేనిదే అవి బ్రతకలేవు. ఆ తర్వాత ఇల్లూ - వాకిలీ లేదా ఏదో ఒక నీడపట్టు, ఇంత తిండీ, వాతావరణపు మార్పులనుంచీ శీతోష్ణాల ఉద్ధతినుంచీ - రక్షించుకోవడానికి ఒక నీడపట్టు - ఏటికంటే అదనంగా జంతు కోటికి మరేమీ అవసరంలేదు.

మానవుని జీవితావసరాలు ఇంకా కొంచెం ఎక్కువ.

ఆహారం, ఉండడానికి ఇల్లు, కట్టుకోడానికి గుడ్డా ఇవికాక వంట చెరుకు - వీటిని ముఖ్యావసరాలుగా చెప్పుకోవచ్చును. ఇవి సంపాదించుకొనేంతంత వరకూ మానవుడు ఇంతకంటె భిన్నమైన, ఇంతకంటె ప్రధానమైన పారమార్థిక సమస్యలను గురించి స్వేచ్ఛగా విజయోత్కంఠతో ఆలోచనకు దిగనే దిగడు.

మానవుడు ఇల్లు కట్టుకోవటమే కాక వస్త్రాలు నేయడం కూడా నేర్చుకొన్నాడు. అనుకోకుండా నిప్పుచేయడం-తలవని తలంపుగా దానివలన కలిగే వెచ్చదనాన్ని అనుభవించడం జరిగిన పిదప దానికి అలవాటుపడ్డాడు. ఇది "అలవాటు" అని ఎందుకు అన్నాననూ అంటే ఈ దేశంలో కూడా కొన్ని జాతులవారు అగ్నికి అల్లంతదూరంలోనే ఉండిపోయి - మరీ దగ్గరగా కూర్చుని చలికాచుకొంటున్న వాళ్ళను దూరంనుండే చూచి "అంత వేడిని వాళ్ళు ఎల్లా భరిస్తున్నా రబ్బా" అని ఆశ్చర్యపడతారు. అలాగా ఆశ్చర్యపడే ఆ మనుష్యులు - నిజానికి మన అందరికంటె శారీరకమైన దార్ఢ్యం కలవాళ్లే. అయితే - అల్లాంటి వాళ్ళ శారీరక దార్ఢ్యాన్ని - ఈనాటి నవ నాగరకుల మనోవికాసాన్ని విజ్ఞానాన్ని కలిపి ఒక్కచోట చూడగలిగితే ఎంత బాగుండును అని అనిపిస్తుంది. అదేమంత అసాధ్యమైన విషయం కాదు కదా!

"లైబిగ్" అనే ప్రసిద్ధజర్మను శాస్త్రజ్ఞుని సిద్ధాంతాన్ని అనుసరించి మానవుని శరీరం ఒక "స్టవ్" వంటిది. ఆహారం, శరీరానికి దహనశక్తిని ఇస్తుంది. మానవుని ఊపిరితిత్తులలో ప్రతీక్షణమూ దహనశక్తి ఉద్భవిస్తూఉంటుంది. కనుక ఆహారము వంటచెరుకు వంటిది. చలికాలంలో మనం కొంచెం

ఎక్కువ తింటాం. అలాగే వేసంకాలంలో కొంచెం తక్కువ తింటాం. ఈ తిన్న ఆహారము దహనశక్తిని కలిగిస్తుంది. ప్రాణంతో శరీరాన్ని నిలబెడుతుంది. ఇది తక్కువైతే అనారోగ్యమూ, అసలు లేకపోతే మరణమూ, సంభవిస్తుంది. ఇది జంతుకోటికి అంతటికీ సామాన్యధర్మం- మానవునిలో ఆహారం వల్ల ఉద్భవించిన "వేడి" అతడు కట్టుకొన్న వస్త్రాలవల్లా, ఉంటూఉన్న ఇంటివల్లా చెదరిపోకుండా తగ్గిపోకుండా సురక్షితమవుతున్నది. ఈ విషయం అర్థంచేసుకొంటే చలిమంటల అవసరా నవసరాలను మనం అర్థంచేసుకోవచ్చు ననుకొంటాను.

మనవాళ్లు క్రమంగా వంటచేయడం నేర్చుకొన్నారు. వంటచెరుకు సాయంతో ఆహారం పక్వమవుతోంది. మానవుడు నాగరకతాది విషయాల్లో క్రమంగా అభివృద్ధిచెందిన తర్వాత కాలాల్లోనే అది అవసరమైనదిగా మారిందని నా అభిప్రాయం. సరే ఇంతకూ తిండీ, గుడ్డా ఉండడానికి ఇల్లూ వండుకోవడానికి వంటచెరుకూ అవసరమని తేలింది. మానవుడు వీటి సంపాదన కోసం అష్టకష్టాలూ పడతాడు. అయితే నిజం మాట్లాడవలసి వస్తే ఈ నాలుగుఅవసరాలలోనూ వస్త్రాలు-ఇల్లూఅనేవి(మనం సాధారణంగా ఎంచుకొనే పద్ధతినిబట్టి చూస్తే) సగానికి సగం అనవసరమనే అనిపిస్తుంది. ఎటొచ్చీ అసలు విడచిపెట్టలేనివల్లా ఒక్కతిండి. అదికూడా చాలా స్వల్పమైన శ్రమతో లభిస్తుంది. దాని కోసమై ఇంత అవస్థపడనక్కర్లేదు. ఈ ధనాశాపరులు ప్రపంచంలో నలుమూలలకూ - అనాగరకమూ అనారోగ్యకరమూ అయిన ప్రదేశాలకూ పోయి ఇరవైముప్పైఏళ్ళు అక్కడే గడిపి, ధనం సంపాదించుకొని తిరిగి ప్రవాసపడి

స్వస్థలాలకు చేరుకొని ఆపని మరణించడం చూస్తూనే ఉన్నాము. వాళ్ళు అవసరాన్ని మించిన ప్రయాస పడు తున్నారు; అదనంగా ఆరాటపడుతున్నారు. అదంతా ఒట్టి వెఱ్ఱిబాగులతనం కాకపోతే మరోటూ చెప్పండి! మనం విలాసాల కనీ - అదనపు సౌఖ్యాలకనీ తెచ్చిపెట్టుకొనే అనేక వస్తువులు, అనేక విషయాలు, త్యజించడానికి వీలులేని వస్తువులు, విష యాలూకావు; అలా కాకపోవడమే కాక అవి మానవజాతి పురోభివృద్ధికి స్పష్టమైన - నిర్దుష్టంగా కన్పించే పెద్ద ఆటంకాలు కూడా.

ప్రపంచంలో విజ్ఞానవేత్తలందరూ, విలాసాలనూ, సౌఖ్యాలనూ త్యజించి ఈనాటి పేదవాళ్ళ బీదతనంకంటే ఎక్కువ బీదతనంలో, అతి సామాన్యంగా సాధారణంగా జీవి తాలు గడిపారు. చైనాలో, హిందూదేశంలో, పర్షియాలో, పూర్వీకులయిన వేదాంతులందరూ అతి దారిద్ర్యాన్ని స్వీక రించి అనుభవించారు. పైకిచూస్తే వాళ్లు ఎంతో బీదవాళ్ళలా కన్పిస్తారు. ఆతరంలోనో! వాళ్లు ఆత్మశక్తిని ఎంతగా పెంపొం దించుకొన్నారో !

ఆయాజాతుల్లో నవీనులయిన సంఘ సంస్కారులూ, వేదాంతులూకూడా అల్లాగే ఉన్నారు. బీదరికాన్ని అంగీక రించి సామాన్యమైన జీవితం గడపగలవాడు మాత్రమే ప్రపం చాన్ని నిష్పాక్షికమైన, జ్ఞానయుతమైన దృష్టితో పరిశీలించ గలడు; దర్శించగలడు. వ్యవసాయంచేసినా, వ్యాపారంచేసినా, సాహిత్యసేవ చేసినా, మరోటిచేసినా భోగ విలాసాలతో జీవించే వాడికి జీవిత ప్రతిఫలం విలాసమే అవుతుంది.

ఈరోజున ప్రపంచంలో చాలామంది - ఆమాటకు వస్తే - కోట్ అంటే కోటిమంది - వేదాంత శాస్త్రజ్ఞులు - వేదాంతపండితులు ఉన్నారు. నిజమైన వేదాంతులులేరు అంటే- ఆయా వేదాంతపండితులు వేదాంతాన్ని గురించి మనందరికీ పెద్దగా బోధించగలుగుతారే కానీ అనుసరించలేరు. ఆ బోధ లను వారు ఆచరించరు.

సూక్ష్మమైన ఆలోచనలు చేసినంతమాత్రాన కాక, కొన్ని నూతన తాత్త్వికసిద్ధాంతాలను కనిపెట్టి ఒక క్రొత్త పథాన్ని స్థాపించినంతమాత్రంచేత, వారు వేదాంతులైపోరు. "వేదాంతి" అన్నవాడు నిజమైన జ్ఞానాన్ని ప్రేమించాలి. ఆ జ్ఞానం ఎల్లా ప్రబోధిస్తుందో అట్లా నడచుకోవాలి. ఎటువంటి ఆడంబరమూ, ఆర్భాటమూ లేకుండా అతి సామాన్యంగా స్వేచ్ఛగా జీవితం గడుపుకోవాలి. ఆత్మశక్తినీ ఆత్మవిశ్వాసాన్నీ పెంపొందించుకొని ఉత్తమస్థాయిలో జీవితాన్ని గడుపుకోవాలి. అదుగో అతడూ వేదాంతి అంటే. వేదాంతమూ అన్నది కొన్ని జీవితసమస్యలను వాగ్రూపంలో కాదు - క్రియారూపంలో - పరిష్కరించేదిగా ఉండాలి. (కానీ దేశం లోని ప్రసిద్ధులయిన పండితులు, బుద్ధికుశలురు ఈ విషయా లలో సంపూర్ణమైన ప్రయోజనాన్ని సాధించలేక పోతున్నారు. వారు కేవలం తమ తాత తండ్రులు ఎలాగా ఏమిచేశారో సరిగ్గా అలాగే తామూచేస్తూ వాళ్ళమార్గాన్నే అనుస రిస్తున్నారు.)

అసలు మనుష్యులు ఎందుకిల్లా నానాటికీ క్షీణదశకు దిగుతున్నారు? ఎందుకిల్లా కుటుంబాలకు కుటుంబాలు విచ్ఛిన్న

మవుతున్నాయి? జాతులకు జాతులను బలహీనపరచి నాశనము చేసే స్వభావం ఈ భోగవిలాసాలలో ఏమున్నదీ? అలాటి స్వభావమేదో మనలో కించిత్తుకూడా లేదని నిష్కర్షగా చెప్పగలమా? అవన్నీ అలా ఉంచండి.

నేను పైన పేర్కొన్న విధంగా అనేకవిధాల శరీరానికి వెచ్చదనాన్ని - వంట్లోనూ వంటికీ, కలిగించి శరీరసౌఖ్యాన్ని చేకూర్చుకొన్నాక మనిషికి ఇక కావలసిం దేమిటీ? మళ్ళీ అదేరకమైన వెచ్చదనంకాదు కదా! అంటే ఇంకా ఎక్కువ ఖరీదైన ఆహారమూ ఇంకా విశాలమైన పెద్దపెద్ద భవంతులూ తాన్లకు తాన్లు గుడ్డలూ, ఎప్పుడూ చల్లారకుండా వెచ్చదనాన్ని ఇచ్చే నెగళ్లూ - ఇదికాదు కదా! జీవితానికి కావలసిన అత్యవసరమైన వస్తువులేవో లభించగానే అతను అందుకు ప్రత్యామ్నాయంగా చేయవలసినది మరొకటి ఉన్నది. ఇంకా వాటినే అధికతరంగా కోరుకొంటూ తాపత్రయపడుతూ కూర్చోడానికి బదులు కష్టపడ్డ తర్వాత విశ్రాంతి దొరికింది కనుక ఇంక అతను ఆత్మను గురించిన ఆలోచనలు చెయ్యాలి.

పారలౌకికవిషయ సాధనకు లౌకిక వస్తుసంపద కొంత వరకు కావలసినదే. కాదనను. భూమిలోనికి పాతుకొనిపోయి దాగిఉన్న చెట్లవేళ్ళను చూడండి. ఆ వేళ్ళు తగిన బలాన్ని చేకూర్చుకోగానే ఆ చెట్లు పైకి ఎగిరి ఆకాశం అంటుకొంటాయి. ఆ చెట్లకు ఆ వేళ్ళు ఒక్కటే ముఖ్యం కానట్టు మనుష్యులకు లౌకిక వస్తుసంపాదన ఒక్కటే ముఖ్యవిషయం కారాదు. అతడు తన అవసరాలు తీరగానే మానవజాతి ఆత్మౌన్నత్యాన్ని గురించి చింతనం చెయ్యాలి.

వృక్షాలలో ఉత్తమజాతి వృక్షాలు కొన్ని పైకి ఎదిగి ఫలాలను కాస్తాయి. ఆ వృక్షాలు ఆ పండ్ల వల్లనే ప్రసిద్ధి చెందుతాయి. రెండు మూడు సంవత్సరాలు మాత్రమే బ్రతికే కొన్ని మొక్కలు వేళ్ళను భూమిలోకి నాల్గు వైపులా బరపి బలం చేకూర్చుకొనే ప్రయత్నం చేస్తాయి. వాటిని, పువ్వులు పూయక ముందే, తలలు కత్తెర వేస్తూ ఉంటారు. వాటి ప్రయోజనం అంతే. అల్లాగే మనుష్యుల్లో ఉత్తములు జీవితావసరాలు తీరగానే ఆత్మచింతనంలోపడి సత్ఫలితాలు పొందుతారు. ప్రసిద్ధి సంపాదిస్తారు. సామాన్యులు కేవలం లౌకికవిషయాల్లో పడిపోయి జీవితాంతమూ, ఎటూ తేలక కొట్టుమిట్లాడుతూ ఉంటారు.

ధైర్యమూ-దార్ఢ్యమూగల ప్రవృత్తితో మెలిగే మనుష్యులకొరకు నేనీ నియమాలు చెప్పడంలేదు. వాళ్లు స్వర్గంలో ఉన్నా నరకంలోఉన్నా తమవిషయాలు తాము స్వయంగా నిబ్బరంగా చూచుకోగలరు. బహుశా వారు ఇంకొక నాలుగు మేడలు కట్టుకొంటారు. దేశంలోని ధనాధిపతులకంటె ఎక్కువగా స్వేచ్ఛగా, విచ్చలవిడిగా సొమ్ము వ్యయపరచుకొంటారు – తాము ఎల్లా జీవిస్తున్నామో అన్న ఆలోచన లేకుండానే గడిపివేస్తారు. మరికొందరు ఎప్పటికప్పుడు తామున్న పరిస్థితిలోనే ప్రోత్సాహాన్నీ, ఆవేశాన్నీ తెచ్చుకొంటారు. అటువంటివాళ్ళను గురించీ కాదు. మరికొందరు ఉన్నతోన్నతపదవులు అలంకరించి ఉంటారు. ఆ పదవికి ఉన్నతమోకాదో, తాము చేస్తున్న ఆ ఉద్యోగం గొప్పదో కాదో వాళ్ళకే తెలియాలి. అటువంటివాళ్ళను గురించీ కాదు. నేనీ

చెప్పటమంతా సామాన్యప్రజాబాహుళ్యాన్ని గురించి; వాళ్ళ నుద్దేశించి. తాము న్న అధ్వాన్నయుగాన్ని గురించి మొరపెట్టు కొంటూ, అసహనంతో, అసంతృప్తితో బాధపడుతూ, ఉండే వాళ్ళకోసం చెబుతున్నాను. ఈ నియమాలు, వాళ్ళల్లో బీద వాళ్ళూ ఉంటారు. ధనవంతులూ ఉంటారు. బీదవాళ్ళేమో తాము తనువిధులన్నీ జాగ్రత్తగా, సక్రమంగా, శ్రద్ధగా నిర్వ ర్తిస్తూనే ఉన్నా తమకు అసౌఖ్యమే, అశాంతియే దక్కుతున్న దని బాహాటంగా, నిర్భయంగా చెప్పేస్తున్నారు. ఇక ధనవంతుల విషయం చూద్దామా అంటే వాళ్ళస్థితి అంతకంటే అధ్వా న్నంగా ఉన్నది. వాళ్ళు పైకి భాగ్యవంతులుగా కన్పించినా ఆంతరంలో వాళ్ళకంటే నిర్ధనులు ప్రపంచంలో మరొకరు ఉండరు. అంతశ్రమపడి పోగుచేసిన ధనాన్ని ఎలా వ్యయ పరచాలో వారికి తెలియడం లేదు పోనీ ఆపీడ ఎలా వదలించు కోవాలో కూడా అర్థంకాదు. అందువల్ల వాళ్ళు కోరికోరి తమంతటతాము తమచేతులకు బంగారపు సంకెళ్ళు తగిలించు కొంటున్నారు. స్వేచ్ఛనూ, సౌఖ్యాన్నీ కోల్పోతున్నారు!

నేను నా గతజీవితాన్ని ఎలా గడిపానో చెబితే పాఠ కులు ఆశ్చర్యపడకమానరు. క్లుప్తంగా చెబుతాను. ప్రకృ తితో సన్నిహిత సాహచర్యాన్ని సంపాదించాను. అన్ని రకాల వాతావరణాలలోనూ స్వేచ్ఛగా కాలంగడిపాను. నా యింటి ముందు "ఇతరులు లోనికి రాకూడదు" అని గానీ అటువంటి అర్థాన్ని ఇచ్చే మరోమాటకానీ వ్రాసినబల్లను కట్టుకోలేదు. అడవిలో దొరికే కాయలతో దుంపలతో ఎక్కువగా కాలం గడిపాను. అక్కడ నా కార్యకలాపాలన్నీ నిరుపయోగ

కరమైనవే కావచ్చును. అనుభూతి గొప్పది. నా వేటకుక్కా, నా గుర్రమూ, నేను పెంచుకొంటున్న పావురం ఒక్కటీ అక్కడ నే నుంటూఉన్న రోజుల్లో తప్పించుకొనిపోయాయి. వాటికోసం వెదకుతూ కొంతకాలం గడిపాను.

అందరికంటెముందుగా తెల్లవారుఝామునే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొంటూ విశ్రాంతిగా బ్రతికాను, తీరికగా హాయిగా తృప్తిగా బ్రతికాను.

అక్కడ వీచే ప్రతి మలయపవనమూ - నవనవమైన శోభతోవచ్చిన ప్రతి వసంతమూ నాకు ఎంతో మనశ్శాంతి నిచ్చాయి. వాటి మాధుర్యాన్నీ, ఆర్ద్రతనూ, ఆంతర్యాన్నీ, సౌహార్ద్రాన్నీ చూడగలిగాను. అల్లా చూడడానికే రోజులకు రోజులు గడిపాను. జీతం భత్యం లేకుండానే మంచుతుపాన్ల రాకపోకలను బహుజాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండేవాణ్ని. ఈ పనులుకాక మరొక పనికూడా చేస్తుండేవాణ్ని. ఒక పత్రికకు వ్యాసాలు వ్రాస్తుండేవాణ్ని. దానికి విలేఖరిగాకూడా ఉండే వాణ్ని. కానైతే దానిమూలకంగా నాకేమీ ధనరూపంలో ప్రతిఫలం ముట్టేదికాదు. అందువల్ల అప్పట్లో నాకు - స్థిరంగా ఇంతజీతం - నెలవారీగా ఇంతసొమ్ము అనంటూ ఏవిధమైన రాబడీ - లేదనే చెప్పుకోవాలి. అయితే అందుకు నేనెంత మాత్రమూ విచారించలేదు. ఆ విషయమై ఎవరితోనూ ఎవరి మీదా పితూరీలు చెప్పుకోలేదు. పైపెచ్చు నేను స్వేచ్ఛగా, సుఖంగా కేవలం నా స్వశక్తిపై ఆధారపడుతూ నిశ్చింతగా బ్రతకడానికే నిశ్చయించుకొన్నాను.

నేను వాల్డన్ చెరువు ఒడ్డున నివసించడానికి వెళ్లింది

ఏదో చవకగా జీవితం గడుపుదామనీ కాదు; చాలా ధనం పట్టుకొనివెళ్లి దుబారాచేస్తూ దర్జాగా విలాసంగా గడుపుదామని అంతకంటేనూ కాదు. అక్కడికి నేను ఒకానొక స్వవిషయాన్ని - సొంత వ్యాపారాన్ని, స్వీయ కార్యక్రమాన్ని ప్రకృతి సహాయంతో సాధిద్దామని - సాగిద్దామని వెళ్లాను.

అందుకూ వెళ్ళింది.

దుస్తులు:

ఇంక దుస్తుల సమస్య; దుస్తులు, ప్రధాన అంశాన్ని చర్చిస్తాను. మనమంతా ముఖ్యంగా క్రొత్తక్రొత్త దుస్తుల కోసం ఆరాటపడుతుంటామనీ, వాటి వాటి, ప్రయోజనం మాట అలాఉంచి, వాటిని చూసి లోకులు ఏమనుకొంటారో, వాళ్ళ ఆలోచనలు ఏట్లాఉన్నాయో అని ఆదుర్దాపడుతుంటామని సర్వవిదితమే. అయితే దుస్తులవల్ల మనకు కలిగే ప్రధానప్రయోజన మేమిటో జ్ఞప్తికి తెచ్చుకొనమని కోరుతున్నాను. శరీరానికి ముఖ్యంగా అవసరమైన వెచ్చదనం ఉండడానికీ, ప్రస్తుత సంఘపరిస్థితుల ననుసరించి నగ్నత్వాన్ని కప్పుకోడానికీ, దుస్తులు వేసుకొంటారు. కావలసిన వాటికంటె ఎక్కువ దుస్తులు సంపాదించుకొనే బదులు ఇతరత్రా - ఎంత ప్రధానమైన ఇతర కార్యక్రమాన్ని నిర్వహించవచ్చునో ఆలోచించమని మనవిచేస్తున్నాను.

రాజులూ రాణులూ తమకోసం ప్రత్యేకంగా ఏర్పాటు అయివుండే దర్జీవాళ్లు ఎంతో శ్రమపడి శ్రద్ధగాకుట్టి అందించిన

దుస్తులు ఒక్కసారి అలా తొడుక్కొని ఇలా విప్పి అవతల పారేస్తారు.

అసలు న్యాయంగా ఎంత మంచి దర్జీ కుట్టినా, ఆ గుడ్డ ఎంత మంచిదయినా ఆ కుట్టిన క్రొత్తదుస్తులు మనకు అలవాటు కావడానికి కొంతకాలం పడుతుంది, కొంతకాలం గడిస్తేనేకాని వాటి సౌఖ్యం మనం అనుభవించలేము. అందువల్ల ఆ రాజులూ ఆ రాణులూ దుస్తులవల్ల సహజంగా పొందవలసిన సౌఖ్యాన్ని, సౌఖ్యానుభూతిని పొందలేకపోతున్నారన్నమాట. అంటే దుస్తులు ఓసారి ఒంకెకు తగిలించి తీసివేసి నట్లవుతున్నదన్నమాట. ఒంకెలు ఎంత సౌఖ్యాన్ని పొందుతాయో వాళ్లూ అంతేనన్నమాట.

కాని అలా కాదు. ఒక జతదుస్తులు తీసి వాడితే - వాటికి ఆ వ్యక్తితో చక్కని సాన్నిహిత్యం కలగాలి. అతని శీలం, అతని ఆంతర్యమూ వాటికి కూడా అబ్బాలి. అప్పుడే వాటివలన సంపూర్ణమైన సౌఖ్యం మనకు లభిస్తుంది.

మాసికల చొక్కానో, బొంతరేగినకోటునో వేసుకొన్నంతమాత్రాన నా దృష్టిలో ఏవ్యక్తికీ విలువతగ్గదు. ఆ దృష్టితో ఏవ్యక్తినీ చిన్నచూపుచూడను. చూడలేదు. కాని ఈ సంఘంలో అధికసంఖ్యాకులు ఎంతమాత్రమూ చినగకుండా నాగరకంగా నలగకుండా ఏకాంచెమూ మాయకుండా ఉన్న దుస్తులు వేసుకోవాలని ఎప్పుడూ ఆదుర్దాపడుతుంటారు. ప్రశాంతమైన నిష్కల్మషమైన అంతరాత్మ, పవిత్రమైన ఆర్ద్రమైన హృదయమూ వీటివిషయంలో కంటె మంచి దుస్తుల విషయంలోనే పైమెరుగులు కూర్చుకోవడంలో వాళ్ళు

ఎక్కువ శక్తిచూపుతారు. చిన్న పరీక్ష ఒకటిపెట్టి నా పరిచయస్థులను పరిశీలిస్తుంటాను - ఎవరు ధైర్యంగా మాసిక వేసిన చొక్కా తొడుక్కోగలరా, ఎవరు మోకాళ్ళపైన మరో రెండుచిరుగులున్నా కుట్టుకోని అలాగే వేసుకొని తిరగ్గలరా అని. కాని చాలామంది నా పరీక్షలో పరాజితులయ్యారు.

చాలామంది తాము జీవితంలో అభివృద్ధిలోకి రావడానికై ఉండే సదవకాశాలన్నీ ఇందుమూలకంగా నాశనమైపోతాయనే నిజంగా భావిస్తారు. గాఢంగా విశ్వసిస్తారుకూడా. వాళ్ళు కాలి కెదురుదెబ్బ తగిలినా అవసరమైతే కుంటుకుంటూ వీధుల్లోకి వచ్చేయగలరు. కానీ లాగూకొంచెం చినిగితేమాత్రం రాలేరు, రారు. ధైర్యంచాలదు. ఓ పెద్దమనిషి కాళ్ళకు పొరపాటునో, గ్రహపాటునో దెబ్బతగిలితే మందు వేసి కట్టు కట్టించుకోవచ్చు. కాని ఆ పెద్దమనిషి లాగూకే అటువంటి ఇబ్బందేకలిగితే - అదే ఎక్కడో కాస్త చినుగుపడితే ఇంక అది పనికిరాదు. ఇంక ఆ విషయంలో తాను చేయకలిగిందేమీ లేనట్లుగానే భావిస్తాడు. ఏది మాననీయమూ అనికాదు అతను ఆలోచించేది దేనినా సంఘం గౌరవిస్తున్నదీ- అని. ఏది ఎక్కువమంది గౌరవంగా చెలామణీ అవుతున్నదీ అని. అదీ ఆరాటం. ఇంతఎందుకండీ - మీరొక దిష్టిబొమ్మనుపిట్టలనూ వాటిని భయపెట్టేందుకు ఉపయోగించేదైనా చాలును - మంచిదుస్తులు తొడిగి నిలువబెట్టి, దానికి మీరు కాస్త దూరంగా మీపాత దుస్తులతోనే నిలువబడి కాసేపు పరిశీలించండి. ఆ దారినపోయేవాళ్ళు మిమ్ములను తప్పించి ఆ

దిష్టిబొమ్మకు నమస్కారంచేసి పోతారో లేదో చూడండి. అంతచేటు గౌరవాభిమానాలు పెరిగిపోయాయి ఆదుస్తులమీాద.

ఆ దుస్తులను మినహాయిస్తే ఈ మనుష్యులలో ఎంత మందికి వాళ్ళవాళ్ళ గౌరవ మర్యాదలు నిలుస్తాయో, విచారించవలసిన విషయమేఅవుతుంది. అయితే ఇప్పుడు ఆలోచించి సరిగా చెప్పండి, ఎవరు గొప్పతరగతికి చెందిన మనుష్యులో; ఎవరు అట్లాకాదో! దుస్తులను ఆధారంగా చేసికొని మనుష్యులను విలువకట్టడమూ! ఎంతవిడ్డూరంగా ఉన్నదండీ! సర్వస్వతంత్రమైన, చక్కని ప్రజాస్వామ్య ప్రభుత్వమున్న మన ఈ అమెరికాదేశంలోకూడా ఏదో హఠాత్తుగానో, పొరపాటుగానో ఒకడికి ఇంత ధనంలభిస్తే, తత్కారణంగా అతను మంచి దుస్తులు వేసుకొని సంఘంలో ఆడంబరంగా కన్పిస్తే అతన్ని మీారంతా గౌరవించడమూ_వాటిని కొనుక్కోడానికి ఆర్థిక స్తోమత లేనివాణ్ని అగౌరవించడమూనా? ఇంతకంటె విచిత్రం మరొకటి ఉంటుందా?!...అలా కేవలం దుస్తులమూలంగా గౌరవాన్ని సంపాదించుకొనేవాళ్ళకు కాస్తంత జ్ఞానోదయం కలిగించాలనీ – వాళ్ళసంఖ్య ఎక్కువే అనుకోండి – అయినా వాళ్ళదగ్గరకు ఓ మతబోధకుణ్ని పంపించాలనీ నాకు మనసుగా ఉన్నందుకు మన్నించండి.

మరో బెడదకూడా వచ్చిపడింది వీటివలన. వస్త్రాల ఉపయోగం తెలియగానే కుట్టుపని ఒకటి వచ్చిపడింది. ఇక దీనికి అంతేలేదు. గుడ్డను ఎన్నివంపులుగా కత్తిరించడమో! ఎన్ని సోకులో-ఎంతకుట్టడమో! మరీ ఆడవాళ్ళ దుస్తులవిషయంలో ఈ కుట్టుపనికి అంతూపొంతూ ఉండదు.

జీవితంలో చేయవలసిన, నిజంగా ఉపయోగకరమైన "పని" అంటూ కన్పించిన వ్యక్తికి ఈ దుస్తులగొడవ పట్టదు. మానవజీవితంలోని ఆంతర్యాన్ని గ్రహించలేనివాడు దుస్తుల విషయమై ఎప్పుడూ ఆదుర్దా పడుతూ ఉంటాడు. నిజమైన "వీరుడు" అతి సాధారణ జీవనవిధానాన్ని స్వీకరించుతాడు. సామాన్యంగా నిరాడంబరంగా జీవిస్తాడు. అతడు పనిమీద బయలుదేరినప్పుడల్లా మాటిమాటికీ బూట్లజత మార్చుకోడు. అలాగే దుస్తులున్నూ. ధనవంతులు తరచుగా ఏర్పాటుచేసే విందులకూ, శాసనసభలకూ తప్పక హాజరయ్యే కొంతమందిని మాత్రం – రంగులుమార్చే కొంతమంది రాజకీయవాదులను మాత్రం – తరచు ఓ క్రొత్తకోటు వేసుకొని వెళ్ళనీయండి; కోట్లు మార్చుకోనీయండి – మనస్సులూ పతాలూ తరచు అవకాశాన్ని బట్టీ, అవసరాన్ని బట్టీ మార్చుకొంటున్నట్లే. అది వాళ్ళకు సరిపోతుంది. ఈ చొక్కా, ఈ పంట్లామూ, ఈ బూట్లూ, ఈ హేటూ, వీటితోనే భగవంతుణ్ణి నేను పూజించ డానికి వీలున్నప్పుడు నాకు మరో దుస్తులెందుకూ ? ఇవి చాలవూ ! క్రొత్తకార్యాలు సాధించేందుకు మన శక్తి సామ ర్థ్యాలవిషయం చూచుకొందాము. అంతేకాని దుస్తులప్రసక్తి ఎందుకూ !

నీకొక క్రొత్త ఘనకార్యాన్ని సాధించవలసివస్తే – నీ శక్తిసామర్థ్యాలను ప్రదర్శించి వాటిని సాధించు – పాత దుస్తులతోనే ఆపని చెయ్యి. వాటిని అంత తొందరగా మార్చేయవలసిన అగత్యమేమీ లేదు. నీవు – నీ వ్యక్తిత్వమే నీ స్వభావమే మారిపోయినప్పుడు దుస్తులను మార్చుకో –

అభ్యంతరంలేదు. అప్పటిదాకా ఆ సూటు ఎంత పాతపడినా ఎంత దుమ్ముకొట్టుకొనిపోయినా మార్చను. అసలు ఈ విషయం పట్టించుకోక ఏదైనా ఒక ఉత్తమమైన సాధనకు ప్లానుకో. అందుకు ముందుకువెళ్లు. దుస్తుల సహాయంతో వేషాలు వేస్తూ వాటిని మాటిమాటికీ మారుస్తూ తిరుగుతూ ఉండడముచేత మనకు మొత్తముమీద ఎక్కువ చెరుపేజరుగుతుంది కాని మేలు కలుగబోదు.

దర్జీతో "నా కిలాంటిదుస్తులు కుట్టివ్వు" అని అడిగితే అతను తీవ్రాలోచనా పరుడైనట్లు ముఖంపెట్టి "వాళ్ళంతా ఇలా కుట్టించుకోవడంలేదండీ" అంటాడు. వాళ్ళట – వాళ్లు; గ్రీకుపురాణకథలలో వచ్చే "ఫేట్సు" వంటి వాళ్ళని కాబోలు (ఫేట్సు దేవతలు – వారు మనుష్యులను వ్యక్తి భేదంలేకుండా అర్హతలనుబట్టి సన్మానించేవారు – కాక దండించేవారు. వాళ్ల మాటకు తిరుగులేదు.) ఆదర్జీనిఒప్పించి నాకు కావలసిన విధంగా దుస్తులు కుట్టించుకోవడం కష్టమైపోతోంది. ఎందుకంటే అతను అనాటి సోకుకు భిన్నంగా కుట్టాలని నేను అగుడుతున్నట్లు నమ్మలేకపోతున్నాడు. పైగా నేనేదో తొందరపాటుగా మాట్లాడుతున్నాననికూడా ఆపోహపడడం,కూడా. "వాళ్ళా-వాళ్ళకూ నాకూ ఏమిటి సంబంధం? అయినా ఇది నా సొంత విషయం. ఇందులో వాళ్ళ ప్రమేయం ఎందుకూ?" నాకు కొంచెం చిరాకువేసింది. కాని నెమ్మదిగా ఇలా సమాధానం చెప్పవలసి వచ్చింది. "నువ్వు చెప్పిందీ నిజమే. మొన్న మొన్నటిదాకా వాళ్ళు ఇలా కుట్టించుకొనేవాళ్లు కాదుకాని, ఇప్పుడు కుట్టించుకొంటున్నారు." అన్నాను. అతడు నన్నూ –

నా శీలాన్నీ, వ్యక్తిత్వాన్నీ (వాటిని విలువకట్టడానికి బదులు) కొలవడానికి బదులు కేవలం నా చేతుల కొలతలు తీసుకో బోయాడేఅని విచారపడ్డాను. అవడానికి ఆ దర్జీ మంచినేర్పరే అట. గుడ్డ కత్తిరించడంలోనూ కుట్టుపనిలోనూ మాంచి సోకులు తెలిసినవాడట. కాని......ఇంక ఆ విషయం వదిలి వేస్తాను. ఇంతకూ ఈ కథంతా ఎందుకు చెప్పానంటే - మను ష్యులు - సౌందర్యాన్ని ఆరాధించడంలేదు, కేవలము ఫేషన్లను అనుసరిస్తున్నారు. అనుకరణలు పెరిగిపోతున్నాయి. అక్కడ పారిస్‌నగరంలో ఆ సోకుల నాజూకుల మహానగరంలో, ఒక కోతి, ప్రయాణీకులు పెట్టుకొనే టోపీపెట్టుకొని ఒక్క సారి అలా కులికితే ఇక్కడా అమెరికాలోకూడా కోతులన్నీ అదేపని చేస్తాయి - సరిగ్గా అలానే కులుకుతాయి.

అంతేకాదు. మొత్తంమీద ఒక్క అమెరికాలోనే కాక ఇతరదేశాల్లోకూడా దుస్తులవిషయంలో సోకులకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. అంతటా అనుకరణ మరీ ఎక్కువ అయింది. దొరికిందల్లా తొడిగేసుకోడానికి జనం ఆతురత పడు తున్నారు. ఏదో తుఫానుగాలికి పగిలిపోయిన ఓడనుండి ప్రాణాలు కాపాడుకొని ఒడ్డుకు చేరుకొని సాధ్యమైనంత దగ్గ రలో సాధ్యమైనంత తక్కువ వ్యవధిలో దొరికిన దుస్తులనల్లా పైన వేసుకొనే నావికుల్లాగా ప్రవర్తిస్తున్నారీ జనం! పైగా అలా వేసుకొని ఒకళ్ళదుస్తులనుచూచి మరొకళ్ళు హేళనగా నవ్వు కొంటున్నారు!

ప్రతితరంవారూ పాతతరాలవారి నాగరకతను చూచి వారి సోకులనుచూచీ నవ్వుతారుకాని తామేమో గ్రుడ్డిగా

క్రొత్తసోకులను అనుకరిస్తారు. ఎక్కడికో పోనక్కరలేదు - క్రిందటి శతాబ్దపు మహారాజుల చిత్రాలనుచూచినప్పుడు వాళ్ల దుస్తులు మొరటుగా ఉన్నాయని - వాళ్ళు బహుశా మానవ మాంసం భక్షించే జాతులకు నాయకులై, రాజులై ఉంటారని అంటూ పరిహాసాలాడుతూ ఎంతో అవహేళన చేస్తారు ఈనాటివారు.

అసలు దుస్తులను నిదానించిచూస్తే మనిషి ఎంత విచిత్రంగా క్రొత్తగా అగుపిస్తాడో!! అప్పుడు ఎంతో జ్ఞానం ఉండి, నిగ్రహం ఉండి, కేవలం జీవ చైతన్యాన్ని నగ్నంగా యథాతథంగా చూడగలిగినవాడుతప్ప మరొకరు, సామాన్యుడు నవ్వు ఆపుకోలేడు. కనుక చెప్పవచ్చిందేమంటే దుస్తులకు అంతచేటు ప్రాధాన్యాన్ని ఆపాదించవద్దూ అని. "భీముడు" అన్నవాడు యుద్ధంలోకి వెళ్లి పోరాడేటప్పుడు అతి జే దుస్తుల్లో వెళితే ఏం? ఏదుస్తుల్లో పీరస్వర్గం అలంకరిస్తేనేం? సరిగ్గా అతడు ఏదుస్తులు వేసుకొని మరణించాడన్న మీమాంస దేనికి? అదికాదుగా మనం గణించవలసింది. అదికాదు మనకు కావలసింది. ఆతని వ్యక్తిత్వం మనకు కావలసింది. ఈవిషయంలో ఎందువలనో కాని మనుష్యుల అభిరుచులు మరీ చిలిపిగా మొరటుగా కన్పిస్తున్నాయి. నాజూకులూ, సోకులూ దినదినం, క్షణక్షణం మారిపోతున్నాయి. కెలిడోస్కోపు యంత్రలోగుండా వస్తుదర్శనం చేస్తూ కాస్త కదిలించినప్పుడల్లా ఎన్నిరకాల బింబ ప్రతిబింబాలు కన్పిస్తాయో అన్నిరకాల సోకులు ఈనాడు కన్పిస్తున్నాయి లోకంలో. ఇక వ్యాపారస్తులు ఈవిషయాన్ని పసిగట్టారు, బాగా డబ్బుచేసుకొంటు

న్నారు. ఇక్కడ జరిగే చిత్రమేమిటి అంటే, కాస్తంత తేడాతో రెండురకాల వస్తువులు, రెండు భిన్నమైన రంగుల్లో వచ్చాయనుకోండి, మొదటివారంలో ఒకరకం ఒకరంగు వస్తువులు విపరీతంగా అమ్ముడుపోతాయి. మరోవారంలో నాజూకు మారిందంటారు. ఆపళంగా, దాంతో రెండోరకం అమ్ముడు పోతాయి. అప్పటికా రెండోరకమే అతి నవీనమైపోతుంది. ఆలెక్కనుచూస్తే పచ్చబొట్లు వేయించుకోవడముకూడా అనాగరకము కాదని అంటాను. పైపెచ్చు మంచిదికూడా. అందులో ఒక్క సుగుణమన్నా ఉన్నది. ఏమంటే అది ఆ పచ్చబొట్టు చర్మంతోఘన్నమై నిలకడగా కలకాలం ఉండిపోతుంది. మారకుండా ఉంటుంది.

ప్రజాబాహుళ్యానికై యంత్రాగారాలలో భారీపరిశ్రమలలో ఇంతఎత్తున గుడ్డలు తయారయ్యే ఈ ప్రస్తుత విధానంపైనా కేమాత్రం నమ్మకంలేదు. కూలీలస్థితి నానాటికీ అంతకంతకు దిగజారిపోతున్నది. ఇక్కడస్థితి-అక్కడ ఇంగ్లాండులో కంటె అధ్వాన్నంగా తయారయిపోతున్నది. అయితే ఎందుకిలాగ అవుతున్నదాఅని ఆశ్చర్యపడవలసిన అవసరమేమీలేదు; ఈ సమస్య అంత అర్థంకాని సమస్య కాదుగనుక. నేను విన్నదాన్నిబట్టీ, పరిశీలించినదాన్నిబట్టీ నాకు తెలియవచ్చిందేమంటే "వాళ్ళ ఆదర్శమే లోపభూయిష్టంగా ఉన్నది" అని ప్రజలు అందరికీ-అంటే అశేష ప్రజానీకంలో ప్రతిఒక్కరికీ సులభంగా గుడ్డలను అందచేద్దామని కాదు వారి ప్రధాన ఉద్దేశ్యము ఆదర్శము. అక్కడస్థాపించిన బ్రహ్మాండమైన యంత్రాగారాల-భారీపరిశ్రమల యజమానులు ఆనాటికానాడు ధన

వంతులు-కోటీశ్వరులు కావడమే. జానెడుగుడ్డ మొలకు చుట్టు కోవడం ఎలాగా అని జనం అల్లాడుతున్నా తాము కోటికి పడగెత్తడ మెలాగా అనే వాళ్ళ ఆరాటం.

ఈపద్ధతి చాలా అసంతృప్తికరంగా, ఆందోళనకరంగా ఉన్నది. ఏమైనా ప్రజలు అన్నివిషయాలలోనూ ఉన్నతమూ ఉత్కృష్టమూ అయిన ఆదర్శాలు కలిగిఉండాలి. కనీసం వారి ఆదర్శాలైనా ఉన్నతోన్నతములై ఉండాలి. అలా ఆదర్శాలు ఉన్నతములై ఉన్నప్పుడే-మొట్టమొదటి రోజుల్లో-ప్రథమ దశల్లో వాళ్ళు కొన్ని అపజయాలు నిశ్చయంగా పొంద వచ్చును-కాని తర్వాత అవరోధాలన్నిటినీ అధిగమించి వాళ్లు కొంతవరకైనా గొప్పకార్యాలు సాధిస్తారు. సాధించగిలుగు తారు; కాని వాళ్ళ ఆదర్శాలే, ఆశయాలే తక్కువస్థాయిలో ఉంటే ఇంక వాళ్ళు సాధించిగలిగేది ఎంత తక్కువస్థాయిలో, సాధారణమైనదిగా ఉంటుందో ఉండగలదో మనం తేలికగా ఊహించవచ్చును కదా!

## 2 గృహవసతి

ఇంక గృహవసతి. ఈ విషయంలో చాలామందికి అత్యవసరమైన అవసరాల్లో ఇది ఒకటి అని అనడానికి నాకేటు వంటి అభ్యంతరమూ లేదు. కాని కొన్ని విషయాలు చూడండి. కొన్ని ఇతర దేశాలలో మనకంటె ఇంకా ఎక్కువ చలిదేశాలలో కొంతమంది ఇళ్ళూ వాకిళ్ళూ లేకుండానే సంవత్సరంలో చాలాభాగం నిశ్చింతగా గడిపివేస్తున్న విషయం సత్యమే అయినా అవసరసౌకర్యమే. సామ్యూల్ యంగ్

అనే ఆయన ఇలా అన్నాడు "మరీ అధికంగా చలిగా ఉండే లాఫ్‌లాండ్ దేశాలలో వంటిపైన తోళ్లుకప్పుకొని తోలు సంచీలో దూరి, ఆ మంచులో హాయిగా జీవిస్తారు. ఆ మంచు నేలలపై ఆ చలిలోనే ఆరుబయటపడుకొని సుఖంగా నిద్ర పోతారు. కాని మనవాళ్లు ఎంతమంచి వున్నిదుస్తులు వేసు కొన్నా అక్కడ నిలువనైనా నిలువలేరు." అని అన్నాడు. కానీ ఆ మనుష్యులు ఇతర దేశాలవారికంటే ఎక్కువ దార్ఢ్యంగా లేరు అనికూడా వ్రాశాడు. సరే ఇక ఆ విషయం వదిలేద్దాము. మొత్తంమీద గృహం అనేది అందరికీ అత్యవ సరమే. అయితే ఆదిమానవులు కూడా ఈ అవసరాన్ని గుర్తించారనే చెప్పుకోవాలి. శరీర రక్షణకు తగు ఏర్పాట్లు చేసుకోవాలి. రానురాను తమకు కుటుంబ నిర్వహణకోసం కాస్తంత ప్రత్యేకమైన మరుగు కావలసివచ్చి ఉంటుంది. అటుపైనే అతనికీ ఇంటికీ అనుబంధం ఏర్పడి క్రమంగా బలీ యమై ఉండాలి. చలికాలంలోనూ వర్షకాలంలోనూ తప్ప మిగతా కాలాలలో నిజానికి మనిషికి ఇటువంటి రక్షణ అవస రంలేదు. కాస్త ఎండతగులకుండా చూచుకోగలిగితే చాలు; రాత్రిళ్లు పైన మంచు కురియకుండా కాస్త ఆచ్ఛాదన ఉంటే ఎల్లాగో సరిపెట్టుకోవచ్చును.

మనిషి, మొదటి రోజుల్లో- అంటే మానవుడు నాగర కుడుకాని కాలంలో - నగ్నంగా ఆరుబయట అడవుల్లో, లోయల్లోహాయిగా స్వేచ్ఛగాతిరిగేవాడు. ఈస్థితి ఏకాంతమూ ప్రశాంతమూ అయిన వాతావరణంలో మందమంద మలయా

నిలాలు ప్రసరించే శుభసమయాల్లో సౌఖ్యదాయకమేఅయినా, వర్ష కాలంలోనూ, చలికాలంలోనూ నష్టదాయకమే అవు తుంది. మానవుడు త్వరపడి ఏ గుహాలనో ఆశ్రయించి శరీరసంరక్షణ చేసుకొనకపోయిఉంటే అతడూ అతని జాతీ వేగం నశించిపోయే ఉండేదేమో ! బైబిలు కథను అనుసరించి ఆదిమానవులయిన "ఆదాము, ఈవు" ఆకులూ తీగలూ చుట్టుకొన్నారని కదా మనకు తెలియవచ్చేది. అల్లా ఉండేది ఆనాటిస్థితి. ఆ తర్వాత మనిషి వెచ్చగా సుఖంగా ఉండే నివాసస్థలము, ఇల్లు, కావాలని కోరుకున్నాడు. ఆకోరు కోడము ప్రధానంగా శరీరక్షణకోసమే. భౌతికమైన వెచ్చద నాన్ని పొందడం కోసమే; ఆతర్వాత కుటుంబం కోసం.

ఆరోజుల్లో, అంటే మానవ నాగరకత బాల్యావస్థలో ఉన్నప్పుడు, ఉత్సాహవంతుడూ, ధైర్యవంతుడూ అయిన ఒక మానవుడు శరీర రక్షణకోసం ఒకానొక కొండగుహాలో దూరి ఉంటాడనీ ఆతర్వాత అది అందరికీ ఆచరణసాధ్య మైందనీ ఊహించవచ్చును. ఈనాటి పిల్లలలో అప్పటి మానవుని స్వభా వాన్ని ఇప్పటికీ గుర్తించవచ్చును. చలిగా ఉన్నా, వాన కురు స్తున్నా పిల్లలు బయట ఆడుకోడానికే ఎక్కువ ఇష్టపడతారు. పెద్దవాళ్లు పిలిచి కోపగిస్తేనే కానీ వాళ్ళు ఇళ్ళల్లోకి రారు. కొండగుహాలనూ, కొండ చెరియలనూ చూసి మనం చిన్న ప్పుడు ఎంత ఆశ్చర్యపడ్డామో వాటిదగ్గరకు వెళ్ళడానికి ఎంత ఆసక్తి చూపేవాళ్ళమో! ఈవిషయాలు జ్ఞాపకం చేసుకో కుండా మనలో ఎంతమంది ఉండగలం! అవిగో అవే మన

పారంపర్యంగా సంక్రమించిన ఆదిమానవుని గుణాలు, అభిరుచులు. కొండగుహల తర్వాత మనిషి గృహనివాసానికి అలవాటుపడ్డాడు. మొదట తాటిఆకులతో, చెట్ల బెరడులతో, దుంగలతో కొసకు రాతిపలకతో, పెంకులతో ఇళ్లు కప్పుకోవడం నేర్చుకొన్నాడు. రకరకాల ఇళ్ళు కట్టుకోవడం మొదలుపెట్టాడు. చివరికి నేడు మనం బయట విశ్రాంతిగా గాలిలో జీవించడం అంటే ఏమిటోకూడా ఎరక్కుండా పోయాం. ఈనాడు మన యింట్లో ఉండే నెగడుకూ మన పొలానికీ ఎంతో దూరమున్నదని అనిపిస్తుంది. అసలు బయటకు రావడమే కష్టమైపోతున్నది. నిజంగా కొన్ని రాత్రిళ్ళూ పగళ్ళూ హాయిగా నిశ్చింతగా, సూర్యచంద్రులకూ నక్షత్రాలకూ, మనకూ మధ్య ఇంటి నాలుగ్గోడలూ, ఇంటి కప్పులూ ఈ అడ్డుగోడల ఆటంకాలు లేకుండా గడపగలిగితే ఎంత సుఖంగా ఉంటుందీ!

కవులూ గాయకులూ, వేదాంతులూ మునులూ, ప్రతినిత్యం ప్రకృతితో ప్రత్యక్ష సంబంధం లేకుండా ఎక్కువకాలం నాలుగు గోడలమధ్యా కూర్చుండి పోలేరుకదా! నిజానికి కూర్చుండి పోకూడదనే అంటాను. అవును. పక్షులు గుహల్లో కూర్చుని సంగీతం పాడవుకదా! అలాగే మనుష్యులు. వారికీ స్వేచ్ఛా వాతావరణం కావాలి. ఏమైనా మీలో ఎవరికైనా ఇల్లు కట్టుకోవాలని కోరిక కలిగితే, మంచి పట్టుదలతో పని చెయ్యడానికి సిద్ధపడండి. అసలు ముందు ఎంతఇల్లు అవసరమవుతుందో ఆలోచించండి. ఎన్ని తక్కువ గదులతో మీరు

కాలక్షేపం చెయ్యగలరో అంచనా వేసుకోండి. విపరీతంగా మంచుకురిసే ప్రదేశాలలో కూడా రెడ్ ఇండియన్లు చిన్న చిన్న డేరాలు వేసుకొని నివసించడం చూచాను. వాళ్లు అందులోనే ఉంటూ చక్కగా శరీరరక్షణ చేసుకోగల్గుతున్నారు. అంతే కాదు, నేను పూర్వం రైలుపట్టాల ప్రక్కగా పడేసి ఉండే పెద్దపెట్టె నొకదాన్ని తరచు చూస్తూండేవాణ్ణి. అది ఆరడుగుల పొడవూ మూడు అడుగుల వెడల్పూ ఉండి రైల్వే కూలీల సామానులూ అవీ భద్రంచేసుకోవడానికి ఉపయోగపడుతుం డేది. దాన్ని చూస్తూన్నప్పుడు నాకో ఆలోచన స్ఫురిస్తుం డేది. బీదరికంతో బాధపడేవాళ్లు ఓ "డాలరు" పెట్టె అల్లాంటి పెట్టె ఒకటి కొనుక్కొని దానికి గాలివచ్చేందుకు రంధ్రాలు పెట్టించి రాత్రిళ్లూ,వర్షం కురుస్తున్నప్పుడూ అందులో చేరి పైమూత వేసేసుకొని తలదాచుకొంటూ అద్దెబాధ లేకుండా జీవిస్తూ స్వేచ్ఛ గా ఉండవచ్చు; దిగులుండదు. ఇది అసహ్యమైనపనేమీ కాదు. గతిలేకచేసే పనీకాదు. పగలూ రాత్రిళ్లూ నీవు నీ యిష్టంవచ్చి నంతసేపు దానిపై కూర్చోవచ్చును. అవసరమై బయటకు పోవాలని అనిపిస్తే నిరాటంకంగా వెళ్ళవచ్చును. కన్నడీ కన్న డక ముందే అద్దె ఇమ్మంటూ ప్రాణాలు తోడేస్తూ ఇంటి యజమానీ, నీవెంటపడడు. నిజానికి ఆ పెట్టెకంటె మరికాస్త సౌఖ్యంగా; దానికంటె కాస్త విశాలంగా ఉండే పెద్ద పెట్టెలను (గదులను!) అద్దెకిచ్చి ఎంతమంది ఇంటి యజమాన్లు మన వెంట పడి ప్రాణాలు కొరుక్కుతినడంలేదూ! అటువంటప్పుడు ఈ చిన్నపెట్టెను ఆశ్రయిస్తే ఏం? తప్పేమిటీ? మనమేం

మంచుకు గడ్డకట్టుకొని పోవడం లేదుగా! ఇల్లా అన్నందుకు నేనేదో పరిహాసమాడుతున్నానని అపార్థంచేసుకోకండి. అటు వంటిదేమీ కాదు.

సొంతఇళ్ళు కట్టుకోవడంవల్ల కలిగే లాభాలనూ, ఇళ్ళు అద్దెకు పుచ్చుకోవడంవల్ల కలిగే నష్టాలను పోల్చిచూపాలని కాదు నా ప్రయత్నం. కాని ఓ విషయం మాత్రం స్పష్టంగా చెప్పవచ్చును. ఆనాటి మానవునకు అనాగరకుడే అయినా, ఆస్తే ఖరపెట్టవలసిన అవసరం లేకపోవడంచేతా, తేలిగ్గా లభిం చడంచేతా అతనికి సొంతానికి ఇల్లు అంటూ ఒకటి ఉండేది. ఈనాటి మనిషికి ఇల్లు కొనుక్కునే లేక కట్టుకొనే తాహతు ఆర్థికస్తోమతు లేదుగనుక సొంతఇల్లు ఉండటంలేదు.

సొంతగా ఇల్లుకట్టుకొనే తాహతు లేకపోగా రాను రాను ఇల్లు అద్దెకుపుచ్చుకునే తాహతుకూడా లేకుండా పోతున్నది. ఇల్లాగని అంటే ఒకరు అంటారూ "కాస్త అద్దె పారేస్తే మన పూర్వీకుల కంటికి మహారాజు భవనంలాగా కన్పించే ఇళ్ళలో మనం – ఈనాటి నాగరకులం స్వేచ్ఛగా ఉండగలుగుతున్నాం గదా! నెలకు ఇరవై ఇరవై అయిదు డాలర్లు (ఇది పల్లెలలో ఇచ్చే కిరాయి – బస్తీలలో ఇంకా ఎన్నో రెట్లు అధికంగా ఉంటుందనుకోండి) అద్దెఇస్తూ ఏవో కొన్ని సౌఖ్యాలను పొందుతున్నామంటారు. అన్ని సౌక ర్యాలూ ఉన్న ఇళ్ళల్లో నివసిస్తున్నామంటారు. ఇన్ని సౌఖ్యాలు అనుభవిస్తున్న వ్యక్తి నాగరకుడై ఉండికూడా దరిద్రుడుగానూ ఇన్ని సౌఖ్యాలు లేకుండా ఏదో పాకలో కాలంగడుపుకొనే

ఆనాటివ్యక్తి అనాగరకుడే అయినా భాగ్యవంతుడు - అదృష్ట వంతుడుగానూ కన్పిస్తున్నాడేం? ఎందుకు - ఎందుకిల్లా జరిగిందంటారు?

నాగరికత అన్నది మానవుని భౌతికస్థితి గతులను అభివృద్ధి చెయ్యాలని అందరూ అంగీకరిస్తారు. నేనూ అలాగే అభిప్రాయపడుతున్నాను. కొన్ని కాలాలలో బాగా తెలివి గలవాళ్ళు మాత్రమే తమతమ అనుకూల్యాలను పెంచుకోవడం జరిగినా మొత్తంమీద నాగరికత అభివృద్ధి చెందినదీ అంటే తత్ఫలితంగా పూర్వం ఎంతడబ్బు పెడితే ఒక ఇల్లువచ్చేదో సరిగ్గా ఆ డబ్బుకే అంతకంటే మంచియిల్లు కట్టుకొనే మార్గం లోకానికి తెలియాలి కదూ! ఒక వస్తువు ధర ఇంతఅని అంటే అది ఇన్ని గంటలుచేసే కూలీకి సమానం అని గదా సామాన్యపు లెక్క. వస్తువులను పోల్చవలసింది శ్రమతోనే; వస్తువుల మార్పిడి శ్రమరూపంలో తీర్చుకొంటాము. వెంటనేనో, కాక నెమ్మదిగానో. ఓమోస్తరు సామాన్యమైనఇల్లు ఏది తీసికొన్నా - ఈ ప్రాంతంలో సుమారు 800 డాలర్లు ఖరీదు చేస్తుంది. ఒక మనిషి - సంసారబాధ్యతలు లేనివాడయినా పది పదిహేను సంవత్సరాలు అహోరాత్రాలు కష్టపడి కూలీ చేస్తేనేకాని - మనిషికి రోజుకో డాలరుచొప్పున కూలీ కట్టుకొన్నా అంత ఋణం తీరదు. అంటే మనిషి తన జీవితకాలంలో మూడో వంతుకాలాన్ని ఇందుకోసం వెచ్చించవలసి వస్తున్నదన్నమాట. పోనీ అద్దెఇస్తూ కాలంగడపమని అందామా అంటే జీవితాంతం వరకూ అద్దెఇస్తూ ఇబ్బందిపడుతూ (చివరకు కూడా సొంత

ఇల్లులే (ఉండా) గడుపమన్నట్లే అవుతుంది కనుక అదీ ఏమంత మంచి సలహాకాదు. ఎంచదగిన మంచి ప్రత్యామ్నాయమూ కాదు. నిజంగా ఇటువంటి పరిస్థితుల్లో, ఇటువంటి షరతులతో ఆనాటి అనాగరకుడైన మనిషైనా తన పూరిపాకను వదలిపెట్టి మీకు రాజభవనం ఇస్తామన్నా వస్తాడటండీ! సరే, నాగరకత పెరిగి, గృహనిర్మాణంలో మార్పులువచ్చి మన ఇళ్ళు బాగుపడడం జరిగింది. కాని అందులో నివాసముండే మను ష్యులు! వారేం మారలేదే! వారి స్థాయి సగమైనా మార లేదు. నాగరకత గొప్పరాజభవనాలను సృష్టిచేయకలిగింది. కానీ మహనీయులనూ, చక్రవర్తులనూ సృష్టిచేయలేక పోయింది.

అసలూ, ఈ నాగరికుడైన మనిషి ఆదర్శాలు అతని పూర్వీకుల కంటే ఉన్నతమైనవీ, ఘనమైనవీ కానప్పుడు, అతను తన జీవితకాలంలో చాలభాగం కేవలం సాధారణమైన జీవితావసరాలనూ, సౌఖ్యాలనూ సాధించడానికై వ్యయపరు స్తూ ఉన్నప్పుడూ పూర్వీకునికంటే ఇతనికి మంచి నివాసంఅంటూ ఎందుకుండాలీ? మరీ దారిద్ర్యం అనుభవిస్తున్న వాళ్ళసంగతి ఏమిటి? వాళ్లు ఎలా జీవిస్తున్నారు? అనాగరకులలో కొంత మంది కాస్త ఎక్కువస్థితిలోకి వెళ్లితే మరికొంతమంది వాళ్ళకంటే తక్కువ స్థితిలోకి దిగజారి పోయ్యారు. కొందరు మరీ భాగ్యవంతులయితే కొందరు మరీ దరిద్రు లయ్యారు. ఒకవైపున రాజభవనాలు, బ్రహ్మాండమైన కట్టడాలు కన్పిస్తే మరొకవైపున అతి దరిద్రుల, నిత్య దరిద్రుల బిచ్చ గాళ్ళ పూరిగుడిసెలు, పాడుపడిన సత్రాలు కన్పిస్తున్నాయి.

ఇదేకదా నాగరకతాభివృద్ధి ఫలితం! ప్రపంచ అద్భుతాలలోవి అనుకుంటున్న పిరమిడ్ల విషయం చూడండి! ఈజిప్టు దేశపు చక్రవర్తులను సమాధిచెయ్యడానికి పదివేలమంది కూలీలను నియోగించి ఈ బ్రహ్మాండమైన పిరమిడ్లు నిర్మించారు. చక్రవర్తుల మరణానంతరం వారి శరీర రక్షణకోసం ఇంత గొప్ప ఏర్పాట్లు చేశారు. కాని ఆ కూలీలో! వాళ్ళను ఇని, ఉల్లిపాయలు తిని బ్రతకమన్నారు. బ్రతికి ఉండగా వారికి స సరియైన తిండికూడా లేదు. వారు ఎలా సమాధిఅయినా అన్న మాట దేవుడెరుగు. ఏ దేశంలో అయినప్పటికీ ఔన్న త్యానికి ఇలాటి బాహిరమైన చిహ్నాలు కన్పించినప్పుడు ద బట్టి ఒకనాటి అనాగరకులకంటే ఈనాటి ప్రజాబాహుళ్యం అధిక సౌఖ్యాలను అధికైశ్వర్యాన్ని అనుభవిస్తున్న దనుకోవ పొరపాటే అవుతుంది. ఈవిషయం తెలుసుకోవడం ఏమం కష్టం కాదు; ఎక్కడికో పోనక్కరలేదు. అతి నవీనమై రైలు మార్గాలను పరిశీలించండి. ఆరైలుపట్టాలను ఆనుకొ పే బీద వాళ్ళ "ఇళ్ళు" కన్పిస్తాయి. అవి నిజానికి పందు కూడా సుఖంగా నివసించడానికి పనికిరాని గుడిసెలు. చలిగా నుండి శరీరరక్షణ కావించుకొనేందుకు వాటికి తలుపులూ కిటికీలూ ఉండవు. లోపల చలికాచుకోడానికి వంటచెరుకు ఉండదు. అసలూ వాళ్ళకు సరియైన తిండే ఉండదు. వాళ్ళ శరీరాలు, చలికీ దారిద్ర్యానికీ తట్టుకోలేక బక్కచిక్కి శల్యా శేషాలై ఎంతో హీనంగా కన్పిస్తాయి. వాళ్ళల్లో శారీరకమైన చైతన్యమే కన్పించదు. దారుణం! కాని ఆ మనుష్యుల – వాళ్ళ శ్రమను వినియోగించే కదా ఈనాటి నాగరకతను చాటే మహాత్తర

మైన భవనాలు నిర్మించింది. కనీసం ఈ విషయమైనా జ్ఞాపకం ఉంచుకోమని మనవిచేస్తున్నాను. ఇంగ్లాండులో యంత్రా గారాలలో పనిచేసే కార్మికులస్థితీ దాదాపు ఇంతే. అసలు "ఇంగ్లాండు అంటే ప్రపంచ కర్మాగారం" అని కదా పేరు! అలాగే ఐర్లెండున్నూ. ఆ దేశపు - ఒక ఐరిష్ కార్మికుణ్ని ఉత్తరఅమెరికాలోని రెడ్ ఇండియన్ని కాక అలాంటి జాతి వ్యక్తి మరొకర్ని అంటే నాగరికమైన తెల్ల జాతుల వారి ప్రభావం సోకి దిగజారిపోనివాణ్ని తీసికొని వారివారి శరీర స్థితులను పోల్చిచూడండి. అప్పుడు తెలుస్తుంది ఉన్నరహస్యం.

చాలామంది అసలు ఇల్లు అనేది ఎలాఉండాలో ఆలో చించినట్లే కనపడదు. పైగా ఊరికే పొరుగువాడి భవనం లాగానే-సరిగ్గా అదేమాదిరిగా తమఇల్లుకూడా ఉండాలనికోరు కొంటూ అకారణంగా బీదరికాన్ని అనుభవిస్తుంటారు. కోరి తెచ్చుకొన్న బీదరికంతో బాధపడుతుంటారు. ఇప్పుడు మన ముంటున్న ఇంటికంటె వెయ్యిరెట్లు సౌఖ్యంగా ఉండేవిధం గానూ ఎంతో విశాలంగానూ వైభవంగానూ ఇళ్లు కట్టుకొనే పద్ధతులు మనం కనిపెట్టవచ్చును. కాని దాన్ని భరించే ఆర్థిక స్తోమతు లేదని అందరూ అంగీకరిస్తారు, అయినా ఒకటి అడుగు తాను- "మనమంతా ఎప్పుడూ ఇలాంటి సౌఖ్యాలు పొందడా నికే మార్గాన్వేషణ చేస్తూ కూర్చోవాలా?" అని. "కొన్ని సమయాల్లోనైనా ఉన్నదాంతో, స్వల్పమైనదాంతో సంతృప్తి చెందడానికి ఎందుకు ప్రయత్నం చెయ్యకూడదూ?" అని. ఈనాటి *మనయిళ్లుచూడండీ-ఎందు కన్నిగదులు! ఎందు కా గదులనిండా అన్ని కుర్చీలూ బల్లలూ సోఫాలూ మంచాలూ?

అరబ్బు దేశస్థులలాగా, హిందూ దేశస్థులలాగా, స్వల్పమైన సామగ్రి ఉంటే చాలదూ? స్వర్గలోకాలనుంచి మానవులకు వరాలిద్దామనీ ఈ జాతుల్ని ఉద్ధరిద్దామనీ వచ్చిన ఆయా మత ప్రవక్తలను నా స్మృతిపథంలో చిత్రించుకున్నప్పుడు వారివెనుక మనలాగా బండెడు సామగ్రితో పదిమంది నౌకర్లు వెంట వస్తున్నట్లు కన్పించరేం! కాని సామాన్యులమైన మన యిళ్ళు చూద్దామా–ఇంటినిండా వస్తువులు ఎక్కడచూచినా కుప్పలు కుప్పలుగా మూలుగుతుంటాయి. ప్రొద్దున్నే లేచి ఇంటావిడ వాటిపైపడ్డ దుమ్మూధూళీ అంతా దులుపుకొంటూ పోవాలి ఇంట్లో ఈకొసనుంచి ఆకొసదాకా. నిద్ర లేవంగానే ఇదో పని, అటువంటి పవిత్రమూ ప్రశాంతమూ అయిన ప్రాతః కాలంలోనా ఈ పిచ్చిచాకిరీ! స్త్రీకి ఎంత మంచిపని వప్ప చెబుతున్నారండీ! ప్రాతఃకాల దేవత అరోరా సిగ్గుపడడం వలన కన్పించే అరుణకాంతులు ప్రసరించే వేళ అది. ఆ అరుణ కాంతి ప్రకృతి అంతటా ప్రతిఫలించే వేళ అది. ఆకు కుమారుడు "మెమ్నన్" మధురంగా మైమరచి గానంచేసే వేళ అది. ఆ గానమాధుర్యాన్ని దివ్య కుసుమసౌరభాన్ని మోసుకొని వస్తూ మలయపవనాలు మందమందంగా వీచే వేళ అది.

*　　*　　*　　*

నా బల్లపైన మూడు చలువరాతి ముక్కలు ఉండేవి. కాని, వాటిని రోజూ దుమ్ము దులపాల్సి వచ్చేసరికి భయం వేసింది. చిరాకు పుట్టింది. నామనస్సు పరిశుభ్రంగా ఉండగా, ఏ దుమ్మూ, ధూళీ పడకుండా పవిత్రంగా ఉండగా దాన్ని దులపవలసిన పనేలేనప్పుడు వీటిపని ఎందుకని వాటిని విసిరి

కిటికీలోంచి దూరంగా పారేశాను. అటువంటప్పుడు రకరకాల సామానులూ, కలవసామగ్రీ పెట్టిన ఇంట్లో ఉండడమా! నా మట్టుకు నా కది సాధ్యంకాదు. దానికి బదులు హాయిగా ఆరుబయట గడ్డిమీద కూర్చుంటాను. అక్కడ దుమ్ము చేరదు కనుక ప్రతిసారీ దులుపుకోవాలసిన పనిఉండదు.

అసలు-మానవుడు ఉత్సాహంతో విజయకాంక్షతో, నిరంతరం నడకసాగించే యాత్రికుడు. నాగరకత బలియని ఆనాటికాలం-అతి సామాన్యతా, అతి నిరాడంబరత్వమూ జీవితంలో వెల్లివిరిసే ఆనాటి మానవునకు అలాంటి సదవకాశాన్నైనా కల్గించింది. అతడు ఆహార నిద్రాసౌఖ్యాలు అనుభవించిన వెంటనే మరల తనయాత్రనుగురించి ఆలోచించేవాడు. ఎక్కడా ఒక్కచోటే కూపస్థమండూకంలా నిలచిపోయేవాడు కాదు. కాసేపు ఒకచోట ఏదో డేరాలోవలె విశ్రాంతి తీసుకొని ఇక బయలుదేరి అందమైన అడవుల్లో, లోయల్లో తిరుగుతూ ఆకాశాన్ని ఒరుసుకొనే పర్వతాలనెక్కుతూ, ప్రకృతి దృశ్యాలను పరికిస్తూ, పరిశీలిస్తూ - నదీనదాలను, మైదానాలను దాటేస్తూ హాయిగా కాలంగడిపేవాడు. కాని యిప్పుడో! ఇటు చూడండి-మనిషి తాను సృష్టించుకొన్న పరికరాలకే ఎలా బానిసలాగా మారిపోతున్నాడో! తనకేదో ఇంత శరీరరక్షణ కలుగజేస్తుందని ఒకానొక గృహాన్ని నిర్మించుకొని దాన్ని కాపాడుతూ, దానికి సేవచేస్తూ, దాన్ని విడచిపెట్టి ఒక్కక్షణం ఉండలేకపోతూ ఒట్టి బానిసగా మారిపోతున్నాడు.

ఆకలిదప్పులూ, శరీరరక్షణా కాంతూ, లోకంలో సర్వ

జంతుసామాన్యం. కనుక మానవునకూ సామాన్యమైనది. పూర్వం మనిషికి ఆకలేస్తే ఏ చెట్టునుంచో ఇన్నిపళ్లు స్వేచ్ఛగా కోసుకొని ఆకలి తీర్చుకొనేవాడు. ఏ సెలయేటి నీరో దోసిళ్ళతో త్రాగి దాహం తీర్చుకొనేవాడు. అటువంటిమనిషే ఈనాడు అందుకోసమేనంటూ పంటేసి ఎకరాలభూమి ఆక్రమించుకొని వ్యవసాయంచేసి వ్యాపారం చేస్తున్నాడు. విశ్రాంతికై ఏ వృక్షచ్ఛాయలనో నిలచి బడలిక తీరగానే కదలివెళ్లే ఆమనిషే ఇక్కడ శాశ్వతంగా నిలచిపోదామని బ్రహ్మాండమైన భవనాలు సొంతానికి నిర్మించుకొంటున్నాడు. అంతస్థులపై అంతస్థులు నిర్మిస్తున్నాడు. ఏదో ఒకరాత్రికాక కొన్ని రాత్రిళ్లు గడిపిపోదామని ప్రపంచంలోకి వచ్చినవాళ్ళలా కన్పించడం లేదీ జనం! ఇక్కడే ఈ ప్రపంచంలోనే శాశ్వతంగా ఉండిపోదామని వచ్చినవాళ్ళలా కన్పిస్తున్నారు. స్వర్గలోకాన్ని మరచిపోయా రీ జనం. మతిమైనా మనకు తోడ్పడడంలేదు. క్రైస్తవమతాన్ని ఒక క్రొత్త వ్యవసాయపథకంగా మాత్రమే వినియోగించుకొంటున్నాము. అంతకుమించి అధికంగా ఉపయోగించుకోవడమూ లేదు, అర్థంచేసుకోవడమూ లేదు.

మన పూర్వీకులు అవలంబించిన పద్ధతులలో ఇతర విషయాలు ఎల్లాఉన్నా తెలివితేటలన్నా కన్పిస్తాయి. వాళ్ళు తమ జీవిత అవసరాలను ముందు తీర్చుకోవడమే ఒక నియమంగా పెట్టుకొన్నట్లు కన్పిస్తుంది. కనీసం అటువంటి అత్యవసరాలయినా మనకీనాడు తీరుతున్నాయా? సౌఖ్యదాయకమైన, విశాలమైన భవనం ఒకటి సంపాదించుకొందామని

నాకూ అనిపించినప్పుడు, అప్పుడు నాకు ఏదో అడ్డుపడుతు న్నది. మనస్సు ఒప్పడంలేదు. సామాన్య జంతుకోటికి అతీత మైన మానవ సంస్కృతి మనకూ మనదేశానికీ అబ్బిందా అని అనుమానం కల్గుతోంది. ఇప్పటి పరిస్థితులవల్లే కావచ్చు మనకీనాడు - పూర్వీకులకు ఆహారం కొరతగా కన్పించిన ట్లుగా, ఆత్మచింతనం - జ్ఞానం కొరతగా కన్పిస్తున్నది. ఏకా లంలోనైనా, ఎటువంటి దుస్థితుల్లోనైనా వాస్తుశాస్త్రజ్ఞతా ప్రదర్శనంగానీ వైదుష్యప్రకటనంగానీ కూడదనడంలేదు. అవి ఉండవచ్చు. కానీ అవి సౌందర్యపోషకాలుగా, మన ప్రధాన ప్రయోజనాన్ని పోషించేవిగా ఉండాలి. ఊరికే ఏదో డాబు సరిగా దర్జాగా కన్పించగానే సరికాదు. నేను కొన్ని ఇళ్ళకు వెళ్ళి పరిశీలనగా చూసి వచ్చాను. అవన్నీ ఎల్లా పైపై అలం కారమే ప్రధానంగా ప్రదర్శిస్తున్నాయో తెలుసుకొన్నాను. అయితే మనమంతా తప్పనిసరిగా మళ్ళీవెళ్ళి ఆ కొండగుహ ల్లోనో,పాకల్లోనో నివసించాలనిగానీ ధృవప్రాంతపు మనుష్యుల్లా చర్మాలు కప్పుకోవాలనిగాని అనడంలేదు. మనం అంత హీన స్థితికి దిగజారిపోలేదు వాస్తవమే. అనేక త్యాగాల ఫలి తంగా అమితమైన పరిశ్రమ ఫలితంగా కనుగొన్న క్రొత్త పద్ధతులనూ, ప్రయోజనాలనూ మనం ఆమోదించవలసిందే. కానీ అకారణంగా ఆర్థికబాధలకు లోనుకావద్దనే నేను అనడం. నిజానికి మనకీనాడు కలపా ఇటుకా కాక, రాళ్లూ, గడ్డీ, ఆకులూ తేలికగా చవకగా అందుబాటులో ఉన్నాయి. గుహాలను వెతుక్కునేకంటె వాటితో అతి సులభంగా గృహాలు నిర్మించుకోవచ్చును. ఈ విషయమై నేను సానుభూ

తితో నే మాట్లాడుతున్నాను. తెలిసే మాట్లాడుతున్నాను. మాట్లాడగలను. ఈ విషయమై నాకు సిద్ధాంతరీత్యా ప్రవచించడం తెలుసును. స్వీయానుభూతిని పురస్కరించుకొని ఆచరణయోగ్యమైన మార్గమూ తెలుసును. కాస్త జాగ్రత్తగా అర్థంచేసుకొంటే మనం నేడు మనకు లభించే వస్తువులతో, ముడిసరుకుతో చక్కని గృహాలను నిర్మించుకొని, అనేకమంది ధనవంతులకంటే అధిక ధనవంతులమూ - అదృష్టవంతులం కాగలం. అప్పుడు మనం ఈ నాగరికతను మానవజాతిని దైవదత్తంగా లభించిన వరంగా, మహోపకారంగా రూపొందించ గల్గుతాము.

## స్వీయ గృహ నిర్మాణం:

1845 మార్చి నెలాఖరు ప్రాంతంలో నేనా వాల్డన్ చెరువు సమీపంలో ఉన్న అడవుల్లోకి వెళ్ళాను. పొరుగువాడి దగ్గర మళ్ళా ఇస్తానని గొడ్డలి ఒకటి తీసుకొన్నాను. అలా తీసుకోవడంలో నా ప్రధానమైన ఉద్దేశ్యం పొరుగువాళ్ళతో పరిచయం కలిగించుకోవడమే. అతనా గొడ్డలిని ఇస్తూ దానిని తాను ప్రాణప్రదంగా ఎంచుకొంటున్నాననీ, జాగ్రత్తగా వాడుకోవలసిందనీ, భద్రంగా తిరిగి ఇవ్వవలసిందనీ అన్నాడు. నేను పుచ్చుకొన్నప్పటికంటే దాన్ని తిరిగి ఇచ్చేటప్పుడే దానికి పదును ఎక్కువైంది. వాడకంవల్లనే అలా జరిగింది. దాన్ని నా పని అయ్యాక జాగ్రత్తగా తిరిగి ఇచ్చివేశాను. వాల్డన్ చెరువుకు అత్యంత సమీపంలో నా గృహాన్ని నిర్మించుకొనడానికి

ప్రకాలు వేశాను. కలపకోసం అడవిలోకివెళ్లి ఎత్తైన దేవదారు చెట్లకొమ్మలను కొట్టడం మొదలుపెట్టాను.

నేను ఎంచుకొన్న స్థలం చాలా అనుకూలమైందీ అందమైనది. అడవులతో నిండిఉన్న లోతుప్రాంతం అది. అక్కడి నుండి చూస్తే వాల్డన్ చెరువు ఎంతో మనోహరంగా కన్పిస్తుంది ముందు చిన్న మైదానం. అప్పటికి చెరువులో మంచు గిడ్డకట్టలేదు – అక్కడక్కడతప్ప.

ఆరోజుల్లో నేను చాలా కష్టపడి పనిచేశాను. ఇంటికి తిరిగివస్తూ దారిపొడుగూనా ఎత్తుగా ఆకుపచ్చని ఇసుకచేర్చి కట్టవేసిఉన్న రైలుపట్టాల దగ్గరకు వెళ్లేవాణ్ని. లార్కు, పేలీ పక్షులు (కోకిలలవలె గానంచేసే పక్షులు) మధురగానం చేస్తూ నూతన సంవత్సరారంభాన్ని సూచిస్తుండేవి. అది ఆనంద దాయకమైన వసంతకాలం. రోజులు నెమ్మదిగా హాయిగా గడిచాయి. కష్టపడి దేవదారు వృక్షాలను కొడుతూ, కలపను చేరుస్తూ, మొక్కా మోడూ మరోప్రక్కన పేరుస్తూ, మధ్య మధ్య పాటలు పాడుకొంటూ పనిపాటల్లో మునిగిపోయాను. అలా చేర్చిన కలపను నాకు కావలసిన కొలతల్లో చిన్న చిన్న ముక్కలుగా కొడుతూ వాటినోప్రక్కకూ, బెరళ్ళనోప్రక్కకూ చేరుపరచి భద్రపరచాను. ఈలోపల పొరుగువాళ్ళ దగ్గరనుండి ఇతర పనిముట్లుకూడా సంపాదించి వడ్రంగపుపని ఆరంభించాను. ఆ కలపదుంగలకు ఎక్కడెక్కడ రంధ్రాలువెయ్యాలో అక్కడల్లా వేసి వాటిని సిద్ధం చేసుకొన్నాను. రోజూ నా మధ్యాహ్న భోజనార్థమై రొట్టె, వెన్నా వార్తాపత్రికలో చుట్టుకొని వచ్చేవాణ్ని. అప్పుడే కొట్టిపడేసిన పచ్చని ఆ దేవ

దారు దుంగల ప్రక్కగా కూర్చుని తృప్తిగా భోజనంచేసి, ఆ వార్తాపత్రికే కాసేపు చదివేవాణ్ని. నేను గొడ్డలితో చెట్లు నరుకుతూ ఉన్నప్పుడు ఆశబ్దం విని అటువెళ్లే బాటసారు ఎవ రైనా అప్పుడప్పుడు నావద్దకు వస్తుండేవాళ్లు. భోజనానంతరం కాసేపు వాళ్ళతో పిచ్చాపాటీ వేసేవాణ్ని. ఏవిధమైన విసుగూ చిరాకూ లేకుండా పని పూర్తిచేయడానికి సన్నాహాలు చేసు కొంటూ ఉండేవాణ్ని.

ఆతర్వాత ఇంటికప్పుకు వస్తువులు సంపాదించుకోవడా నికి ప్రయత్నాలు చేశాను. కాలిన్సు అనే ఒకాయన తన పాత పాకను నాకు అమ్మచూపాడు. నేనూ అతని ఇంటికప్పు పనికివస్తుందని అనుకొని అతని యింటికి వెళ్లి దాన్ని పరిశీలించి వచ్చాను. చివరకు 4 డాలర్ల 25 సెంట్లకు బేరం కుదుర్చు కున్నాను. ఆ పాకను ఊడదీయించి అందులో నాకు పనికొచ్చే వన్నీ విడిగా కుప్పవేశాను. వాటినో బండిలో వేయించుకొని చెరువు ఒడ్డుకు చేర్పించాను. బండిలోనుంచి సామాన్లు దింపు తున్నప్పుడు మా పొరుగువాడు - ఒక ఐరిష్ రైతు - సిలీ అనే ఆయన ఆ చెక్కలనుంచి వంకరపోని మేకులుకొన్ని కాజే శాడని నాకో యువకుడు చెప్పాడు. అయినా నేనా పెద్ద మని షిని అదేమని ప్రశ్నించి బాధించలేదు.

చివరకు మే నెలారంభంలో గృహనిర్మాణం ఆరం భించాను. కలపదుంగలు బిగించడం ఆరభించి నాకు హస్త సాయం రమ్మని ఇరుగు పొరుగువారిని పిల్చాను. అలా పిలవ డంలో నాపని వాళ్ళచేత చేయిద్దామని కాదు. ఆత్మీయతలు పెంచుకోవడం కోసమే. సమాజంలో అందరూ కలిసి బ్రతకాలి

అన్న దృక్పథం వాళ్ళల్లో కలిగించాలని అలా చేశాను. మొదటి ఇలాంటి చిన్నపనుల్లో కాస్త చేయికలపడం నేర్చుకొంటే ముందు ముందు ఏ మహాత్కార్య సాధనలోనో కలిసిపోయి బృహన్నిర్మాణంచేసి చూపగలరని నా విశ్వాసం. మొత్తంమీద పనిపూర్తిచేసి 1845 జూలై నాల్గవతేదీన ఆ యింట్లో ప్రవేశించాను. పైన ఏర్పాటుచేసిన కప్పు వర్షం పడకుండా ఆదుకొంది. పరిసరంలో ఉన్న కొండదగ్గరనుంచి రెండు బండరాళ్ళు నెమ్మదిగా ఒకటొకటీ మోసుకొని వచ్చి పొగ గొట్టం ఒకటికట్టుకొన్నాను. అది పూర్తికాకముందు ప్రొద్దున్న పెందరాళా నిద్రలేచి ఆరుబయటనే వంటచేసుకునే వాణ్ని. నిజానికి ఇలా ఆరుబయట వంటచేసుకోవడమే మెరుగు—వంట ఇళ్ళల్లో కళ్ళల్లోకి పొగ పోతుండగా నానా అవస్థా పడడం కంటె ఇది ఎన్నోరెట్లు మెరుగనిపించింది. బయట వర్షం కురుస్తూన్నప్పుడు పొయ్యికి పైగా రెండుచెక్కలతో అమర్చుకొన్న చిన్న అటకమీద కూర్చునీ, పడుకొనీ క్రింద తయారవుతున్న రొట్టెవంక చూస్తూ కాలక్షేపం చేసేవాణ్ని. చేతినిండా పని ఉంటూ ఉండడంచేత అప్పట్లో నాకు చదువుకోడానికే ఎక్కువ వ్యవధి ఉండేదికాదు. కాని నా బల్లమీద కన్పించిన ప్రతి చిన్న కాగితమూ చదవకుండా విడిచిపెట్టేవాణ్ని కాదు — అవి ముఖ్యమైనా కాకున్నా. కాని ఎందువల్లనో అవి అప్పట్లో ఇలియడ్ చదివితే ఎంత ఆనందము కలుగుతుందో అంత ఆనందాన్నిచ్చేవి.

చలికాలం రాకముందే కొద్ది కొద్దిగా మిగిలిపోయిన

ఇంటికి మరమ్మతులూ అవీ పూర్తి చేసుకొన్నాను. వర్షం ఇంట్లో కురవకుండా కావలసిన బందోబస్తు అంతా పూర్తి చేసుకొన్నాను. అప్పటికి ఇల్లు కట్టుకోవడం పని పూర్తయ్యింది. అల్లాగా కష్టపడి 28 డాలర్ల 12 1/2 సెంట్లు ఖర్చుపెట్టి కూలిపని అంతా సాధ్యమైనంతవరకు నేనే చేసుకొని కుదిమట్టంగా, అందంగా కట్టుకొన్నాను. పది అడుగుల వెడల్పూ 15 అడుగుల పొడవూ ఉన్న ఆ యింటికి రెండువైపులా రెండు కిటికీలూ, రెండు ద్వారాలూ పెట్టాను. లోపల ఒక నెగడు ఏర్పాటు చేసుకొన్నాను. ఆ యిల్లే నా కంటికి దివ్యధామంగా కన్పించింది. గృహనిర్మాణంలో వేటికి వేటికి ఎంతెంత అయిందో, ఎప్పుడు కప్పుడు లెక్కరాసి ఉంచుకొన్నాను. అడవిలో నాకు ఉచితంగా సులభంగా దొరికాయి కనుక కలపా, రాయీ, ఇసుక వీటికి నేనేమి డబ్బుఖర్చుపెట్టలేదు. ఈ యిల్లు కట్టుకోగా మిగిలిపోయిన కలప ఉపయోగించి ప్రక్కగా మరోగుడిసె కూడా వేసుకొన్నాను. అది కట్టె పుల్లలూ అవీ వేసుకోడానికి పనికివచ్చింది. అలాగా ప్రకృతి దృశ్యాల మధ్య అడవిలో - వాల్డన్ చెరువుకు సమీపంలో మిక్కిలి స్వల్పమైన వ్యయంతో, శ్రమపడి స్వహస్తాలతో గృహనిర్మాణం కావించుకో గలిగి నందుకు నేను చిట్టచివరకు ఎంతో పరితృప్తుడ నయ్యాను.

అక్కడ ఉన్నన్నాళ్లు ఆ యింట్లోనే స్వేచ్ఛగా కాలం గడిపాను.

# 3 పొదుపు - గుణపాఠం

ఒకమనిషి తాను ఒక ఏడు అద్దెకింద చెల్లించే సొమ్ముతో జీవితాంతం ఉపయోగించే ఇల్లొకటి నిర్మించుకో గలడు అని పైఅనుభవాన్ని బట్టి తెలుసుకొన్నాను. నా అనుభవాన్ని గురించి నే నేదో గొప్పలు చెప్పుకొంటున్నట్లు మీకు అనిపించవచ్చును. కాని నే నీవిషయాలన్నీ స్వప్రయోజనాన్ని ఉద్దేశించికాక, ప్రజాబాహుళ్యాన్ని ఉద్దేశించి-వారిసౌకర్యాన్ని, క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని చెబుతున్నా కనుక అవి క్షమార్హాములని మనవిచేస్తున్నా. స్వీయానుభవంలో కలిగిన సాధకబాధకాలు-నేనుచెప్పే సత్యానికి అసలు సిద్ధాంతానికి, బోధకములు కావు. వాటికి పరస్పరవైరుధ్యం ఎంతమాత్రమూ లేదు. నేనుచేసిన ఈ ప్రయోగాన్నిగురించి ఏదో స్వార్థంతో, గొప్పకోసం వాచాలుడ నవుతున్నానని ఎంతమాత్రం అనుకోవద్దని మరోసారి మనవిచేస్తున్నాను. అతివినయం ప్రదర్శించి ఈ విషయాలు మీకు చెప్పకుండా ఊరుకొంటే అపసవ్యంగా అస్తవ్యస్తంగా నడుస్తున్న వ్యవహారాల తరఫున నేను వకాల్తా పుచ్చుకొన్నట్లే అవుతుంది. అంటే పరోక్షంగా వాటిని నేను సమర్థించినట్లే అవుతుంది. వీనిలో కేవల ప్రయోజనకరమైన విషయాలను ఏర్చికూర్చి మీకు అందచేయలేనేమో ! అయినా పరమసత్యాన్నిగూర్చి మంచిమాటలే చెప్పబోతున్నా.

అలా ఒకసారి కేంబ్రిడ్జి కళాశాలను పరిశీలించండి. విద్యార్థులకోసం ముప్పైరెండు వసతిగృహాలు కలిపి ఒకే వరు

సలో కట్టారు. ఇంటికప్పు అన్నింటికీ కలిసేఉంటుంది. మధ్య అడ్డు గోడలుమాత్రం ఉంటాయి. అక్కడ నివసించేవిద్యార్థి గదికి-ఆ గది ఇప్పటి నా యింటికంటె కొంచెం పెద్దదిగా ఉండ వచ్చు-దానికి సంవత్సరానికి ముప్పైడాలర్లు అద్దెచెల్లించాలి. అందులోఉండే విద్యార్థి తప్పనిసరిగా-చుట్టుప్రక్కల అందరు నిశ్శబ్దంగా ఉండడనుగనుక ప్రక్కగదులవాళ్ళవలనా తనగది లోని తోటివాళ్ళవలనా కలిగే ఇబ్బందులన్నీ సహించవలసి వస్తుంది. ఈవిషయాల్లో మనకు ఇంకా కొంచెం ఎక్కువ విజ్ఞానమేకనుక ఉంటే ఈ చదువుల అవసరం తగ్గిపోవడమేకాక మరీ ఇంతఖర్చుతోకూడిన చదువు క్రమంగా సన్నగిల్లిపోగల దనికూడా అనిపిస్తున్నది.

అప్పటికే మనం తెలుసుకోవలసిన విషయాలు ఇంకో రకంగా మరో విధానంలో తెలుసుకోగల్గుతామని కూడా అనుకోకుండా ఉండలేకపోతున్నాను. అక్కడా ఆ కేంబ్రిడ్జి కళాశాలలోగానీ అటువంటి మరోచోటగానీ ఒక విద్యార్థికి, కావలసిన అవసరాలు తీరడానికి ఎంతఖర్చో చూడండీ! ఆ ఖర్చంతా అతను స్వయంగానో కాక అతని తరఫున అతని తల్లి తండ్రులో భరిస్తుంటారు. మామూలుగా ఇంటిదగ్గర జాగ్రత్తగా ఉన్నప్పుడు పెట్టే ఖర్చుకు అక్కడయ్యే ఖర్చు పదిరెట్లు ఉంటోంది. చూడండి ఎంతడబ్బు వృథా అవుతు న్నదో! అంటే ఎంతశ్రమ వృథా అవుతున్నదో! అక్కడ ఏయే వస్తువులకైతే, ఏయే విషయాలకైతే డబ్బు వసూలు చేస్తున్నారో ఆవిషయాలు నూటికి తొంభైపాళ్ళు విద్యార్థికి నిజంగా అవసరమైనవి కావు. కళాశాలలో పాఠాలు చెప్పినం

దుకై – విద్యాబోధనా సౌకర్యం కల్పించినందుకై – ఇంతరుసుము అని వసూలుచేస్తారు కానీ – మహా మేధావులూ, పండితులూ అయిన సమకాలికుల సాన్నిహిత్యంలో మెలగడంవల్లనే వారితో తిరగడంవల్లనే విద్యా సంస్కారాలు అబ్బుతాయి. విద్యార్థి నిజానికి ఆవిధంగానే ఎక్కువ ప్రయోజనాన్ని పొందుతుంటాడు. అందుకైతే రుసుమేమీ ఉండదుగాని గదులకు అద్దె వసూలుచేస్తారు.

సామాన్యంగా కళాశాలలు స్థాపించే విధానం పరిశీలించండి. ముందు ప్రజలలోకి వెళ్లి మనిషికింత అని – ఇన్ని డాలర్లూ, ఇన్ని సెంట్లూ అని చందాలూ, విరాళాలూ వసూలు చేస్తారు. కొంత పెద్దమొత్తం పోగుకాగానే ఒక పెద్ద కంట్రాక్టర్ను పిలుస్తారు. అతనికీపని వప్పచెబుతారు. అతనీపనిని వ్యాపారదృష్టిలో, లాభనష్టాల లెక్కలలో చూస్తాడు. ఇక ఐరిష్ కూలీలనూ, ఇతర సాంకేతిక నిపుణులనూ నియోగించి పని చేయిస్తూ పోతాడు. న్యాయానికి ఆ పనులన్నీ అక్కడి విద్యార్థులే సక్రమంగా నిర్వహించడానికి తగివుండగా పరాయి వాళ్ళచేత ఈపనిని చేయిస్తున్నారు. అలాగా ఇతరులుచేసే పొరపాట్లకు, వాళ్ళు కలిగించే లోపాలకు తర్వాత తరాల విద్యార్థులు బాధపడవలసి వస్తుంది. ఆ కళాశాల వల్ల ప్రయోజనాన్ని ఆశించేవాళ్లు – అంటే ముఖ్యంగా విద్యార్థులే ఆ కట్టడాలకు పునాదిరాళ్లు వెయ్యాలి. వాళ్లే ఆపని నిర్వహించడం ఉత్తమమని నా అభిప్రాయం. మనిషి అన్నవాడికల్లా ఎంతో అవసరమూ ప్రయోజనకరమూ అయిన శారీరక పరిశ్రమను, విద్యార్థి నెమ్మదిగా ప్రయత్న

పూర్వకంగా తెలివిగా, తప్పించుకోని విశ్రాంతి సమయాన్ని ఎక్కువచేసుకోవడం ఉంటే అది కూడదనిపని. నిజంగా కష్ట పడిన తర్వాతనే విశ్రాంతి అన్నది ఫలదాయక మవుతుంది. అటువంటప్పుడు విద్యార్థి పని ఎగవేయడంమూలంగా అతడు తనకు లభించవలసిన ఒక చక్కని అనుభూతికి దూరమవుతున్నట్లే, అతడు తన్ను తాను మోసం చేసుకొంటున్నట్లే అవుతుంది. ఇల్లా అని నేనంటే ఒకరు "అయితే మీ ఉద్దేశ్యం విద్యార్థులు మానసిక పరిశ్రమకు బదులుగా ఇక శారీరక పరిశ్రమ చెయ్యాలనా ఏమిటి?" అని నన్ను ప్రశ్నించారు. నా భావం కేవలం అదేకాకపోయినా దానికి దరిదాపుల్లోనే ఉంది. అంటే నా అభిప్రాయం వాదాప్ర అంతే. నా అసలు అభిప్రాయ మేమిటంటే – తన కుటుంబం అంత ఖర్చుపెడుతూ తనను పోషిస్తున్నప్పుడు, జీవితాన్ని చులకనగా ఏదో ఆటవస్తువుగా, విలాసవస్తువుగా విద్యార్థి చూడకూడదని. అంతేకాదు – జీవితాన్ని గురించి ఊరికే చదువుకొంటూ పోవడమూ కాదు. అతడు తానుగా జీవితాన్ని మొట్టమొదటి నుంచీ కొట్టకొసదాకా అనుభవించాలి. అతడు తానుగా సొంతంగా జీవించాలి. అందుకోసం యువకులు జీవితం అనే ప్రయోగాన్ని చేయనారంభించడం కంటే మరో మంచి మార్గంలేదు. అలాగా ప్రయోగాన్ని ఆరంభించడం అన్నది; ఏ యితర శాస్త్రాధ్యయనానికీ ఎంతమాత్రమూ తీసిపోదు. కళలూ, శాస్త్రాలూ చదివించవలసివచ్చినప్పుడు నామట్టుకు నేను ఏ విద్యార్థినీ ఊరికే ఏ అధ్యాపకుని దగ్గరనో ప్రవేశ పెట్టేయను. అక్కడ కేవలం శాస్త్రబోధన జరుగుతుంది.

విద్యార్థి కేవలం పాఠాలు కంఠస్థం చేయడం జరుగుతుంది. అంతేకాని జీవించడం అనేది ఒక కళగా ఎంచలేదు.

నేను ఆ విషయాన్ని ప్రధానంగా నేర్పించడానికి ప్రయత్నిస్తాను. అలాగే విద్యార్థుల దూరదర్శినీ యంత్రంలో నుంచో, లేక మైక్రోస్కోపులోనుంచో చూస్తూ వస్తువులను పరిశీలిస్తూ కూర్చునేకంటే కళ్ళువిప్పి ప్రకృతిని పరిశీలించ మంటాను. చుట్టూవున్న వస్తువులను దర్శించమంటాను. ఇక్కడ ఆ విశ్వవిద్యాలయంలో వాళ్ళు రసాయనశాస్త్రం క్షుణ్ణంగా చదివికూడా తాము తినే రొట్టెను ఎలా తయారు చేసుకోవాలో తెలియకపోయే! ఒకడు ఎంతో ఖగోళశాస్త్రి వ్యాఖ్యానం చేస్తాడు. ఏయే గ్రహాలు ఏయే రాసులపై ఆధార పడుతుంటాయో ఎవడెవడు ఏయేరాసుల్లోకి తొంగిచూస్తుం టాడో...శాస్త్రంలో శాస్త్రరీత్యా తెలుసుకొంటాడు. కానీ తన సలిగతి ఎరుగడు కదా! తానే ఏ గ్రహమో! ఒక్క నీటి బిందువులో ఎన్నెన్ని జీవులున్నాయో అని వాటిని మైక్రో స్కోపులో పెద్ద రాక్షసరూపాలను ఇచ్చి పరీక్షిస్తాడు. పెద్ద పరిశీలనచేస్తూ పరిశోధకు డవుతాడు. కాని — ఖర్మం — తన చుట్టూ ఏయే రాక్షసులు విలయతాండవం చేస్తూ, వికటాట్ట హాసం చేస్తూ తన్ను కబళిద్దామని చూస్తున్నారో అతను తెలుసుకోడు. మరో విద్యార్థి ముడిఇనుము ఎక్కడ దొరుకు తుందో దానిలోనుండి ఇనుమును విడతీసి ఎల్లా ఉక్కు తయారుచేస్తారో తెలుసుకొంటాడు. "లోహాలకు" సంబధిం చిన శాస్త్రం అంతా కొన్ని ఏళ్లు తరబడి వల్లించేస్తాడు. తీరా — ఒక ఏపిల్ పండు కోసుకోడానికి కావలసిన చాకు తాను

సొంతంగా చేసుకోలేడు. అతని తండ్రి ఇంటిదగ్గరకొని దాన్ని భద్రంగా బంగీకట్టి అతగాడికి పంపవలసిందే. మరొకడు - ఓ కార్ఖానాలో ఓ నెలో రెండు నెలలో పనిచేసి, కొం కే వంతమట్టుకే చదివి, మిగిలినది అనుభవపూర్వకంగా ఆ ం పుకు తెచ్చుకొని, ఆ నెలాఖరుకో కాక రెండు మూడు నెల చివరకో ఒక మంచి పదునైనదీ అందమైనదీ అయిన క ని తయారు చెయ్యగలడు. అదుగో ఈ రెండోవాడు ప్రయోజ కడూ అంటాను.

* * *

అన్ని ఏళ్ళు అక్కడ చదివి డిగ్రీ పత్రం పుచ్చు ని బయటకు వస్తున్నప్పుడు కాబోలు నాకు "ఓహో నేను ది వింది నౌకాశాస్త్రం కదూ!" అని అనిపించింది. ఒక్క రి అలా ఓడలరేవుకు పోయివస్తే విద్యాలయంలో అన్నాళ్లు స్ట పడి, డబ్బు ఖర్చుపెట్టి నేర్చుకొన్నదానికంటే ఎక్కువ తెలి సే ఆవిషయం ఆసాంతం!

ఆఖరికి బీదవాళ్ళచేత కూడా రాజకీయ ఆర్థికశాస్త్రం క్షుణ్ణంగా చదివించేస్తారు. పొదుపరితనం గురించి కళాశాలలో ఎక్కడా ఎవ్వరూ బోధించరుకదా! అటువంటి అణిముత్యం లాంటి అంశాన్ని పాఠ్యవిషయాలలో చేర్చరుకదా! ఈవాడు అలాంటి పనుల ఫలితం ఏముపుతున్నదంటే ఆ విద్యార్థి ఒక ప్రక్క పెద్దపెద్ద ఆర్థిక శాస్త్రవేత్తలు ఆడం స్మిత్, రికార్డో మొదలగువారి అర్థశాస్త్ర గ్రంథాలు చదువుతూనే ఉంటాడు. మరొకప్రక్క అతడి తండ్రి క్రమంగా అప్పులపాలవుతూనే ఉంటాడు. ఇదీ జరుగుతున్న వ్యవహారం.

మన కళాశాలలకు సంబంధించిన వ్యవహారం ఎలా ఉన్నదో మరికొన్ని వందల నవీన అభివృద్ధి మార్గాల వ్యవహారమూ అలాగే ఉన్నది. వాటి అన్నింటినిగురించీ లోకంలో ఏవేవో కొన్ని తప్పుడు అభిప్రాయా లున్నాయి. అందులో కేవలం పురోగమనశీలం ఉన్నదని అనలేము.

మానవుడు శక్తిసామర్థ్యాలన్నీ వినియోగించి కొన్ని విషయాలు కనుగొన్నాడు. మళ్లా ఆ పెట్టుబడిమీద చక్రవడ్డీ వేసుకొని డబ్బుగుంజాలని ప్రయత్నం! ఫలితం— మళ్లా ఇంకా కొన్ని క్రొత్తవి కనిపెట్టడం. ఈ కనిపెట్టడానికి ఒక అంతూ పొంతూ లేకుండా ఉన్నది. ఎన్ని యంత్రాలు కనిపెట్టారు! ఎంత శాస్త్రం పెరిగింది! కానీ ఇవి అన్నీ ఒట్టి ఆటబొమ్మల వంటివి. కేవలం లక్కపిడతల వంటివి. ఇవి మనలను ఉత్తమ విషయాలను గురించి తీవ్రంగా ఆలోచించనీయకుండా వాటిలో మన మనస్సులు మగ్నం కానీయకుండా ప్రక్కదారులకు పట్టిస్తాయి. ఇవన్నీ అభివృద్ధినీ, నవీనత్వాన్నీ సూచించే పద్ధతులే కావచ్చు; కానీ పేటివలన జీవితాదర్శాలు నెరవేరుతున్నాయా అన్నదే, ఇవి జీవితపరమావధిని చేరడానికి మనకు సహాయపడుతున్నాయా అన్నదే ప్రశ్న. నిజానికి ఆ పరమావధి మనకు గోచరిస్తూనే ఉంటుంది. మనలను ఆ గమ్యానికి చేర్చేమార్గాలు ఇక్కడనుంచి బోస్టను, లేక, న్యూయార్కు నగరాలకు వెళ్లే రైలు మార్గాల్లాగా స్పష్టంగానే ఉన్నాయి. అయితే మరి ఈ నవీన పద్ధతుల మూలంగా ఈ నవీన విధానాల ద్వారా ఆ గమ్యాన్ని

చేరుతున్నామా అన్నదే ప్రశ్న! మనం, మొంగునీ నుండి టిక్సాస్‌కు తంతిస్తంభాలు పాతేసి, ఈ రెండింటినీ కలిపివేయాలని మహా తొందరపడుతున్నాం. కాని ఈ రెండిటికీ పరస్పరం అందచేసుకొనడానికి ముఖ్యమైన వార్తలు కొరత అవుతున్నాయి. ఇది ఎలా ఉన్నదంటే, పేరుపొందిన ఒక చెవిటి ఆవిడగారితో పరిచయభాగ్యంకోసం మహా ఆరాటపడిపోయాడొకానొక యువకుడు. తీరా 'ఆ చెమిటి ఆవిడతో ఏం మాట్లాడతావో మాట్లాడు' అని బాకా చివరభాగం చూపితే మాట్లాడడానికి మాటలేదొరకలేదు! అలా ఉన్నదీ వ్యవహారమంతా. అసలు మనవాళ్ళ ఆత్రం ఎంతదూరం పోయిందంటే ఇతర పాశ్చాత్యదేశాలకూ మన అమెరికాకు అతి సాన్నిహిత్యం కలిగించడానికి, వీటి రెండింటిమధ్యా ఉన్న ప్రయాణపు దూరాన్ని సాధ్యమైన మేరకు తగ్గించి కాదు కుదించి వేయడానికి ఇక్కడనుండి అట్లాంటిక్ మహాసముద్రం క్రిందుగా అక్కడికొక సొరంగం అమాంతం త్రవ్వేయాలని చూస్తున్నారు. ఇక అప్పుడు, అంటే ఆ కార్యక్రమం అంతా పూర్తయినప్పుడు, అత్యాసక్తిపరులై అంతా చెవులు నిక్కపెట్టుకొని వినడానికి సిద్ధపడే మనవాళ్ళకు అక్కడినుంచి మొట్టమొదటగా అందేవార్త, బహుశా ఏమి కావచ్చునూ అంటే, ఏ * అడిలైడు రాజకుమార్తెకో 'కోరింతదగ్గు వచ్చిందీ' అని. ఏం వస్తే!

* (ఇది నిజంగా ఏ రాకుమార్తె పేరూ కాదు. హాస్యానికి కల్పించినది.)

అయ్యా మనుష్యులు ఒకచోటనుండి మరొకచోటకు అంతకంతకు వేగంగా ప్రయాణం చెయ్యగలిగినంత మాత్రాన ఒరిగే ప్రయోజనం ఏమీలేదు. వారు మనకు అతి ప్రధాన వార్తలనేమీ అదించబోవడంలేదు. అయినా అలా చెయ్యడానికి వాళ్ళేమీ పుట్టతేనెమీద బ్రతుకుతూ మనదగ్గరకువచ్చే మత బోధకులుకారు. ప్రవక్తలు కారు. దేవదూతలు కారు. కనుక మనం వాళ్ళను ఏవిధంగానూ అభినందించ నవసరంలేదు.

*　　*　　*　　*

ఒకరు నాతో "ఏం మీరు నాలుగుడబ్బులు కూడబెట్టినట్లు లేదే! పైగా మీకు ప్రయాణాలంటే ఇష్టంకాబోలు. ఓ కారులోకూర్చుని పిచ్‌బర్గ వెళ్ళండి. దేశం చూసిరావచ్చును" అన్నారు. కాని నేను అంతకంటే కాస్త తెలివైనవాణ్నే. "కాలినడకన వెళ్ళేవాడే అందరికంటె ముందుగా వేగంగా వెళ్లే ప్రయాణీకుడు" అన్న విషయాన్ని నేను అనుభవపూర్వకంగా నేర్చుకొన్నాను. ఇప్పుడు నేను వెళ్ళవలసిన ప్రదేశం ఇక్కడకు సుమారు ముప్పైమైళ్ళు అనుకోండి. బస్సుకు తొంభై సెంట్లు, అంటే ఓ మనిషి రోజుకూలీ అన్నమాట. అయితే రోజుకు అరవైసెంట్లు మాత్రమే దొరికిన సందర్భాలు కూడా నేనెరుగుదును. ఆవిషయం వదలెయ్యండి. అవునా, ఈపూట కాలినడకను బయలుదేరుతాను. బాగా చీకటి పడకముందే అక్కడికి చేరుకొంటాను. ఆవిధంగా అన్నిమైళ్ళూ అనేకపర్యాయాలు వెళ్లివచ్చాను. సరే ఇక మీవిషయం – మీరు బయలుదేరా లనుకొన్న తర్వాత కూడా కారులోగాని

బయలుదేరరు గనుక ఆరోజంతా పనిచేసి ఆ డబ్బువచ్చాక కారులో ఎక్కి బయలుదేరి బహుశా రేపటికి చేరుతారు. పోనీ ఇవ్వాళే చేరగలరనే అనుకోందాం. సరిగ్గా అనుకొన్న ప్పుడే మీకు పనిదొరికితే, అసలు పిచ్ బగ్గు వెళ్ళడానికి బదులు రోజులో చాలాభాగం ఇక్కడే పనిచేస్తూ గడపవలసి వస్తుంది. అదీ ఉన్న ఇబ్బంది. ప్రపంచచుట్టూ రైలుమార్గమున్నా నేను ఎప్పుడూ మీకు ముందే నడుస్తుంటాను. నేను ఎప్పుడూ మీకంటె ముందే ఆయా ప్రదేశాలు చేరుతూ ముందుకు సాగుతుంటాను ఇక దేశం చూడడమూ, ఆ అనుభూతిని పొందడం విషయమంటారా! అవును-అదీనాకు సాధ్యమే అవు తుంది. దివ్యంగా అవుతుంది. నేనుగనుక ఆ విషయంలో పడి పోతే మీతో ఉన్న పరిచయాన్ని ఎప్పటికీ తెగతెంపులు చేసు కోవలసి వస్తుందికూడా.



నేను నా గృహనిర్మాణం పూర్తికాకముందే నా అసా ధారణపు ఖర్చులు భరించుకోనేందుకు కొంత డబ్బు అదనంగా సంపాదించుకోవలసి వచ్చింది. అందుకోసమని ఇసుక నేల రెండు న్నర ఎకరాల మేర ఎంచుకొని మెట్టవరి వేశాను. మరికొంత మేర బంగాళాదుంపలు, టర్నిప్ దుంపలూ, బటాణీలు నాటాను. అంతాకలిపి పదకొండు ఎకరాల భూమి. అంతా సాగుచేశాను. అయితే అది నా సొంతభూమి కాదు. పోరంబోకు భూమి ఆక్ర మించుకొన్నాను. అందువల్లనే ఆట్టే ఎరువులు వెయ్యలేదు. ఆభూమి అంతా దున్ని బాగుచేస్తున్నప్పుడు బోలెడంత

మొక్కా మోడూ లభించింది. అది నాకు పంటచెరుకుగా ఉపయోగపడ్డది. అమ్ముకోవడానికి గానీ ఇతరత్రాగానీ ఉపయోగపడని అడవికర్ర కూడా నాకు వంటచెరుకుగా ఉపయోగపడ్డది. ఓ రెండుజతల గుఱ్ఱాలను, ఓ కూలిమనిషినీ బాడుగకు ఏర్పాటు చేసుకొన్నాను – ఆ నాలుగురోజులూ నాకు సహాయంగా ఉంటుందని ఆ ఏర్పాటు చేశాను. కాని నాగలి నేనే పట్టుకున్నాను. వ్యవసాయపు పనిముట్లకైతేనేమి నారుకైతేనేమి గింజలకైతేనేమి మొత్తం 14 డాలర్లు 17 1/2 సెంట్లు వ్యయమైంది. చివరకు పంట చేతికివచ్చింది. 12 బుషెళ్ళ చిక్కుళ్ళు, 18 బుషెళ్ళ బంగాళదుంపలూ పండాయి. బటాణీలు, చిలగడదుంపలుకూడా బాగానే అయినాయి. ఎటొచ్చీ వరిధాన్యమూ, టర్నిప్‌దుంపలూ చేతికందలేదు. నాకు కావలసింది అట్టేపెట్టుకొని మిగిలినపంట అమ్ముకోగా మొత్తంమీద ఖర్చులుపోను 8 డాలర్లు 71 1/2 సెంట్లు లాభం కన్పించింది. అలాగా ఆసంవత్సరం కంకార్డు ప్రాంతంలోని ఏరైతుకూ నేను ఏవిధంగానూ తీసిపోలేదని అనిపించుకున్నాను. నా ప్రయోగం దాదాపు సానుకూలంగానే కన్పించింది.

ఆ మరుసటి సంవత్సరం నా వ్యవసాయం మరింత బాగా సాగింది. నాకు కావలసినంతమేర బాగా పదును చేసుకొన్నాను. ఆ రెండుసంవత్సరాల అనుభవాన్ని పురస్కరించుకొని నేనో విషయం స్పష్టంగా తెలుసుకొన్నాను. మనిషి, తన పొలంలో పండే పంటమీదే, తాను కష్టపడి పండించుకొన్న పంటమీదే ఆధారపడి అదే తిని బ్రతకాలి. అలా చేయగల్గితే ఇంతపొలం అక్కరలేదు. పదిసెంట్లపొలం చాలును.

తన ధాన్యాన్ని ఏ యితర భోగాలకో, ఏ అనవసరపు విలాస వస్తువులకోసమో కొలవకూడదు అలా ధాన్యం వృథా చేయ కూడదు. ఎద్దులనో లేక సుక్షాలనో ఉపయోగించి, పొలం దున్నుకోవడంకంటె సొంతంగా, స్వహస్తాలతో, ఆ పనులు నెర వేర్చుకోవడంవల్ల ఖర్చు తగ్గుతుంది. అంతేకాదు ఒక్క పొలం లోనే మాటిమాటికీ ఎరువులు వేస్తూపోవడంకంటె ఒక ఏడాది ఒకచోటా మరోఏడాది మరోచోటా ఎరువువేసి సాగు చేయడం మంచిది. శ్రద్ధకనుకఉంటే మనిషి ఈ పనులన్నీ చక్కగా నిదానంగా చేసుకోవచ్చును. గొడ్డు గోదా—వాటి బాదరబందీ అవసరమేలేదు. మనుష్యులు గొడ్డు గోదను తామేదో మహా పోషిస్తున్నట్లుగా, వాటిని కాపాడుతున్నట్లుగా భావిస్తారు. కాని నిజానికి అవే వారిని పోషిస్తున్నాయి. ఎద్దు కేవలం ఉపయోగకరమైన, అవసరమైన పనులుమాత్రమే చేస్తాయి. కాని మనుష్యులో! భోగాలకై విలాసవస్తువుల్ని అనంతంగా, నిరంతరం తయారుచేస్తున్నారు. పనిలేనివాడుచేసే పనులుకూడా చేస్తున్నారు. అంతేకాక వాటికన్నాడా వారు క్రమంగా బానిసలవుతున్నారు. ఈ ప్రాంతంలో పరిశీలిస్తే కొండరాళ్ళతో, ఇటుకలతో కట్టిన మంచిభవనాలు చాలా కన్పి స్తాయి. అయినా ఏరైతు గొడ్లసావిడి అసలుఇంటికంటెకూడా పెద్దదిగా విశాలంగా కన్పిస్తుందో అతను భాగ్యవంతు డనిపించు కొంటున్నాడు. పైగా ఈ ఊరు గొడ్లసావిళ్ళకు పేరుపొందింది కూడా! అలాగే ఇక్కడపెద్దపెద్ద పురమందిరాలూ, కచేరీలు ఉన్నాయి. స్వేచ్ఛగా ప్రార్థనలు జరుపుకొనేందుకూ, ప్రజలు ఒకచోటచేరి మాట్లాడుకొనేందుకూ తగిన భవనాలుమాత్రం

కొంతగా ఉన్నాయి. ఈ భవనాలూ, ఈగోడ్ల సావిళ్లూ...ఇవన్నీ ఎందుకూ? నిలుస్తాయనే! ఆసియా దేశాలుకూడా ఈ విధంగా చూస్తే భాగ్యవంతమైన దేశాలే. అక్కడకూడా కొన్ని వందల రాజభవనాల శిథిలాలు కన్పిస్తాయి. కానీ వాటి నన్నింటినీ మించి—వాటన్నింటికీ కాలానికికూడా అతీతంగా నిలచిఉన్న భగవద్గీత చూడండీ! దాన్ని ఎంత అభినందించినా తనివి తీరుతుందా!

ఈ దేవాలయాలూ, ఈ గాలిగోపురాలూ, మహారాజుల విలాసాలనూ, భాగ్యభోగ్యాలనూ సూచిస్తుంటాయి. కాని నిరాడంబరమైన, స్వేచ్ఛాయుతమైన మనః ప్రవృత్తి ఏనాడూ రారాజుల ఆజ్ఞలకు లోబడిఉండదు; వాళ్ళ చెప్పు చేతల్లో పడి అనవసరక్లేశాన్ని భరించదు. విజ్ఞానమూ, ప్రతిభ అన్నది ఏ చక్రవర్తికీ ఏనాడూ దాస్యం చెయ్యదు. అల్లాగే భాగ్యాలకున్నూ. అది వెండి బంగారాలకు, చలువరాళ్ళకు దాసోహం మనదు. ఈ ప్రతిభ సర్వ స్వతంత్రంగా ఉండగలదు.

అయ్యో ఎందుకండీ ఆ కొండరాళ్ళన్నీ అలా పగల కొడుతున్నారూ? సుత్తిపుచ్చుకొని అలా పొద్దస్తమానం పని చేస్తున్నారే! ఎందుకూ? అవు నవును, పూర్వంనుంచీ కూడా దేశాలకు దేశాలు, జాతులకు జాతులు తమ ఔద్ధత్యం శాశ్వతంగా నిలుపుకోవడంకోసం పిచ్చిగా ఆశపడుతూ ఇలానే రాతి కట్టడాలు కట్టి పొయ్యాయి. ఆ మనుష్యులంతా తాము నిర్గమించిపొయ్యే ఆ కట్టడాలవల్లనే తమస్మృతి నిలచిపోతుందని తమ కీర్తి మూర్తిగట్టుకొని ఆచంద్రార్కంగా ఉండి పోతుందని ఆపోహపడ్డారు. వాళ్ళు ఆరోజుల్లో ఎంతకాలాన్ని వ్యయం

చేసి, ఎన్ని వందలరాళ్ళను చదునుచేసి మెరుగుపెట్టాలని ఎంత ప్రయాసపడ్డారో! అంతకంటే వాళ్లు తమ ప్రవర్తనను సరిదిద్దు కొని దానికి మెరుగుపెట్టుకొని ఉంటే ఎంత బాగుండేదో! స్మారకచిహ్నాంగా చంద్రమండలాన్ని, తారామండలాన్ని తాకుతున్నట్లు అనిపించే కట్టడాలను నిర్మించాలని కుతూహలపడి ప్రయాసపడేకంటే వారు ఒక్క ఉన్నతమైన ఊహ చేస్తే చాలు. ఒక్క విషయంలో విజ్ఞత కనపరిస్తే చాలు. ఇది దానికంటే ఎన్నో రెట్లు ఉత్తమమూ, అత్యున్నతమూ అవుతుంది.

ఒకనాటి ఈజిప్టు రాజధానీ నగరమైన "తీబ్స్" నగరం చూడండి. శిథిలాలను పరిశీలించండి. నగరానికి చుట్టూ వంద ద్వారాలతో బ్రహ్మాండమైన రాతి ప్రాకారం ఉండేది. అబ్బ! వాళ్ళు ఎంత శ్రమపడ్డారో!. ఎంతటి విలాసం! విలాసమే కదా! వారి అంతిమ పతనానికి కారణమైంది. నిజమైన జీవిత లక్ష్యాలన్ని వారు దృష్టిలోనే పెట్టుకోలేదుకదా! ఆ యూ జాతుల వారంతా, అంతమందీ పగలగొట్టి చదునుచేసిన రాళ్ళల్లో అత్యధికభాగం గోరీల నిర్మాణానికే వినియోగ మైనాయి. అలాగా రాళ్లు చెక్కిన జాతులు ఆ రాళ్ళతో గోరీలు కట్టుకు న్నాయి. ఆ పిరమిడ్ల విషయంలో మీరంతగా ఆశ్చర్యపడవల సిందిఏమీ లేదు. అన్ని వేలమంది మనుష్యులు అంతగా దిగజారి పోయి ఎవడో ఒక దురాశాపరుడైన వెఱ్ఱివాని గోరీ నిర్మా ణానికై రాళ్లుమోస్తూ జీవితం అంతా ఎందుకల్లా కష్టపడ్డారో కదా అని మనం విచారపడాలి. అంతకంటె వాళ్లు కాస్త తెలి వైనవాళ్ళయి, ఆ పిచ్చివాణ్ని, ఆ వెఱ్ఱివెంగళప్పను తాపంగా అకారణంగా ఇంత శ్రమపడేబదులు, ఆ నైలునదిలో ముంచి,

ఆ శవాన్ని...... వేటిముందో పారేస్తే పోయ్యేది. అదంతా జరిగిపోయిన విషయంకనుక అతనూ, వాళ్ళూ ఏదో క్షమార్హులే లెండని చెప్పడానికై ఏవో కొన్ని కారణాలు వెతికి చూపెట్టగలను. కాని అందుకు నాకు వ్యవధిలేదు. మతవిషయంలోనూ, భవనాలు నిర్మించాలన్న ఆసక్తి, ఆత్రమూ కన్పరచడంలోనూ పరిస్థితి ప్రపంచం అంతటా ఒక్కవిధంగానే ఉన్నది. అక్కడ ఆ ఈజిప్టుదేశంలో బ్రహ్మాండమైన దేవాలయాలు కడితే ఇక్కడ మనదేశంలో మనవాళ్లు అంత ఎత్తునాయున్నై ఔడ్ స్టేట్సు బ్యాంకు భవనాలు కట్టారు. వాటి ప్రయోజనాలను విలువకట్టి ఆ విలువలదృష్ట్యా చూస్తే వాటికైనవ్యయం ఎక్కువేకదా! వీటి అన్నింటికీ మూలకారణం ఒక్కటే. మిథ్య. ఒట్టి గర్వం. దానికి జనానీకానికి ఉన్న ఐహికవాంఛలు బలాన్ని చేకూరుస్తూ ఉంటాయి. ఏదో డాబు, హుందాతనాన్ని నవాబుదర్జా ప్రదర్శించాలని. అంతకంటెమించి మరేమీ కాదు. ఈ పట్టణంలో పూర్వం ఓ పిచ్చివాడు — అంటే నా ఉద్దేశంలో సుమండీ, ఇక్కడనుండి చైనాదాకా పెద్ద సొరంగం త్రవ్వేస్తానన్నాడు; కాదు పని ఆరంభించానన్నాడు. చివరకు అది దాదాపు పూర్తి అయిందనీ, అటునుండి చైనావారి ఇళ్ళల్లోజరిగే సంభాషణలూ, గిన్నెల చప్పుళ్ళూ కూడా విన్పించేస్తున్నాయి అనికూడా అన్నాడు. కాని నేను మాత్రం వెళ్లి అతన్ని అభినందించలేదు. నా మార్గం వదలి అతన్ని మెచ్చుకోలేను. కొందరు స్మారకార్థం కట్టే ఈ భవనాలూ అవీ, ప్రాక్పశ్చిమ దేశాలలో ఎవరెవరు ఎప్పుడెప్పుడు కట్టారూ అని పరిశీలిస్తుంటారు. ఆత్రంగా ఇతరులను ప్రశ్నిస్తూ

ఉంటాను. నామట్టుకు నేను ఆ రోజుల్లో ఎవ రెవరు అలాంటివి కట్టలేదూ అని పరిశీలిస్తూ ఉంటాను. అలా అని ప్రశ్నిస్తుంటాను. ఎవరు ఇలాంటి అల్పవిషయాలకు అతీతంగా, దూరంగా ఉండ గలిగారో అని తెలిసికోవాలని ఆతురపడుతుంటాను... సరే వదిలెయ్యండి ఆవిషయాలు. ఇక నా స్వవిషయంలోకి వస్తాను.

నేను వాల్డన్‌లో ఉండగా గ్రామానికివెళ్ళి మధ్యమధ్య వడ్రంగంవంటి పనులు (అలాంటి పనులన్నీ నాకు బాగా వచ్చునుకనుక-) చేసి 13 డాలర్లు 34 సెంట్లు సంపాదించాను. బియ్యం, పిండీ, పంచదార, ఆపిల్‌పండ్లూ, ఉప్పూ ఇలా వీటి కైనదంతా లెక్కకట్టుకొంటే ఆ ఎనిమిది నెలలకూ అంటే జూలై నాల్గునుండి మార్చి ఒకటివరకూ నా తిండిక్రింద 8 డాలర్లు 74 సెంట్లు ఖర్చయింది. బట్టలకూ, మధ్యమధ్యవచ్చే అవాంతరపు ఖర్చులన్నీ కలుపుకొని 10 డాలర్లు 41 సెంట్లు అయింది. మొత్తం పంటమీాద వచ్చిందికానీ పనులు చెయ్యడం వలనకానీ వచ్చిన ఆదాయంనుంచి ఖర్చు మినహాయించగా 25 డాలర్లు 21 సెంట్లు మిగిలింది. వాల్డన్‌లో నేను ఈప్రయోగార్థమై తెచ్చుకొన్న పెట్టుబడిసొమ్ము- మూలధనం తిరిగి సంపాదించేశానన్నమాట, అక్కడ పరిశుభ్రమైన ఇల్లు కట్టుకొన్నాను. అక్కడ నాకు కావలసినంత స్వేచ్ఛ, శాంతి, విశ్రాంతీ లభించాయి. మొదట్లో వారానికి ఒట్టి తిండికే 25 సెంట్లు ఖర్చు అవుతున్నదని గ్రహించాను. క్రమంగా ఆ వ్యయం కొంతమేరకు తగ్గించుకొని హిందూదేశస్థులవలె కేవలం వరిధాన్యం వండుకొని-అన్నంతిని-బ్రతకడం నేర్చుకొన్నాను. అది నాకు సరిపడ్డది. రుచికీ, ఆరోగ్యానికీ కూడా.

పైగా హిందూదేశపు తత్త్వశాస్త్రంవలెనే, వారి ఆహారం కూడా–నాకు అత్యంత ప్రీతిపాత్రమైంది. ఈ రెండేళ్ళ అనుభవంలోనూ నాకు కొన్ని విషయాలు స్పష్టంగా బోధపడినాయి–ఏమంటే–ఈ ప్రాంతాలలోకూడా అతి స్వల్పమైన పరిశ్రమతో మనకు కావలసిన ఆహారాన్ని మనం సులభంగా సంపాదించుకోవచ్చును; మనిషికూడా ఇతర అన్ని జంతువులలాగానే అతి సాధారణమైన ఆహారంపైననే సలక్షణంగా బ్రతకవచ్చును. ఆ ఆహారంతోనే మంచి ఆరోగ్యాన్ని సంపాదించుకొని దృఢకాయులం కావచ్చును.

నేను సమకూర్చుకొన్న వస్తుసామగ్రి చాలా స్వల్పమైనది. అందులో కొన్ని నేను స్వయంగా కష్టపడి తయారుచేసుకొన్నాను. ఆ మిగిలినవన్నీ నాకు సులభంగా ఖర్చు లేకుండా లభించినవే. సామాన్లు అసహ్యంగా విపరీతంగా మాత్రం చేర్చలేదు. సామాన్లా! బ్రతుకుజీవుడా! నామట్టుకు నేను సామాన్లు లేకుండా స్వేచ్ఛగా, సుఖంగా బ్రతకగలిగాను. ఇకపోతే నాయింటి కిటికీలకూ, ద్వారాలకూ తెరలున్నాయా లేవా అనేనా మీ అనుమానం! బాగున్నదండీ–బాగుంది! అయ్యో! అటువంటివేమీ నాకు అవసరం లేదు. నా యింట్లోకి తరచు తొంగిచూచేవాళ్ళుగానీ నావంక ఎగాదిగా చూచేవాళ్ళుగానీ అక్కడెవ్వరూ లేరు. ఎటొచ్చీ ఒక్క సూర్యచంద్రులుతప్ప. వారు సర్వదా నాకు ప్రియులే. వారికి ఎల్లప్పుడూ స్వాగతమే. వారు అలా చూడడం నాకెంతో ఇష్టంకూడా.

ఇంట్లో మరి వేడిగా ఉన్నట్లు అనిపిస్తే బయటకువెళ్ళి

ప్రకృతికాంత స్వాగతాన్ని అందుకొని ఏ వృక్షచ్ఛాయలనో కొంతసేపు కూర్చుని విశ్రాంతి తీసుకొనేవాణ్ని. అంతేకానీ తెరలంటూ ఏవో తెప్పించుకొని సామాన్ల జాబితాలో వాటిని అదనంగా చేర్చడానికిమాత్రం ఇష్టపడలేక పోయ్యాను. ఒక సారి ఒకావిడ కాళ్ళుతుడుచుకొనే పట్టాఇస్తాను పట్టుకొనివెళ్ళ మని చెప్పింది. ఆమెదయకు ధన్యవాదాలుచెప్పి. "వద్దులెండి" అని చక్కావచ్చాను. నా యింటిముందున్న నేలపై కాళ్ళు తుడుచుకొంటే సరిపోయ్యేదానికి ఆ పట్టాకూడా ఎందుకు? అలాంటి పొరపాట్లు జరగకుండా మొదట్లోనే జాగ్రత్తపడాలి. లేకపోతే ఇక వరుసగా వచ్చేస్తాయి సామాన్లు ఒకదానివెంట మరొకటి. వాటివెంట బాధ్యతలూ, పాపపుణ్యాలు వస్తాయి. ఆవిధంగా నేను కేవలం నాకాయకష్టంమీద ఆధారపడి అక్కడ జీవితం గడిపాను.

సంవత్సరంలో కొన్నివారాలు కష్టపడి పనిచేస్తే ఆ ఏటి ఖర్చుకు కావాల్సిన డబ్బు సంపాదించుకోగలమని తెలుసు కొన్నాను. అందువల్లనే ఆ రెండేళ్లూ చలికాలమూ, వేసవి కాలము నేను హాయిగా స్వేచ్ఛగా విశ్రాంతిగా బ్రతికాను. నాకు అక్కడ చదువుకోడానికి కావలసినంత చక్కని వ్యవధి లభించేంది.

ఏమైనా మొత్తంమీద నాకుండే నమ్మకంవలన కానీండి, లేక అనుభూతివలన కానీండి కాక వీటి మేలుకలయికవలన కానీండీ కాస్త తెలివిగా, జీవింపగలిగితే జీవితాలు సుఖవంతా లవుతాయని తెలిసివచ్చింది. జీవించడము కష్టభూయిష్టం

కాదనీ- పైగా అది మధురానుభూతి అనీ- జీవించడమే ఒక దివ్యానందం అవుతుందనీ హృదయపూర్వకంగా విశ్వ సిస్తున్నాను.

కృత్రిమ నాగరకత పెరిగిన ప్రదేశాలలో మనుష్యులకు "పని" అనగానే ఏదో విసుగూ, చిరాకూ పుట్టుకొస్తుంటుంది. వాస్తవానికి పని అంటేనే ఒక ఆనందం. చక్కని మధురానుభూతి. అందువల్లనే సహజమైన సంస్కృతిగల జాతులలో మనుష్యులు పనిని ఒక ఆటగా, ఆనందదాయకమైన కాలక్షేపంగా పరిగణిస్తారు. ఇతరులు-అలాటి పరిజ్ఞానంలేనివాళ్ళు, అలాటి సహజసంస్కృతి లేనివాళ్ళు పనిచెయ్యలేక విసుగు చెంది ఆ విసుగూ, ఆ చిరాకూ, పోగొట్టుకోవడానికని కొన్ని వినోదాలు కల్పించుకొంటారు. అలా క్రమంగా విలాసాలనే వ్యసనాలకు అలవాటు పడతారు.



# 5 సత్సంప్రదాయాలు

ఒకనాడు –

అప్పుడే చీకటి పడుతున్నది. అప్పుడు నేను చేపలుపట్టే గాలాన్నీ కొన్ని చేపలుగుచ్చి ఎత్తిన త్రాటినీ భుజాన వేసుకొని ఈల వేసుకుంటూ నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకొంటూ అడవిగుండా ఇంటికి తిరిగివస్తున్నాను. దారిలో నన్ను రాసుకొని చివ్వున పోతున్న చిన్నపక్షి కన్పించింది. ఆహా! ఏమి దానిఅందం! ఏమి దానిస్వేచ్ఛ! ఒళ్ళంతా ఏదో ఉత్సాహంతో, ఆనందముతో జలదరించిపోయింది, ఉప్పొంగిపోయింది; ఆ పిట్టను పట్టుకొని గుప్పెట్లోనే పిసికేసి ఉన్నపళంగా మింగేద్దామా అనిపించింది. నిజంగా అంత ఆకలి వేస్తున్నదని కాదు. అందుకు కారణం – అది ప్రదర్శిస్తున్న ఆటవికమైన స్వేచ్ఛాప్రవృత్తి, నిరాటంకమైన స్వేచ్ఛాశీలత; నిర్భయ నగ్నసౌందర్యరూప ప్రదర్శన. ఆ అందాలపిట్ట నాలో అటువంటి విచిత్రకాంక్ష రేకెత్తించడమే అందుకు కారణం. నే నావాల్డన్ చెరువుఒడ్డున నివాస మేర్పరచుకొని ఉంటూ వచ్చిన సమయంలో మరికొన్నిసార్లు కూడా నాకు అదే విధంగా, అనిపించింది. ఆకలితో నకనకలాడుతున్న నక్కలా వేటకుక్కలా, ఆ సమయానికి ఏదో ఇంత మాంసం దొరికితే

చాలు, మింగేద్దామా అన్నట్లుగా ఓ విచిత్ర స్వేచ్ఛాప్రవృత్తితో అప్రయత్నంగా అడవుల్లో తిరుగుతూ ఉండేవాణ్ణి. ఒక టెకనికాంక్ష ఏదో నాలో రేగుతుండగా, ఒకానొక విచిత్ర గాఢకాంతాపరితప్త హృదయంతో నేను తిరుగుతుండే వాణ్ణి. అల్లా అనిపించేది, ఆరోజుల్లో. అందువల్ల నే ఆ అడవిలో ప్రతి భయంకర ప్రశాంత ప్రదేశమూ నాకు సుపరిచితమే అయింది. అప్పట్లో నేనొక విషయాన్ని స్పష్టంగా గుర్తించాను.

"నాలో నాకు తెలియకుండానే, ఒకానొక స్వభావము, స్వభావసిద్ధమైన ప్రవృత్తి ఉన్నది" అని నేను గుర్తించాను. అలాటిది అనాగరకమానవుని ఆరంభదశకు అత్యంత సన్నిహిత సంబంధం కలిగి ఉన్నదనే నా విశ్వాసం. అలాటి స్వభావమేకాక, దానితోపాటు నాలోనే, ఒకానొక దైవిక స్వభావం, మానవాతీతమైన ఆధ్యాత్మికచింతనా ప్రవృత్తి కూడా ఉన్నది. ఆనాడు నేను ఈ రెండింటినీ గుర్తించాను. ఇప్పటికీ గుర్తిస్తున్నాను. నేను ఈ రెండింటినీ సమానంగానే గౌరవిస్తాను.

నాకు ఇటు ఆటవికమూ అనాగరకమూ అయిన వస్తువులయందూ ప్రీతిఉన్నది; అటు – ఉత్తమమూ, నాగరకమూ అయిన వస్తువులయందూ ప్రీతిఉన్నది. అందువల్ల నే భయభ్రాంతి సాహసాలతో కూడిన వేటలో నాకు మంచి ఆసక్తి కలిగింది. కొన్నిసార్లు అడవిజంతువుల్లా, స్వేచ్ఛగా నిర్భయంగా, రోజంతా గడపివెయ్యాలని అనిపిస్తుండేది. ఇటువంటి స్వభావం, వేటయందు అభిలాషా, బహుశః ప్రకృ

తితో సన్నిహిత సంబంధం కలిగిన నా చిన్ననాటనే, నాలో ఏర్పడి ఉంటాయని అనుకొంటాను. అలాటి స్వాభావ ఆసక్తులు ప్రకృతిమూలకంగా మనలో ప్రవేశిస్తాయనుకొంటాను; కాక అటువంటిది జరగడానికి అంత చిరుతప్రాయంలో మరో అవకాశమే లేదు. వేటగాండ్రూ, బోయీలూ, కట్టెలు కొట్టుకొని జీవించేవాళ్లూ ప్రకృతికి అత్యంత సన్నిహితులు. అసలూ వాళ్ళు ప్రకృతిలో ఒకభాగమే. వాళ్ళు తమతమ వేటలో–పనిలో–ఉండగా మధ్యమధ్య లభించిన విశ్రాంతిసమయాల్లో ప్రకృతి సౌందర్యాన్ని చూస్తారు. ఆ మాధుర్యాన్ని ఆస్వాదిస్తారు. ప్రకృతి దివ్యసౌరభాన్ని గ్రహిస్తారు. వారికి అలాటి అవకాశమూ, అలాటి మానసికస్థితీ ప్రకృతినుంచి ఏమో ఆశిస్తూ, ప్రకృతిలో ఏమేమో కనిపెడదామని నిరంతరం కుతూహలపడుతూ పరిశీలనచేసే వేదాంతులకంటే, కవులకంటే అధికంగా ఘనంగా లభిస్తుందని నా విశ్వాసం. వారిముందు తన సర్వ సౌందర్య ప్రదర్శనము చేయడానికి, స్వీయ మాహాత్మ్యాన్ని ఆవిష్కరించడానికీ ప్రకృతి కించిన్మాత్రం కూడా భయపడదు. వారు ప్రకృతికి అంత ఆత్మీయులుగా, అంతటి అత్యంత సన్నిహితులుగా కన్పిస్తారు. ప్రకృతితో అతి సన్నిహిత సంబంధం కలవారికి మాత్రమే దాని గంభీరమూ, గుప్త సౌందర్యమూ గోచరిస్తాయి. ఊరికే ప్రక్కగా నడిచివెళ్లే వాడికి, పట్టీపట్టనట్లుగా వెళ్లే ప్రయాణీకునికీ, ప్రత్యేక సంబంధం లేనివాడికీ అలాటిది గోచరించదు. అది దర్శనీయము కాదు.

నేనా చెరువు ఒడ్డున కాపురముంటూ ఉన్నరోజుల్లో నా తినుబండారాలలో, నా ఆహారంలో వైవిధ్యంకోసం కొన్ని

చేపలను పట్టుకొనివచ్చి వండుకొనేవాణ్ని. అంతేకాదు; కొన్ని సమయాల్లో మొట్టమొదటి బోయీలు ఏ అవసరాన్ని గుర్తించి చేపలు పట్టారో నేనూ అందుకే చేపలుపట్టాను.

అప్పటి నా అనుభవాలకంటె నా తాత్త్విక సిద్ధాంతమే నన్ను ఎక్కువగా వశపరచుకొన్నది. నేను రెండవదానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. అయితే ఈ చేపల్ని, ఈ పురుగుల్ని చూచి నేనేమీ మీ అందరికంటె ఎక్కువగా జాలిపడడంలేదు. అటువంటిదేమీ కాదు. ఇది కేవలం నా అలవాటు అనిమాత్రమే.

ఇక పక్షుల వేట విషయమూ! కొన్నాళ్ళ క్రితం నేను పక్షిశాస్త్రము అభ్యసిస్తున్నానని వంకపెట్టుకొని, తుపాకీ అంటే పెద్దగా ఆసక్తి లేకపోయినా, తుపాకీ ఒకటి వెంటేసుకొని తిరుగుతుండేవాణ్ని. కానీ ఇప్పుడో విషయాన్ని కనుక్కొన్నాను. చేసినతప్పు ఒప్పుకోవడానికి సిద్ధపడుతున్నాను, అది ఏమంటే, పక్షిశాస్త్రాన్ని అభ్యసించడానికి పక్షుల్ని కాల్చి చంపి పరిశీలించేకంటే మంచిమార్గం ఉన్నదని. ఆ శాస్త్రాన్ని అభ్యసించడానికి పక్షులకు మరింత దగ్గరగా ఉండి, వాటి అలవాట్లనూ, వాటి స్వభావాలనూ పరిశీలన చెయ్యాలి. ఈ విషయాలు గుర్తించి, తర్వాత తర్వాత ఆ తుపాకీని విడిచిపెట్టేశాను. అంతేకాదు మరోటికూడా అనిపిస్తుంది. ఏమంటే, మనమంతా ప్రకృతితో ఎటువంటి సంబంధంవలన, ప్రాపకం వలన, దృశ్యమానముకాని అంతస్సాన్నిహిత్యం వలన ప్రాణాలను కాపాడుకొంటున్నామో, ఆ యా జంతువులూ అలాగే ప్రాణాలను నిలబెట్టుకొంటున్నాయి కనుక ఏ మానవుడైనా

వివక్షతా జ్ఞానంలేని బాల్యావస్థ దాటినతర్వాత కావాలని ఏ ప్రాణినీ ఖూనీ చెయ్యడు, చెయ్యకూడదు. లేడి - తన్ను బాధించినప్పుడు దాని పీక గట్టిగా పట్టుకొన్నప్పుడు సరిగ్గా పసిపిల్లవాడి లాగానే ఏడుస్తుంది. సర్వజంతువులూ కష్టం కలిగితే మనలాగానే బాధపడతాయి. బాధ అన్నది వాటికీ ఉన్నది. గత కొద్ది సంవత్సరాలుగా చేపలు పట్టడానికి సిద్ధపడిన ప్పుడల్లా, నా ఆత్మాభిమానం దెబ్బతింటున్నట్లు, నేను బాధ పడుతున్నట్లు గుర్తించాను. అది నిజమో కాదో అనుమానం కలిగి మరల మరల ప్రయత్నించి చూచాను. నిజానికి నాకు చేపలుపట్టడంలో మంచి ఒడుపు ఉన్నది. సహజమైన అంటే అది స్వభావంతో అబ్బిన నేర్పు. నీళ్ళల్లో వాటి ఉనికిని ఇట్టే పసిగట్టి గాలం విసరగలను. కాని ఎందువల్లనో అలా చేపలు పట్టినప్పుడల్లా బాధే కలుగుతూవచ్చింది. ప్రతీసారీ 'అయ్యో అలా చెయ్యకుండా ఉంటే బాగుండిపొయ్యేదే!' అని అనిపిస్తూ వచ్చింది. ఆవిషయాన్ని నేను నిశ్చయంగా నిర్దుష్టంగా గుర్తించాను. గుర్తించి నేను ఒక అభిప్రాయానికి వచ్చాను. రాబోయే పగటివేళను సూచిస్తూ సన్నని సూర్య కాంతులు వేకువఝాముధ లోకంలో ప్రవేశించినట్లుగా దృఢ తరం కాబోతున్న నా మనోనిశ్చయాన్ని సూచిస్తూ అలాటి అభిప్రాయం నా మనస్సులో ప్రవేశించింది. చేపలవేట ఏడాది కేడాది గడచినకొద్దీ క్రమంగా తగ్గించివేశాను. అంటే పూర్వం కంటే వాటియందు సానుభూతీ, కాక నా విజ్ఞానమూ, అధిక తరం అయిందనికాదు. ఏదెట్లాఉన్నా క్రమంగా ఆవని తగ్గించాను. ఇప్పుడు నేను ఆ పాడు చేపలవేట పూర్తిగా మాని

వేశాను. కాని మళ్ళా అటువంటి విపరీతపు వాతావరణంలో జీవించడమే సంభవిస్తే మళ్ళీ నేను చేపలు పట్టడానికీ, మళ్ళీ ఆరకం వేటగాణ్ణిగా మారడానికీ అవకాశం కలుగవచ్చును! అలాగా నా మనస్సు నన్ను పురికొల్పుతుందేమో! చెప్ప లేను. మనస్సు మహావిచిత్రమైంది సుమండీ!

ఇవన్నీ ఇలాఉండగా-మాంసాహారంలో ఏదో అపరి శుభ్రత ఉన్నట్లు తోస్తున్నది. గృహకృత్యాలలో గృహ పరి శుభ్రతను కాపాడడంలో మనమందరమూ ఎంత కష్టపడతా మో చూడండీ! జంతువుల్ని చంపి మాంసాహారాన్ని తయారు చేసేటప్పుడు వచ్చే దుర్వాసనల నన్నింటినీ తొలగించేందుకు అనేక ప్రయత్నాలుచేస్తూ మనం నిత్యం పడేశ్రమను కొంచెం గమనించండి. ఆవిషయం మీకే అర్థమవుతుంది. నేను మాంసా హారం తినేరోజుల్లో అన్నిపనులూ నేనే స్వయంగా చేసుకొనే వాణ్ణి. అప్పుడు జంతువుల్ని చంపే కసాయివాణ్ణి నేనే-వంట చేసే వంటవాణ్ణి నేనే- అంట్లూ అవీ తోమే పనిమనిషినీనేనే. తినుబండారా లన్నీ పళ్ళేరాలలో సిద్ధపరచిన తర్వాత బల్ల ముందు కుర్చీవేసుకొని అవన్నీ ఆరగించే పెద్దమనిషినీ నేనే. అందువల్ల ఈవిషయంలో నేను మిక్కిలి అసామాన్యమైన సర్వసంపూర్ణమైన అనుభూతిని పురస్కరించుకొని మాట్లాడు తున్నాను. మాంసాహారం స్వీకరించడంలో ముఖ్యమైన అభ్యం తరం-అదీ నా స్వవిషయంలో-ఏమంటే అపరిశుభ్రత. అంతే కాక అంతా శ్రమపడి వాటిని పట్టుకొని బండకేసి రాచి,ఉప్పు నీళ్ళల్లో కడిగి వండుకొని ఆ చేపలమాంసం తిన్నాక ఆతిండి నాకు సరిపోనట్లు, కడుపు నిండనట్లు అనిపించేది. దాన్ని నా

మొత్తం ఆహారంతో పోల్చిచూస్తే అది అతిస్వల్పం. దానివల్ల కలిగే ప్రయోజనంకంటే దానికోసం పడినశ్రమ పదిరెట్లు అధికం. కాస్తంత రొట్టెముక్కో, ఇన్ని ఉడకేసిన బంగాళాదుంపలూ తింటే-అంతకంటె తక్కువశ్రమతో సరిపోతుంది. అలాగా సరిపొయ్యేదికూడా. నా సమకాలికులు చాలామందివలెనే నేనూ మాంసాహారాన్నీ, టీ, కాఫీలనూ చాలా అరుదుగా స్వీకరించాను. వాటికేదో చెడుగును అంటగడుతూకాదు; వాటిలో నాకేవో దుష్ఫలితాలు కన్పించాయనీకాదు. నా ఊహకు, నా మనస్సుకు అవి సరిపడకపోవడంవల్ల మాత్రమే అలా చేశాను. అలాగా మాంసాహారమంటే కలిగిన నా అయిష్టత కేవలం, నా జీవితానుభూతిని పురస్కరించుకొన్నది. అది స్వభావజన్యమైనది.

తనలోని ఉన్నతశక్తులను ఉత్తమస్థాయిలో నిలువరించుకోవడానికీ, కవితాశక్తిని నిలబెట్టుకోవడానికీ మనసారా ప్రయత్నించిన ప్రతివ్యక్తీ మాంసాహారానికి దూరంగా ఉండడానికే ఇష్టపడతాడు. అసలు మాంసాహారమేకాదు; అధికంగా ఏ ఆహారాన్ని స్వీకరించడావ్యక్తి.

మన మనస్సుకు-మన ఊహాశక్తికి-భంగకరంగా, అవమానకరంగా ఉండని ఆహారాన్ని సంపాదించుకోవడం కొంచెం కష్టంకావచ్చును. ఆకలి తీర్చుకొని శరీరాన్ని తృప్తిపరచినట్లే, మనస్సునూ దానికి కలిగే అభ్యంతరాన్నికూడా తొలగించి తృప్తిపరచవలసే ఉన్నది. ఒక్క మాంసాహారమేకాదు; అధికంగా మసాలాదినుసులు వేసిన ఆహారంతో పొట్టనింపేసుకొని కేవలం శరీరాన్ని తృప్తిపరచడంకూడా నాకు ఎంతమాత్రమూ

సమ్మతంకాదు. శుభ్రమైన ఇన్నిపండ్లు మితంగా భుజించడం వల్ల ఇటు శరీరానికీ, అటు మనస్సుకూ తృప్తి కలుగుతుంది. అటువంటి ఆహారం మన ఉన్నత ఆదర్శసాధనకు ఏవిధంగానూ అవరోధంకాదు. ఏవిధంగానూ బాధికం కాదు.

తమకు-రోజూ ఇతరులు వండి వార్చి సిద్ధంచేసి అంద చేస్తున్న ఆహారమే-అది మాంసాహారమైనా శాకాహారమైనా-ఆవేళ ఏదో కారణంవల్ల తామే వండుకోవలసివచ్చి తత్ప్రయత్నంలో ఉండగా ఎవరైనా చూడడం తటస్థపడితే ఆ పెద్ద మనిషి ఎంతో బాధపడిపోతాడు. అందువల్ల ఆపరిస్థితి మారే వరకూ మనం నాగరకులమని చెప్పకోడానికి వీలులేదు. ఈవిష యంలో ఏమార్పు కావాలో ఆలోచిస్తే-కాస్త నిదానంగా ఆలోచిస్తే, మీ అంతట మీకే బోధపడుతుంది.

'మాంసానికీ-క్రొవ్వుపదార్థానికీ నీమనస్సు ఎందుకు సరిపడదూ? అవంటే ఎందుకు నీమనస్సు సమాధానపడదు?' అని అడగడం ఓ వ్యర్థమైన ప్రశ్న వేయడంవంటిదే అవుతుంది. సమాధానపడదు- అంతే.

'మానవుడు జంతుమాంస భక్షకుడు' అని అనడం వల్ల అది ఒక దూషణగా మీకు కన్పించడంలేదూ?! అది ఒక లోపంగా మీకు అనిపించటం లేదటండీ?

నిజమే! మనిషి-జంతుమాంసాన్ని భక్షించగలడు. ఇతర జంతువుల్ని వేటాడుతూ అత నలా జీవిస్తాడుకూడా. కానీ అది ఒక దుర్భరమైన జీవనవిధానం. అమాయికంగా పరుగులిడుతూఉండే కుందేళ్ళను పట్టుకొంటూ, నిష్కల్మషంగా కన్పించే మేకపిల్లలను నరికివేస్తూ, తినితిరిగే మనిషికే కొన్నా

క్రూరుని మనస్సు మారుతుంది. తప్పకుండా నిస్సందేహంగా అతని మనస్సు మారిపోతుంది. కల్మషరహితమూ, సంపూర్ణమూ, అయిన ఆహారాన్ని మాత్రమే స్వీకరించమని తోటివారికి బోధించేవాడు మానవజాతికి మేలుచేసినవా డవుతాడు. నీవు ఖచ్చితంగా అనుభవంలో-ఆచరణలో ఇలాంటిమార్గాన్ని అవలంబించావా అని గ్రుచ్చిగ్రుచ్చి నన్ను మీరు అడగవచ్చు. నా మొదటి అనుభవాలు వేరుగా ఉండవచ్చును; నేను కొన్ని తప్పులు-తప్పటడుగులే చేసిఉండవచ్చును ఈవిషయంలో. కాని క్రమ క్రమాభివృద్ధిపొందుతూఉన్న ఈ మానవజాతి తాను అందుకో వలసిన అంతిమ ఆదర్శంలో-ఉత్తమ లక్ష్యంలో జంతుభక్షణను త్యజించడంకూడా ఒకభాగంగా ఎంచుకొంటుంది. క్రమంగా తమకంటే నాగరకతా సంస్కృతిగల జాతులతో పరిచయం కలుగగా కలుగగా ఆదిమానవులు, పూర్వ మొక నాటి-ఆనాటి అనాగరకులు ఒకరినొకరు చంపుకొని మానవ మాంసభక్షణం చేయడం మానివేసినట్లుగా-ముందుముందు తప్పకుండా పరప్రాణులను, జంతువులనుచంపి వాటిమాంసాన్ని తినడం మానివేస్తారు. అలా అని నాకు దృఢవిశ్వాసం ఉన్నది.

ఇతర పానీయాలకంటే నాకు స్వచ్ఛమైన నీరంటేనే ఎక్కువ ప్రీతి. నల్లమందు వేసుకొన్నవాడు ఆకాశాన్ని చూచి భ్రాంతిపడి అదేదో స్వర్గమనుకొని కలవరిస్తాడు. అటువంటి స్వర్గంకంటే నాకు సహజంగా కన్పించే విశాలమూ, గంభీరమూ అయిన స్వచ్ఛాకాశం చాలు. సారాలకంటే నీరే ఉత్తమమైన అత్యంత రుచికరమైన పానీయమని నా నమ్మకం. కాఫీ, టీ మొదలైన ఆయా పానీయాలు తాగి సాంధ్యవేళల

కన్పించే ఆ సౌందర్యము, సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో ద్యోతకమయ్యే ఆ దివ్యసుందర దృశ్యాలను నిత్య నూతనమూ, ఆపాత మధురమూ అయిన ఆ నవ నవ్యమధుర సన్నివేశాలను దర్శించే అవకాశాన్ని కోల్పోలేను. కావాలని జారవిడుచుకోలేను. అవి పుచ్చుకోవాలని అనిపించినప్పుడు అవి నా మనస్సును ఆకర్షించినప్పుడు నేనెంత క్రిందకు దిగజారిపోతున్నానా అని అనిపిస్తుంది. అనేక రూపాంతరాలలో కన్పించినా విషయాసక్తి, భోగాసక్తి అన్నది అంతా ఒక్కటే; అలాగే స్వాచ్ఛందనమూ, పావిత్ర్యమున్నూ. ఆహార పానీయ నిద్రారత్యాదుల విషయంలో ఇదే కన్పిస్తుంది. ఈ విషయాసక్తి ఇంద్రియ లౌల్యము కన్పిస్తుంది. అవన్నీ ఒక కాంక్ష, ఒకానొక దాహం వల్లనే ఉద్భవిస్తాయి. ఒక మనిషి ఎంతటి విషయలోలుడో కనుగొనడానికి ఆహార పానీయ నిద్రాది నియమాలలో ఏ ఒక్కదాన్ని పరిశీలనచేసినా సరిపోతుంది. కాలుష్యము, స్వాచ్ఛందనము ఇవి ప్రక్కప్రక్కల నిలువలేవు. ఒక చోట కలిసి ఉండలేనివి. అది ఉన్నచోట ఇది ఉండదు. ఇది ఉన్నచోట అది ఉండదు. అది ఉండడమే తటస్థపడినప్పుడు కలుషితమైన ఆ విషయాసక్తిని, ఆ లౌల్యాన్ని అరికట్టలేము. అది ఒక విషభుజంగం వంటిది. అది ఉన్న పుట్టదగ్గర నిలబడి ఒక రంధ్ర ముఖందగ్గర దాన్ని కొట్టబోతే అది తప్పించుకొని మరో రంధ్రముఖంనుండి తొంగిచూచి బుసకొడుతుంది. అంటే ఆ భోగ లాలసత్వాన్ని పూర్తిగా చంపుకోవాలిగాని ఏదో కొంత అణచుకొన్నాంగదా అనుకొంటే ఒప్పదు. ఒక రూపంలో దాన్ని అణచుకొంటే మరొకరూపంలో అది

ప్రత్యక్షమవుతుంది. ఒక వ్యసనాన్ని అణుస్తుంటే వేరొకవ్యసనం వెంటపడుతుంది. నీవు స్వచ్ఛంగా ఉండాలంటేఆహార నిద్రాదులలో తప్పనిసరిగా మితంగా వ్యవహరించాలి. ఏమిటీ స్వచ్ఛందనం? ఎలా తెలుస్తుందీ మనిషికి తాను స్వచ్ఛంగా ఉన్నట్లు? ఎప్పటికీ తెలియకపోవచ్చును. ఈ సుగుణాన్ని గురించి మనం విన్నాం కానీ దాన్ని గురించి-అదంటే ఏమిటో మనకున్నష్టంగా తెలియదు-దానివిషయమే విన్నా మనిమాత్రం మహాస్వేచ్ఛగా ఉపన్యాసాలుమాత్రం ఇస్తూఉంటాం తరచుగా.

కష్టపడి పనిచేయడంవల్లనే జ్ఞానమూ-స్వచ్ఛందనమూ ఆవిర్భవిస్తాయి. ఏపనీ ఒళ్లువంచి చెయ్యకపోవడంలోనే,- సోమరితనంలోనే అజ్ఞానమూ, విషయాసక్తీ ప్రత్యక్ష మవుతాయి. విదార్థిలో భోగలాలసత కన్పిస్తే అది అతని సోమరితనపు మానసిక దౌర్బల్యంవల్ల, దురభ్యాసంవల్ల కలిగినదనే చెప్పాలి. ప్రపంచంలో మీ రెక్కడయినా చూడండీ అపరిశుభ్రంగా మకిలి పేరపెట్టుకొని తిరిగేవాడు ఎవ్వడో సోమరియైఉంటాడు. అటువంటివాడు సామాన్యంగా, బయట చక్కగా ఎండ కాస్తుంటే కాళ్ళుముడుచుకొని కూర్చుని చలికాచుకొంటూ ఉంటాడు. ఏమాత్రమూ కష్టపడకపోయినా విశ్రాంతి తీసుకోవాలని ప్రయత్నిస్తుంటాడు. అపరిశుభ్రతనూ అన్నిరకాల పాపాలనూ తప్పించుకోవాలీ అంటే వాటికి దూరంతో ఉండాలనుకొంటే ఏ గొడ్లసావిడిలో పనిచేస్తున్నవాడినైనా, ఫ్యాక్టరీలో పనిచేస్తున్న కూలీనైనా, ఆఫీసులోపనిచేస్తున్న గుమాస్తాలైనా, కాదు మంత్రివైనా-వళ్ళువంచి కష్టపడి పనిచెయ్యి.

## పని .

పనిచెయ్యడం ఒక్కటేమార్గం. స్వభావాన్ని జయించడం కష్టమే.- అతిక్రమించడం క్లిష్టమైనపనే, కానీ జయించి తీరాలి. అతిక్రమించక తప్పదు. మనలోఉన్న పశుత్వాన్ని మనంగమనించాలి. అదిమనలోని ఉత్తమప్రవృత్తి. దివ్య పకృతి నిద్రాణమై యున్నప్పుడు విజృంభిస్తుంది. అదిమనకు శత్రువు వంటిది. విషయాసక్తిని ముసుగుగాధరించి మనం కాస్త ఏమరుపాటుగా, కొంచెం బలహీనంగా ఉన్నప్పుడు మనపైకి దాడి వెడలివస్తుంది. సూక్ష్మజీవుల్లా అది శరీరాన్ని అంతటినీ ఆక్రమించి వేస్తుంది. తాత్కాలికంగా దాన్నుండి తప్పుకొన్నా, అది కాస్త ప్రక్కకు తొలగిందని అనిపించినా, దానిస్వభావం అది మానదు. కనుక విషయాసక్తి అన్నది స్వభావసిద్ధమైనదే కావచ్చును. కాని దాన్ని మనం జయించాలి.

ప్రతిమానవుడూ శరీరమనే దేవాలయ నిర్మాత. తాను నమ్మిన భగవంతునకై నిర్మించి దాన్ని తనకు నచ్చినవిధానంలో అతి పవిత్రంగా కాపాడుకొంటూ పోషించుకొంటాడు. భగవంతునకు అర్పించబోయే పూజాపుష్పంలా భావించుకొంటాడు దాన్ని. నిజానికి అల్లా పోషించుకోవాలి; అల్లా భావన చెయ్యాలి. ఊరికే చలువరాళ్ళపై దేవతా విగ్రహాలు చెక్కివేస్తున్నంతమాత్రాన చాలదు. అలాచేసి అతను తప్పించుకో లేడు. మనమందరమూ శిల్పులమూ-కుంచెలతోరంగులు దిద్దే చిత్రకారులము. వాడికి శిలలూ, ఉలులూ, కాగితాలు, కాన్వాసుగుడ్డలూ, కుంచెలూ, రంగులూ, ముడిసరుకు అయితే మనకు మన శరీరంలోని రక్తమాంసాలే అస్తికలే ముడిసరుకు.

ఉన్న తాదర్శమే, స్వచ్ఛందనమే మానవునిలో సౌందర్యాన్ని కూర్చి అందాలు దిద్దుతుంది. నీచత్వమే-విషయాసక్తియే మానవునిలో, లోని పశుత్వాన్ని రెచ్చగొట్టి చివరకు అతన్ని పశుతుల్యునిగా చేసివేస్తుంది.

నేనీ విషయాలన్నీ చెప్పడానికి కొంచెం వెనకాడుతున్నాను. చెప్పేవిషయం మంచిదికాదని కాదు. కానీ ఆ చెప్పేటప్పుడు నాలోని అపవిత్రత బయటపడకుండా ఉండదుకదా అని. నేనే అంటే నేనే కాదు - మనలో చాలామంది ఇలా బాధపడతారు. నేడు మనం ఒకరూపంలో కన్పించిన విషయాసక్తినిగూర్చి సిగ్గూ ఎగ్గూ లేకుండా స్వేచ్ఛగా మాట్లాడేస్తుంటాము- అది సర్వత్రా అందరిలో బహిరంగంగా కన్పిస్తున్నది కదా అని. మళ్ళీ కొన్ని విషయాలను గురించి - దానియొక్క మరొక భిన్నరూపాన్ని గురించి మాట్లాడక గుట్టుచప్పుడుగా ఊరుకొంటాము. అంతేకాదు, మనమీనాడు ఎంత హీనస్థితికి దిగజారిపోయ్యామంటే; మానవుడు అవసరంగా చేయవలసిన పనులను, విధులను గురించి మనం కనీసం మాట్లాడనైనా మాట్లాడలేక పోతున్నాం. పూర్వకాలంలో కొన్ని దేశాలలో ప్రతి విధినిగురించీ కర్మనుగురించీ సగౌరవంగా చెప్పుకునేవారు. ప్రతికర్మ, శాసనంద్వారా క్రమబద్ధమై వుండేది. హైందవ ధర్మశాస్త్రజ్ఞులకు ధర్మశాసనం చేసే పండితులకు, అవి ఆధుని కాభిరుచులకు ఎంత గిట్టనివైనా ఎంత భిన్నమైనవైనా వారు ఏవిషయాన్నీ స్వల్పంగా పరిగణించలేదు. వారు ఆహార పానీయ నిద్రా రత్యాదుల విషయాలన్నీ సవిస్తరంగా బోధించారు. శాసించారు. కొన్ని సత్సంప్రదాయాలను స్థాపించారు.

ఏవిషయాన్నీ వాళ్లు నీచమైనదిగా మాట్లాడరాని విషయంగా విడచిపెట్టలేదు. సామాన్యుని దృష్టిలో నీచంగా కన్పించే విష యాలకు ఎంతో ఔన్నత్యాన్ని, ఔత్కృష్ట్యాన్ని చేకూ ర్చారు. అంతేకానీ ఏదో స్వల్పవిషయాల్లే అని తప్పించుకొని పోవాలని చూడలేదు; అన్ని విషయాలను గురించి గౌరవంగా మాట్లాడారు.

## 6 ఏకాంతము

సంధ్యావేళ.

ఎంత ప్రశాంతమైన వాతావరణమో ! ఆహా! ఏమి ఆ సాయంసమయ సౌందర్యం ! మనోజ్ఞమైన సమయం !

నాలో సర్వత్రా ఒకే ఒక అనుభూతి కలిగినది. అంతు లేని ఆనందాన్ని ప్రకృతినుంచి అందుకొని లోనికి చేదుకొన్నది. నా శరీరమూ నా మనస్సూ. ప్రకృతితో నా కేర్పడిన విచిత్ర మైన చనువుతో అక్కడికీ ఇక్కడికీ వెళ్లివస్తున్నాను. నేను పొడుగుచేతుల చొక్కా తొడుక్కొని ఆ చెరువు ఒడ్డునే ఒంటరిగా నడిచి వెళుతూ ఉన్నప్పుడు ఆ వాతావరణం చల్లగా ఉన్నా, ఆకాశం అంతా మబ్బులు కమ్ముకొని ఉన్నా, గాలులు నెమ్మదిగా విజృంభిస్తున్నా, నన్నంతగా ఆకర్షించే వస్తువేదీ అక్కడ నాకు ప్రత్యేకంగా కన్పించకపోయినా, మొత్తంమీద అవన్నీ కలిసి నా విషయంలో అధికమూ, అసామాన్యమూ అయిన అనుకూల్యాన్నే ప్రకటిస్తున్నాయి. ఆనందాన్ని చేకూర్చుతున్నాయి. కప్పల బెకబెకలూ, రకరకాల పిట్టల

కలకలములూ నీటిమీాదుగా వీస్తున్న గాలులతోపాటు శ్రవ ణేంద్రియాలకు సోకుతూనే ఉన్నాయి. చెట్లఆకులు రెపరెప లాడుతూ వణకిపోవడం గమనించినప్పుడు ఊపిరి బిగపట్టు కొంటూనే ఉన్నాను. అయినప్పటికీ ఆ సరస్సులాగానే నా ప్రశాంతత ఏ కొంచెమో చలించినప్పటికీ భంగపడలేదు. కలతపడిపోలేదు.

ఇప్పుడు చీకటిపడినప్పటికీ, గాలి ఇంకావీస్తూ అడవుల్లో గర్జిస్తూనే ఉన్నా, కొలనులో అలలు ఎత్తుగాలేచి ఒకదా న్నొకటి ఢీకొంటున్నా...... కొన్ని ప్రాణులు మరికొన్ని ప్రాణుల్ని వాటి సహజస్వరాల్లో జోలపాడి నిద్రపుచ్చుతు న్నాయి. విశ్రాంతి అన్నది ఎప్పటికీ అసంపూర్ణమైనదే. చాలా భయంకరమైన వన్యమృగాలు విశ్రాంతి తీసుకోవు. అసలు నిద్రంటూ పోవు. ఆహారాన్వేషణ చేస్తూ అవి యిప్పుడే వేటకు బయలుదేరుతాయి. నక్క, కుందేలూ ఇవి ఇప్పుడే నిర్భయంగా పొలాల్లో అడవుల్లో స్వేచ్ఛగా విహరిస్తాయి. అవన్నీ ప్రకృతికి కావలివాళ్ళ వంటివి.

నేను ఇంటికి తిరిగివచ్చినప్పుడు నన్ను చూడడానికని ఎవరో అక్కడకు వచ్చివెళ్ళారని—అక్కడ వాళ్ళ చిరునామా గల కార్డుముక్కలనో, ఓ పువ్వులగుత్తినో, ఓమాలనో, విడచి వెళ్ళడంచేత, కాక వాళ్ళు ఆక్రోటుమొక్కయొక్క ఆకు పైననో, బెరడుపైననో పెన్సిలుతో తమతమ పేర్లు వ్రాసి వెళ్ళడంచేత, తెలియవస్తుండేది. చాలా అరుదుగా అడవుల్లోకి వచ్చేవాళ్లు సామాన్యంగా ఏదో ఒక ఆటవికమైన వస్తువును

అప్రయత్నంగా, అంటే ఏమాత్రమూ దాన్ని గురించి అనుకో కుండానే తమచేతుల్లోకి తీసుకొంటారు. దాంతో వాళ్ళకు కొంతసేపు కాలక్షేపం అవుతుంది. పొరపాటునో కాక కావా లనో అక్కడే దాన్ని వదిలేసి వెళతారు. ఒకమాటు ఒకరు దారిలో దొరికిన ఒక తీగను తెచ్చుకొని గుండ్రంగా చిన్న చక్రంలా చుట్టచుట్టి దాన్ని నా బల్లమీద వదలివెళ్లారు. నేను లేని సమయంలో అలాగా నాకోసమని ఎవరైనా వచ్చి వెళ్లారో లేదో నేను ఇట్టే చెప్పేయగలను. నా యింటిదగ్గర పెరిగే గడ్డి లేక మొక్కలో ప్రక్కకు వంగి ఉండడంమూలానో కాక వాళ్ళ అడుగుల జాడలనో ఆధారంగా చేసుకొని అలా చెప్ప గలిగేవాణ్ని. అంతేకాదు, కొందరు పూలూ అవీ కోసి నా యింటిదగ్గరో దూరంగా రైలురోడ్డు దగ్గరనో వదలిపెట్టేసే వాళ్లు. మరికొందరు చుట్టవెలిగించి కాలుస్తూ వెళ్లేవాళ్ళు. ఆ వాసన ఆ వాతావరణాన్ని చాలాసేపటి వరకూ అంటిపెట్టు కొని ఉండేది. వీటినిబట్టి ఆ వచ్చివెళ్లినవాళ్ళు ఆడవాళ్లో మగ వాళ్లోకూడా విమర్శగా చెప్పగలిగేవాణ్ని. వాళ్ళ వయస్సునూ వాళ్ళ స్వభావాలనూ తేలికగా పోల్చుకొనేవాణ్ని. కొన్ని సమయాల్లో నేను ఇంట్లో ఉండే నాయింటికి దాదాపు అరవై డెభ్భై గజాలదూరంలో అటు వేరొకవైపుకు వెళ్లే బాటసారిని కూడా అతను కాలుస్తున్న పొగాకుయొక్క వాసనబట్టే ఇట్టే అతన్ని పోల్చేసుకొనేవాణ్ని.

మన చుట్టూ కావలసినంత స్థలమున్నది. మన సరి హద్దులు మనమోచేతులను తాకుతూ అంత దగ్గరగా లేవు. అవి అంతగా మనలను పరిమితం చెయ్యడంలేదు. దట్టమైన ఆ అడవి

కానీ, విశాలమైన ఆ చెరువుకానీ మన గుమ్మంముందే లేవు. అవన్నీ కలిసి ఒకప్పుడు సన్నిహిత పరిచయ మున్నట్లుగా, స్వచ్ఛంగా, నివాసానికి సరియైనదిగా, చుట్టూ ఏదో ఒకరక మైన కంచె కాపుఉన్న ప్రదేశంలా కన్పిస్తాయి. ఆ ప్రదేశం, ప్రకృతినుంచి మళ్లీ మన ఆక్రమణలోకి తీసుకొన్న ప్రదేశంలా ఉంటుంది. అయితే ఇంత విశాలంగా కొన్ని చదరపుమైళ్ళ విస్తీర్ణంగల ఈ అడవిలో, తరచుగా జనంరాని ఈ నిర్జనప్రదేశాన్ని నా నివాసస్థలంగా నే నెందుకు ఎంచుకున్నానూ? నా యింటిదగ్గరనుంచి ఎటుచూచినా అర్ధమైలుదూరంలో కూడా ఇళ్ళే కన్పించవు. కాకపోతే ఆ కొండఅంచులకు వెళ్ళితే ఇళ్లు కన్పిస్తాయి. నాకు మరీదగ్గర అని చెప్పకోతగ్గ పొరుగింటాయన నాకు మైలుదూరంలో ఉంటాడు. నా యింటిచుట్టూ కన్పించి నంతమేరా విశాలమైన అడవులు. బహుదూరంలో ఒకప్రక్క అడవిబాటనూ, మరొకప్రక్క సరస్సునూ తాకుతూ వెళ్ళే రైలురోడ్డు కన్పిస్తుంది. కనుక నే నున్నది నిర్జన – ఏకాంత ప్రదేశమనే చెప్పవచ్చును. దాన్ని ఆసియా, ఆఫ్రికా, కాదూ అంటే న్యూ ఇంగ్లాండు అని ఏమని అన్నా ఫరవాలేదు. మునిగిపోయింది ఏమీలేదు. నా కంటికి అలా అనిపించింది. సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ ఒక ఛేమిటి ఒక చిన్న ప్రపంచం నాకోసమే అన్నట్లు కన్పించాయి. నేను ఒక్కణ్ణే వాటి – తత్ప్రపంచ దర్శనానుభూతిని పొందాను. రాత్రిళ్ళు ఎన్నడూ బాటసారు లెవ్వరూ నా యింటిప్రక్కగా వెళ్ళేవారు కాదు. అయితే ఎప్పుడో, చాలా అరుదుగా, నన్ను చూచిపోదామని ఒకరో ఇద్దరో వచ్చేవారు. ఆ సమయాల్లో

నే నింట్లో లేకపోతే కాసేపుకూర్చుని వెళ్లేవారు. అల్లాగా నా యింటికితలుపు తట్టినవారే ఉండేవారుకాదు. ఎప్పుడో నెలకు ఒకరో ఇద్దరో దాపుననున్న గ్రామంనుంచి చేపలుపట్టడానికని వచ్చినా ఆ వచ్చినవాళ్లు వచ్చిన కొద్దిసేపటికే దొరికిన కాసిని చేపలనూ చూచుకొని కొంత నిరుత్సాహపడి అక్కడి వాతావరణాన్ని, అంటే ఆ చిన్నిప్రపంచాన్ని - ఆ అంధకారాన్ని నాకు వదలిపెట్టి వెళ్ళిపోయేవారు. ఇక అక్కడ ఆ రాత్రిస్ఫైరసంచారమే ఉండేదికాదు. ఆ మనుష్యులకు ఎంతభయమో! మంత్రతంత్రాలనందర్నీ ఉపేక్షించినప్పటికీ ప్రపంచంలోని క్రైస్తవ మతాన్నీ పైపెచ్చు క్రొవ్వొత్తి దీపాలనూ ప్రవేశపెట్టిన తర్వాతకూడా సామాన్యంగా జనం చీకటిఅంటే ఇంకా భయపడుతున్నారనే నా నమ్మకం. ఏమిటో ఎందుకో ఈభయం? నా అనుభవాన్ని పురస్కరించుకొని చెప్పాలీ అంటే ప్రకృతిలోని ఏచిన్నవస్తువులోనైనా సరే మిక్కిలి నిష్కల్మషమైన ప్రోత్సాహకరమైన సహజీవనభావం-స్నేహస్వభావం కన్పిస్తుందని చెప్పాలి. మామూలువాళ్ళకేకాదు, ఎంతటి మానవద్వేషికైనా ఎంతటి విచారగ్రస్తుడికైనా మనస్సు కాస్త నిశ్చలంగా ఉంచుకొని ప్రకృతిమధ్యలో ఉంటే అతనికి ఏ విచారమూ ఉండదు. అతని మనస్సు ఆరోగ్యంగా నిష్కల్మషంగా ఉంటే తుఫానుగాలులు అతనికి చక్కని సంగీతంలా విన్పిస్తాయి. నిరాడంబరుడూ, ధైర్యవంతుడూ అయిన వ్యక్తికి అక్కడి ఏ విషయమూ కించిత్తు విచారాన్నికూడా కలిగించనేరదు. అన్నిఋతువుల స్నేహాన్నీ నేను అనుభవిస్తూ వాటివలన సంపూర్ణమైన ఆనందాన్ని పొందుతూ ఐహికమైన ఏ ఇతరవిషయమూ

కూడా నా జీవితాన్ని ఒక మోయలేని బరువుగా మార్చ లేదని గట్టివిశ్వాసాన్ని ఏర్పరచుకొన్నాను. అట్టి దృఢవిశ్వాసం కలిగింది నాకు. నా చిక్కుడుపాదుల్ని తడుపుతూ సన్నగా కురుస్తున్న ఆ వాన, నన్ను బయటకు పోనీయకుండా అరికట్టిన ఆ వాన, నా కేమాత్రమూ విసుగూ విచారమూ కలిగించ లేదు. అది పైపెచ్చు నాకూ మంచిదే అనిపించింది. ఆ వాన పొలంపనులు చేసుకోవడానికి నాకు అడ్డుతగులుతోన్నా-అది నాపనికంటే ఎక్కువ విలువకలిగినదే అవుతున్నది. అది మరీ పెద్దదై నా చిక్కుడుగింజలన్నీ నానిపోయి పాడైనా, పల్లపు నేలల్లో నేను పెంచుతున్న బంగాళాదుంపల మొక్కలన్నీ నాశనమైపోయినా ఎత్తుగాఉన్న భూములలో మొలిచే గడ్డికి ఆవాన ఏవిధమైన చెరుపూ చెయ్యదు. అది ఆ గడ్డికి మంచిదే.

భగవంతుడు అందరికంటే ఎక్కువగా నన్నే అనుగ్రహించాడని కొన్నిసార్లు అనిపిస్తుంది-వాళ్ళతో నన్ను పోల్చి చూచుకొన్నప్పుడు అలా అనిపిస్తుంది. అందుకు నన్ను నేను అభినందించుకోను. వీలైతే ఇష్టమైతే ఇతరులు నన్ను అభినందించవచ్చును.

నేను ఒంటరిగా ఉన్నానే అని ఎప్పుడూ నాకు అనిపించ లేదు. ఒంటరితనాన్ని గురించి కనీసం ఏ ఒక్క ఆలోచన, అనుభూతీ నన్ను కించిత్తుకూడా కదలించలేదు. ఎంతమాత్రమూ కృంగతీయలేదు.

కాని ఒక్కసారిమాత్రం, అదే నేనా అడవులకు వచ్చిన కొన్ని వారాల తర్వాత కాసేపు ఒక్క గంటసేపు పొరుగు వాని సహవాసం శాంతియుతమైన ఆరోగ్యవంతమైన జీవనానికి

అవసరమా కాదా అన్న అనుమానం కలిగినప్పుడు కొంచెం బాధపడ్డాను. ఒంటరిగా ఉండడం ఏదో విచారకరం అనిపించింది ఆ కాస్సేపు. కానీ ఆసమయంలోనే నా ఆలోచనలో ఏదో పిచ్చిదనం ఉన్నదనే స్ఫురణ ఉంటూనే వచ్చింది. అయితే ఆ బాధనుంచి త్వరలోనే కోలుకొంటానని సరిగ్గానే ఊహించాను. ఈ ఆలోచనలన్నీ నా మనస్సులో ఇంకా తిరుగుతూ ఉన్న సమయంలోనే నే నొక్కసారిగా మధురమైన, మిక్కిలి ప్రయోజనకారియైన ప్రకృతి సౌహార్ద్రాన్ని గుర్తించాను. దాని సాహచర్యాన్ని గమనించాను. ఎక్కడికో పోనక్కర్లేదు. ఆ వానజల్లులో నాకు అదే కన్పించింది. ఆ జల్లులోనే కాదు నా ఇంటిచుట్టూ కన్పించే ప్రతి వస్తువులోనూ, వినిపించే ప్రతి శబ్దంలోనూ అంతులేని- ఇంత అంత అని లెక్కగట్టలేని- స్నేహార్ద్రితే-మైత్రీభావమే కన్పించింది. అప్పుడు మనం పిచ్చిగా మానవ సాహచర్యంవలన ఒరగగల వనుకొంటూ ఉండే ఉపయోగాలన్నీ కించిన్మాత్రములుగా - అతి స్వల్పమైనవిగా కన్పించాయి. ఇక అప్పటినుంచీ నేనా విషయాలనుగురించి ఆలోచనే చెయ్యలేదు. ప్రతి చిన్న ముల్లుకూడా నాయందు కలిగిన అనుకంపతో జాలితో పొంగిపోయి విశాలమై నాతో స్నేహం చేసింది. సాధారణంగా మనమంతా ఆటవికమూ, వినుగుపుట్టించేదీ అనుకొనే దృశ్యాలుకూడా నాకెంతో సన్నిహితము లైనాయి. అక్కడ నాకు సజాతీయమైన, నాతో అత్యంత సన్నిహిత సంబంధంకల వస్తువు ఏదో నాముందు ఉన్నదన్న విషయం స్పష్టంగా తెలుసుకొన్నాను. నన్ను

మధ్యాహ్నమూ సాయంకాలమూ కూడా ఇంట్లో కట్టి పడేసినట్లుంచిన, వర్షంతో తుపానుగాలులు వీస్తున్న, సమయా ల్లోనే, ఎక్కువగా సౌఖ్యాన్నీ, ఆనందాన్నీ అనుభవించాను. వాటి గర్జనలూ పెద్దపెద్ద చినుకులుపడుతూ చేసే శబ్దమూ నన్ను అనునయించాయి. చాలా ఆలోచనలు అభిప్రాయాలు తాపీగా వేళ్ళుపాతుకొని, వాటి అంతర్యాన్ని బయట పెట్ట డానికికూడా చాలినంత వ్యవధి ఉన్న, సుదీర్ఘమైన సాయం సమయాల్లో ఆకాశావరణంలోనికి ప్రవేశిస్తూ ఉన్న, వెన్నెల కాంతులు కన్పించినప్పుడుకూడా నేను అలాటి ఆనందాన్నే పొందాను. ఆగ్నేయ ఋతుపవనాలు విజృంభించినప్పుడు, పల్లెలను ఒకసారి ఊపివేసి, పల్లీయులను ఆడపిల్లలతో సహా పెద్దపెద్ద బకెట్లు పుచ్చుకొని ఇళ్ళల్లోచేరిన వాననీరు ఎత్తి పోయడానికి సిద్ధపరుస్తూ, ప్రళయంగా వర్షం కురుస్తూ ఉన్న ప్పుడు, సరిగ్గా ఆసమయంలో నేను నా చిన్న ఇంట్లో తలుపు వేసుకొని హాయిగా కూర్చుని ఆయిల్లు నాకు అంతచక్కగా రక్షణ నిచ్చినందుకు సంతోషించాను. ఒకసారి ఉరుముతూ మెరుస్తూ ఉన్న సమయంలో ఒక పెద్ద దేవదారువృక్షంపై ఒక పిడుగుపడి నాలుగయిదు అంగుళాల వెడల్పుగా పైనుంచి క్రిందదాకా తొల్చుకొనిపోయింది. ఆగుర్తు స్పష్టంగా పైకి కన్పించేలాగున ఏర్పడింది. మనుష్యులెవరో కావాలని తొల్చి నట్లుగా ఏర్పడిందా గుర్తు. మొన్ననోసారి అటు వెళుతూ, ఎప్పుడో ఎనిమిదేళ్ళక్రిందట, నిరపాయకరంగా కన్పించే ఆకాశం నుండి జారిపడిన, భయంకరమైన, ఎవరూ ఆటంకపరచలేని ఆ పిడుగుచేసిన రంధ్రాన్ని చూచినప్పుడు మొట్టమొదట ఎంత

ఆశ్చర్యం కలిగిందో, మొన్నకూడా అంత ఆశ్చర్యమూ కలిగింది.

కొందరు తరచు నాతో 'అక్కడ నీవు ఒంటరితనం సహించలేకపోయి ఉంటావు-అందులోనూ ముఖ్యంగా వర్షా కాలంలోనూ విపరీతంగా మంచుపడుతున్నప్పుడూ-కటిక చీకటి లోకమంతా ఆవరించిన రాత్రివేళల్లోనూ నీవు మానవ సాహ చర్యాన్ని అపేక్షించే ఉంటావు. అవును కదూ?' అని అంటూ ఉంటారు. అటువంటివాళ్ళకు ఇలా సమాధానం చెప్పాలని మనసుపడుతున్నాను.

ఒంటరిగా ఉన్నానని నే నెందుకు అనుకోంటూనూ! అలా నే నెందుకు బాధపడాలి? అసలు మీరు వేసే ప్రశ్న అంత ముఖ్యమైన ప్రశ్నగా నాకు కన్పించడంలేదు. ఒకవ్యక్తిని అతని సహచరులనుండి వేరుపరచి అతణ్ని ఒంటరిగాణ్ని చేసే ఆ 'దూరం' ఎటువంటిది? వ్యక్తికీ వ్యక్తికీ మధ్యదూరం ఎక్కు వయినప్పుడు వాళ్ళ కాళ్లు నొప్పులుపుట్టేలాగున అంతదూరం మైళ్ళకొద్దీదూరం నడిచివెళ్ళినంతమాత్రాన వాళ్ళ మనస్సులు కలుస్తాయా, ఊరికే శ్రమగానీ? మనం ఎక్కువగా వేటికి దగ్గ రగా నివసించాలని కోరుకొంటూ ఉంటాం? నిశ్చయంగా ఎక్కువమంది మనుష్యులకు దగ్గరగా కాదు-మనుష్యులు ఎక్కు వగా గుమిగూడుతుండే పోస్టు తపాలా కచేరీలూ, మద్యపానీ యాలు అమ్మే దుకాణాలూ, కిరాణాకొట్లూ, క్లబ్బులూ, పాఠశాలలూ మొదలైనవాటి దగ్గరగానూ కాదు. మన జీవి తాల ముఖ్యాధారానికి దగ్గరగా ఉండాలని కోరుకొంటాం. అలా ఉంటూ-చెట్టు చెరువుకు దగ్గరగా ఉంటూ వేళ్ళను

అక్కడిదాకా ఎలా ప్రసరింపచేస్తుందో అలాగా మన అనుభవా లను ప్రసరింపచేస్తూ ఉంటాము. ఇది మనుష్యుల వివిధప్రవృత్తు లను బట్టి మారుతూ ఉంటుంది. కాని తెలివిగలవాడు అంటే విజ్ఞుడు ఇలాంటిచోటనే తన నివాస మేర్పరచుకొంటాడు...
ఒకరోజు సాయంకాలం వాల్డన్‌రోడ్డుమీద సంతకు గొడ్లను తోలుకొనిపోతున్న ఒకవ్యక్తిని కలుసుకోవడం తటస్థించింది. అతడు నన్ను "అన్ని జీవిత సౌఖ్యాలను త్యజించడానికి మీరు ఎలా మనస్సు దృఢపరచుకోగలిగారండీ?" అని ప్రశ్నించాడు. నేను నా స్థితికి నిశ్చయంగా సంతోషిస్తున్నాననీ-ఆ స్థితి నాకు అత్యంత ప్రీతిపాత్రమైనదనీ సమాధానం చెప్పాను. ఆ మాటలు నేను పరిహాసానికని అనలేదు. అలాగా అతనికి సమాధానం చెప్పి నేను సరాసరి ఇంటికి తిరిగివెళ్ళి హాయిగా పడు కొన్నాను. అతను చీకట్లో-ఆ బురదలో నడుస్తూ తనదారి తానే వెతుక్కోవలసివచ్చింది. అతను తన గమ్యస్థానమైన 'బ్రిటను' కు ఆ మరునాటి ఉదయం ఏ ఏడింటికో ఎనిమిదిం టికో చేరుకొని ఉంటాడు.

*    *    *

చనిపోయిన మనిషికి-మళ్ళీ మేల్కొనడం అనే ఏ విధ మైన ఆశగానీ, లేక మళ్ళీ తాను సజీవుణ్నవుదామన్న భావం గానీ కలిగితే అప్పుడిక ఎక్కడ? ఎప్పుడు? అన్న విచక్షణే కలుగదు. అది జరగవచ్చు ననుకొనేప్రదేశం సామాన్యంగా ఒక్కటే అవుతుంది. అటువంటిది మానవానుభూతికి చెప్పరా నంత సంతోషాన్ని కలిగించి తీరుతుంది.

స్వర్గ మర్త్యలోకాల శక్తుల ప్రభావము ఎంతగొప్పదీ? ఎంత వ్యాప్తిగలదీ? !

"దాన్ని మనం చూడడానికని అన్వేషణ సాగిస్తాం కాని దాన్ని చూడము. దాన్ని వినాలని కోరుకొంటాం కాని వినం. దాన్ని చూడలేము, వినలేము. జగత్తులోని సర్వవస్తు సముదాయంలో ఉన్నపదార్థంతో దాన్ని గుర్తించాలనికదా. వాటినుండి దాన్ని మనం వేరు చెయ్యలేము" ఆ శక్తులు అఖిల జగత్తులోని మానవులు తమతమ హృదయాలను క్షాళనం చేసుకొని పవిత్రం చేసుకోడానికి కారణభూతము లవుతున్నాయి. అవి మన ముందూ వెనుకా, కుడివైపునా ఎడమ వైపునా–ఒకచోట అని ఏమిటి–అన్ని దిక్కులనుంచీ కమ్ముకొని మనచుట్టూ ఆవరించి ఉన్నాయి. ఆ శక్తులు సర్వేసర్వత్రా వ్యాప్తములై ఉన్నాయి.

ఒకానొక ప్రయోగానికి మనమంతా వశీకృతులమై–అధీనులమై ఉన్నాం. ఈ పరిస్థితులలో మనం మన కబుర్లు మానేసి కొంచెంసేపు విడిగా ఉండలేమా? కేవలం మన సొంత ఆలోచనలతో కాసేపు మనం సంతోషింపలేమా? సంతృప్తి చెంది ఉండలేమా? కన్ఫ్యూషియస్ చెప్పింది నిజమే–"సుగుణమూ అన్నది దిక్కూదివాణం లేనిది. తల్లిదండ్రులు లేనిదికాదు. ఊరికే ఉండిపోదు. అవసరంకొద్దీ దానికితోడు–ఇరుగుపొరుగూ అన్నది ఉండవలసినదే" అని అన్నాడాయన. ఆలోచన చేస్తూనే–మన ఆలోచనలతో మనంతటమనం చక్కని జాగ్రదవస్థలోనే ఉండవచ్చును. ప్రకృతిలో మనం కేవలం లీనమైపోయి ఉండము. తెలిసి మనస్సును లొంగదీసుకోవా

లనే ఒకానొక సాధనను ఆధారంగా చేసుకొని లోకంలో జరిగే వివిధ కార్యాలకూ_సుఖదుఃఖ హేతువులైన లౌకిక సంఘటన లన్నింటికీ, వాటివాటి పరిణామాలకూ మనం దూరంగా ఉండగలము. అంటనట్లు ఉండగలము. అవన్నీ–మంచీ చెడూ. అన్నీ–మనప్రక్కగా ఓ ప్రవాహంలాగా సాగిపో తుంటాయి. అప్పుడు నేను ఆ ప్రవాహంలో తేలుతూ, కొట్టు కొని పోయే దుంగనూ కావచ్చును, కాక ఆకాశంలో దర్జాగా నిలబడి దానినంకచూస్తుండే 'ఇంద్రుణ్ని' కావచ్చును. ఊహా! ప్రదర్శనచేత–అంటే ఈ ప్రపంచ రంగస్థలంలో సాగగల ప్రద ర్శనది మూలంగా నా కొకవేళ స్పందనలు కలగవచ్చును. కల గక పోవచ్చునుకూడా. కేవలం నాకే ఎక్కువగా మరింత ఎక్కు వగా–సంబంధించినది అని చెప్పుకోదగ్గ సంఘటన చేతకూడా నాకా స్పందన కలుగకపోవచ్చును. మార్పు రాకపోవచ్చును. ఒకానొకమానవుణ్నిగా, చైతన్యమూ ఆలోచనా కలిగిన, స్పష్ట మైనవ్యక్తిత్వం కలిగిన మానవుణ్నిగా నన్ను నే నెరుగుదును. నామనస్సు ద్విగుణాత్మకమైనదని, అనగా నాలో ద్వంద్వగుణ మేదో ఉన్నదని నేను స్పష్టంగా గుర్తించాను. దానిమూలంగా నేను పరాయివ్యక్తినుండి ఎలా దూరంగా ఉండగలనో సరిగ్గా అలాగే నానుండికూడా నేను దూరంగా, సంబంధంలేకుండా అంటకుండా ఉండగలను. నాతో తనకేమీ సంబంధం లేనట్లుగా నాలో తానొకభాగం కానట్లుగా, కేవలం ఒక ప్రేక్షకుడిలా నా అనుభూతిలో పాలుపంచుకోకుండా ఉన్నట్లు కన్పిస్తూనే (కానీ) నా అనుభూతిని బహు జాగ్రత్తగా గమనిస్తూ ఉండే నాలోని ఒకభాగాన్ని నేను గుర్తించాను. ఆ భాగంయొక్క

ఉనికినీ అది చేస్తుండే ప్రతిక్షణమూ జాగ్రత్తగానే గమనించాను. రంగస్థలంపైన నాటక ప్రదర్శనము - అది ఒక్కొప్పుడు వాస్తవిక జీవిత విషాదాంత నాటకమే కావచ్చును - అది పూర్తి కాగానే అప్పటిదాకా తన్మయత్వం చెందుతూ చూస్తున్న ప్రేక్షకుడు తనదారిన తను పోతాడు - అలాగా ఆ భాగమూనూ. అలా అదృశ్యమయ్యే ఆ భాగానికి - ప్రేక్షకునివంటి (నాలో) భాగానికి, దానికి సంబంధించినంతవరకూ ఆ ప్రదర్శనం - ఆ సంఘటన- ఒక కాల్పనికమైన విషయం; ఒక మిథ్యావిషయం; అది ఒక కథవంటిది; ఊహాకల్పితమైన ఒక కళాఖండం; అది అంతమాత్రమే అవుతుంది.

అదిగో అలాటి ద్విగుణాత్మకమైన స్వభావం మనలను లౌకిక జగత్తులో పొరుగువాళ్ళతో అతి సన్నిహితులుగానూ చెయ్యగలదు; ఒకప్పుడు వాళ్ళతో స్నేహానికి అవకాశమూ ఇవ్వదు.

నాకు ఉన్న వ్యవధిలో ఎక్కువభాగం ఒంటరిగానే గడిపేవాణ్ని. అలా ఉన్నప్పుడే నాలో సంపూర్ణత్వం గోచరిస్తుండేది. ఎంత ఉత్తములైనాసరే కొద్దికాలం కలిసి ఉండేసరికే విసుగు చిరాకు పుడుతుంది. ఆ సహవాసం వ్యర్థమనిపిస్తుంది. నాకు ఒంటరిగా ఉండడమే ఇష్టము. 'ఒంటరితనము - ఏకాంతము' అంతటి మంచి స్నేహితుడు మరొకరు కన్పించలేదు. అంతబాగా చెలిమి కలిసే స్నేహితుడు మరొకరు లేరు. మనం మన ఇళ్ళల్లో ఉన్నప్పటికంటే పరదేశాలకు పోయినప్పుడే చుట్టూ ఎవరో మనుష్యులు ఉంటూనే ఉన్నా ఒంటరిగా ఉన్నట్లు భావిస్తుంటాం. ఒక వ్యక్తి అతనికి ఇష్టంవచ్చినచోట

ఎక్కడ ఉన్నా సరే పనిచేస్తున్నప్పుడూ ఆలోచిస్తున్నప్పుడూ - ఎప్పుడూ అతను ఒంటరిగాడే. ఒక వ్యక్తికీ అతని సహచరులకూ మధ్యఉన్న దూరాన్ని బట్టి కాదు ఒంటరితనాన్ని లెక్క గట్టడం. ఎడారిలో ఉండే ఒక సన్యాసి ఎంత ఒంటరిగాడో చాలమంది మనుష్యులు నివసిస్తుండే కేం బ్రిడ్జి కళాశాలయందు ఉండే చదువు అంటే మంచి భక్తి శ్రద్ధ గల విద్యార్థికూడా సరిగా అంత ఒంటరిగాడే. పొలంపనులు చేస్తూ దున్నుతూ కలుపుమొక్కలు పీకివేస్తూ కార్మికుడు తన పొలంలోనో అడవుల్లోనో రోజల్లా పనిపాటలుచేస్తూ గడపగలడు. అప్పుడతను ఒంటరిగా ఉన్నట్లు భావించుకోడు. ఎందుకంటే అతను పనిలో ఉన్నాడు కనుక - పనియందు నిమగ్నుడై ఉన్నాడు కనుక - పనియందు నియమితుడై ఉన్నాడు కనుక అతను అలా అనుకోడు. కానీ అతను ఆరాత్రికి ఇంటికి తిరిగివచ్చి తన గదిలో తన ఆలోచనలను మాత్రమే నమ్ముకొని ఒంటరిగా కూర్చొనలేడు. ఎక్కడికో ఒకచోటికి తన సహచరులు పొరుగువాళ్ళు ఉన్నచోటుకి వెళ్ళవలసిందే. వెళ్లి పగలంతా ఒంటరిగా పనిచేసినదానికి ఫలితంగా- అతనిదృష్టిలో ఏది వినోదాన్ని కలిగిస్తుందో దాన్ని అనుభవించి తీరవలసినదే. కనుకనే అతడు విద్యార్థి రాత్రంతా పగటిపూటలో చాలభాగం ఏ వినోదాలూ అవీ లేకుండా ఎలా ఒంటరిగా ఇంట్లో కూర్చోగల్గుతున్నాడా అని ఆశ్చర్యపడతాడు. కానీ ఆ కార్మికుడొక విషయాన్ని గుర్తుంచుకోవడంలేదు. ఆ విద్యార్థి అంతసేపూ ఇంట్లో ఉన్నా అతడు తనరంగంలో పనియందే నిమగ్నుడై ఉన్నాడనీ - ఏ యితర కార్మికునివలెనే అతడుకూడా కష్టపడుతున్నాడనీ -

అంతేకాక పని అయినతరువాత అతడూ తనవలెనే విశ్రాంతి-వినోదం కోరుకొంటాడనీ అతను గమనించాలి. అయితే విద్యార్థికోరే విశ్రాంతి- వినోదాల స్వభావం వేరు కావచ్చును. మొత్తంమీద అతనికీ ఇవి కావలసే ఉన్నది.

సంఘం విలువలేనిదై కాదు- నిజానికి చవకబారుగా ఉంటోంది. మనం ఒకర్నొకరు మరీ తరచుగా కలుసుకొంటూ ఉంటాము. ఒక కలయికకూ, మరొక కలయికకూ మధ్య వ్యవధి చాల తక్కువగా ఉంటుంది. వ్యక్తిగతమైన భావనలు మొలకెత్తి వికసించడానికి ఆ వ్యవధిచాలదు. అలాగా మనుష్యులలో పెద్దమార్పు లేకపోయినా-భావనలు ఉన్నతం కాకపోయినా రోజుకు మూడుసార్లు భోజనాలకని కలుసుకొంటాం. ఇలా ఇంత తరచుగా సంభవిస్తుండే కలయికలు సహించడానికి వీలుగా అకారణపు వాగ్యుద్ధాలు రాకుండా అపుకోవడానికి వీలుగా మనం ఆచారంపేరునా సభ్యతపేరునా కొన్నికొన్ని నియమాలకు కట్టుబడి ఉంటాము. మనం పోస్టాఫీసుల్లో, స్టేషన్లలో, క్లబ్బుల్లో చలికాచుకొనే నెగళ్ళదగ్గరా దాదాపు ప్రతిరాత్రీ కలుసుకొంటూ ఒకళ్ళమార్గానికి మరొకళ్ళం అడ్డుతగులుతూ ఉంటాం. ఒకళ్ళమీద మరొకళ్ళం తూలిపడుతుంటాం. ఆ విధంగా జరుగుతూ ఉండడంచేత-నాదృష్టిలో-మనం కొంత గౌరవాన్ని కోల్పోతుంటాము. నామట్టుకు నేను ముఖ్యమైన, సహృదయంతో కూడిన లావాదేవీ లన్నింటికీ సాధ్యమైనంత అరుదుగా కలుసుకోవడం చాలును అని అనుకొంటాను.

కర్మాగారాల్లో పనిచేసే ఆడపిల్లలను చూడండి!

ఎన్నడూ ఒక్క క్షణం ఆఖరికి కలలోకూడా ఒక్క గడియ ఒంట రిగా ఉండను. అది బాధగానే ఉంటుంది. వాళ్ళు నేనిప్పుడు ఉంటున్నట్లుగా, ఇలాంటి ప్రదేశంలో ఏకాంతంగా మైలు కొకరుచొప్పున నివాస మేర్పరచుకొని ఉంటే ఎంతో ఉత్త మంగా ఉంటుంది. మనిషిలో 'విలువ' అన్నది స్పృశిస్తే నేగాని తెలియనిది కాదు. దానికి చర్మం కప్పిఉంటుందా! ఆ విలువ అన్నది హృదయగతమైనది.

సంపూర్ణమైన ఆరోగ్యమూ మానసిక దార్ఢ్యమూ కనుక ఉంటే మన ఊహాశక్తి మన ఆలోచనలే మనకు మంచి తోడూ నీడా అవుతాయి. అది మనలను ప్రోత్సాహపరుస్తుంది. మనం ఎప్పుడూ ఒంటరిగాళ్లము కాదుసుమా అని అప్పుడు మనకు బాగా తెలిసివస్తుంది. ముఖ్యంగా ప్రొద్దుటపూట అతి థులు ఎవ్వరూ వచ్చి నన్ను పిలవని సమయంలో నా యింట్లో నాకు మంచి సహవాసం - తోడు లభిస్తూ ఉంటుంది. ఉండేది. అప్పటి నాస్థితి మీకు తెలియచేసేందుకు - పోనీ నేను కాక పోయినా మరొకరైనా నా స్థితినిగురించి ఒక అభిప్రాయాన్ని మీకు అందచేసేందుకు కొన్ని ఉపమానాలు ఇస్తాను.

ఆ సరస్సు నీటిలో స్వేచ్ఛగా ఈదుతూ పెద్దగా నవ్వుతూ ఉండే నీటిపక్షికంటె నేనేమి ఎక్కువ ఒంటరిగాణ్ణి? అక్కడిదాకా ఎందుకూ - వాల్డన్ చెరువుకంటే నేనేం ఎక్కువ ఒంటరినా? పోనీ మీరు చెప్పండి! ఆ చెరువుకు ఎవరూస్నేహి తుడు - దానికి ఎవరితో సహవాసం! అయినా ఆ నీలవర్ణపు స్వచ్ఛమైన జలాలలో దేవతలముఖాలే ప్రతిఫలిస్తున్నాయి;

దెయ్యాలు కన్పించడంలేదే! సూర్యుడు ఒంటరిగా లేడూ? ఎప్పుడో గాలిలో సాంద్రత ఎక్కువయినప్పుడు ఎండమావుల్లో నీరులా ఆకాశంలో ఇద్దరు సూర్యులు కన్పించినప్పుడు తప్ప (ఆ రెండో సూర్యుడు మిథ్యేగా!) సూర్యుడు ఎప్పుడూ ఒంటరే కదా! కనుక ఎవరిమాటో ఎందుకూ? భగవంతుడో? భగవంతుడు ఒంటరిగానే ఉంటాడు. కానీ భూతం ఒంటరి కాదు. అది అలా ఉండలేదు. అది చాలామందితో చాలారకాలైన స్నేహాలు చేస్తుంది. అసలు భూతం అంటేనే కొన్ని దుష్ట గ్రహాల సముదాయం అనికదా అర్థం. పచ్చికబీడులలో ఎగురుతూ ఉండే మిడతకంటె, చిక్కుడుఆకుకంటె, ఈగకంటె వినయంగా ప్రవర్తిస్తూ ఉండే తేనెటీగకంటె ఏటిలో వేటికంటే కూడా ఏ ఒక్కదానికంటే కూడా నేనేం ఎక్కువ ఒంటరిగాణ్ణి కాదు. సెలఏటికంటే, గాలికోడికంటే, ధృవ నక్షత్రంకంటే, దక్షిణపు గాలికంటే, ఏప్రియల్ నెలలోపడే మంచుకంటే, జనవరిలో కరగిపోయే మంచుగడ్డలూ, క్రొత్తయింట్లో గూడు కట్టుకొనే సాలీడూ ఏటికంటే నేనేం ఎక్కువ ఒంటరిగాణ్ని కాను. కానేకాదు.

శీతకాలం సుదీర్ఘమైనట్లు కన్పించే సాయంవేళలలో, ఒకటు మంచుపడుతూ ఉన్నప్పుడు గాలులు హోరున అడవుల్లో గర్జిస్తున్నప్పుడు నా యింటికి అప్పుడప్పుడు ఒక అతిథి వస్తూ ఉండేవాడు. అతడు ఆ ప్రదేశంలో చాలకాలంనుంచీ కూడా ఉంటూవచ్చిన వాడనీ, మొట్టమొదటే వచ్చి అక్కడ ఉండిపోయినాడనీ, అతడే ఆ వాల్డన్ చెరువును త్రవ్వి చుట్టూ రాతిపనిచేసి గట్లచుట్టూ దేవదారు వృక్షాలు పెంచాడనీ

ప్రతీతి. అతడు చాల తెలివైనవాడు, మంచి హాస్యప్రియుడు. అతనంటే నాకు ఎంతో ప్రేమ - ఆపేక్ష ఉండేవి. గోర్కీ - వాలీ - కంటే కూడా ఎక్కువ ప్రచ్ఛన్నంగా నివసిస్తుండేవాడు. మరొకరి కంటపడేవాడే కాదు. అతడు నాకు గడిచిన యుగాలకు సంబంధించినవి - అన్ని అనంతకాలాలకు సంబంధించినవి అయిన కథలు చెబుతూ ఉండేవాడు. మే మిద్దరమూ వివిధ వస్తువుల విషయాలపైన మాకున్న అభిప్రాయాలను పరస్పరం వ్యక్తం చేసుకొంటూ ఆ సాయంసమయాలలో హాయిగా స్వేచ్ఛగా గడిపేవాళ్ళము. మధ్యమధ్య తాగేందుకు విస్కీలు మొదలైన పానీయాలు, తినేందుకు ఆపిల్ పండ్లూ ఉండేవికావు. అవేమీ లేకుండానే కబుర్లు చెప్పుకుంటూ కులాసాగా గడిపే వాళ్ళం. అత డిప్పుడు చనిపోయాడనుకొంటాను...కాని అతని సమాధినిమాత్రం ఎవరూ గుర్తుపట్టలేరు. ఆ సమాధి ఉన్న ప్రదేశం ఎవరికీ తెలియనే తెలియదు.

అక్కడ మరో ముసలమ్మకూడా నా పొరుగున ఎక్కువ మందికి కన్పించకుండానే ఉంటూ ఉండేది. ఆమె పెంచిన ఉద్యానవనంలో మృదులతాంతాల సువాసనలను అనుభవిస్తూ- ఆ తోటలో స్వేచ్ఛగా తిరుగాడుతూ ఉండేవాణ్ని. ఆవిడ చెప్పే కట్టుకథలు నేను మహా ఆసక్తితో వింటూ ఉండేవాణ్ణి. ఆవిషయంలో - ఆమె సాటిలేని అంతులేని ప్రతిభగల వ్యక్తి. ఆవిడ జ్ఞాపకశక్తి అంతా ఇంతా కాదు. పురాణాలకు ముందు జరిగిన విషయమైనా దాన్ని ఇట్టే అప్రయత్నంగా జ్ఞాపకం తెచ్చుకొనేది. ఆవిడ ధారణాప్రతిభ అటువంటిది. ప్రతికథకూ మూలాన్ని - ఏ సత్యాన్ని ఆధారంచేసుకొని ఆ కథాకల్పన

జరిగిందో- దాన్నికూడా బహు సులభంగా స్ఫురణకు తెచ్చు కుని చెప్పగలిగేది; ఆయా సంఘటనలు ఆవిడ వయసులో ఉండగా జరిగినవి కాబట్టి. మంచి రక్తపుష్టికలిగి ఎత్తుగా నిశ్చల మైన మనోదార్ఢ్యం కలిగి ఆరోగ్యంగా కన్పిస్తూ, వివిధ ఋతువులలో వీచే అన్నిరకాల గాలులంటేనూ సమానంగా ఇష్టపడుతూ వాటికి తట్టుకొంటూ, ఉంటూ ఉండే దావిడ. ఆమె బహుశా తన పిల్లలందరికంటే ఎక్కువకాలం జీవిస్తుందేమో!

సూర్యుడూ, చంద్రుడు, నక్షత్రాలు, గాలీ, వానా, వేసవికాలం, శీతకాలం... మొత్తం ప్రకృతియొక్క వర్ణనాతీత మైన నిష్కల్మషత్వం అమాయకత్వం - ప్రయోజనం - ఇవి కలిగించే ఆరోగ్యం, ఇచ్చే ప్రోత్సాహం ఎప్పుడూ త్రికాలా ల్లోనూ ఉంటూ ఉంటాయి. వీటికి మానవజాతిపట్ల ఉన్న సానుభూతి చెప్పడానికి వీలుకాదు. ఎవ్వరైనా సరే ఎప్పుడైనా సరే నిజంగా సరియైన కారణం ఉండి విచారపడుతున్నప్పుడు అదిచూచి మొత్తం ప్రకృతి అంతా కలతచెందుతుంది. తన ప్రకాశం తగ్గుముఖంపట్టగా సూర్యుడు వెలా తెలా పోతాడు. గాలి, మనుష్యుల్లాగానే పెద్దపెద్ద నిట్టూర్పులు విడుస్తుంది. జలధరాలు ధారలుగా కన్నీటిని వర్షించుతాయి. చెట్లన్నీ ఆకులు రాల్చుకొని, దిస్సపోయి, కుమిలికుమిలి ఏడుస్తూ, శోక మూర్తుల్లా అలా నిలబడిపోతాయి.

భూమాతతో వినయంగా సఖ్యంచేయాలనే జ్ఞానం నాకు లేకపోతే ఎలా! నేనుకూడా కొంతవరకు - ఆకులూ, గడ్డి, దుంపలూ, కాయకూరలూ - వాటిని పోలినవాణ్నేకదా!

వాటినల్ల నేకదా నేను రూపొందినది! ఆ జీవపదార్థమే కదా నాలోనూ ఉన్నది. ప్రకృతి మనకు తల్లి. ఆవిడే మన ముత్తవ తల్లి. బహూ దీర్ఘకాలాలనుంచీ, తనకాలంలో కలిగిన కష్టనష్టాలన్నింటినీ అనుభవించి, వాటికి తట్టుకొంటూ దీర్ఘాయుష్మంతురాలై, ఒక్కని యౌవనం నిలబెట్టుకొంటూ వచ్చిందామె. ప్రశాంతంగా తృప్తిగా ఉండడానికి ఏమందు వాడితే మంచిదనుకొంటున్నారూ? మీ అమ్మో, నాన్నో, నాయనమ్మో ఇచ్చే మాత్రలు కాదు. నిశ్చయ[illegible]ము. ఆ ప్రకృతిమాత అందించే విశ్వవ్యాప్తమైన, సార్వకాలీనమైన మొక్కలకూ, వృక్షాలకూ, మూలికలకూ సంబంధించిన మందులే కావాలి. "సర్వరోగ నివారణి" అనే ఒక మందు – ఎక్కడో ఎవరో నాటువైద్యులు తయారుచేసి పాడుసీసాల్లో దట్టించి వాటిని భయంకరంగా, అసహ్యంగా ఉండే ఓడల్లో పడేస్తారు. కాలం తరబడి ప్రయాణంచేస్తాయా ఓడలు. అన్నాళ్లకు ఆ మందు మనదగ్గరకు చేరుతుంది. వద్దుబాబూ ఆ పాడుమందు! దానికంటే – నేను ప్రభాతసమయంలో వీచే చక్కని మలయ మారుతాన్ని ఘనంగా ఎంచుకొంటాను. ఒక్కొక్కడు దాన్ని ఆనందంతో స్వీకరిస్తాను. ఆ గాలి ఒక్కసారి పీలిస్తేనే చాలును.

ఆహా! ఆ ప్రభాతపవనాలు ఎంత ప్రశస్తమైనవి! దినారంభంలో ప్రసరించే ఆ దివ్యవాయువులను కొంతైనా స్వీకరింపకపోతే ఎలా? ఈ ప్రపంచంలో–బద్ధకస్తులై ప్రొద్దుట పెందలకడ నిద్రలేవలేనివాళ్ళకు–లేచి గాలిలో తిరుగనివాళ్ళకు

వాళ్ళ ఉపయోగార్థమై ఆ గాలిని కాస్త సీసాలలోపట్టి, మూతలుబిగించి వాళ్ళ కందచెయ్యాలి. వాళ్ళకోసం అవి అన్ని దుకాణాలలో అమ్మిస్తే బాగుండును. కాని వచ్చిన చిక్కేమిటంటే—ఆగాలి అలా ఉండిపోదు. అంత ప్రొద్దెక్కే దాకా ఉండదది. అంతకు ముందే—చాలా ముందుగానే, మన కెవరికీ తెలియకుండా బిరడా మూతల్లోంచి—వాటన్నింటినీ బహుసులభంగా, తప్పించుకొని, అదృశ్యమైపోయి, బయట పడి పడమటిదిక్కుగా పడి పరుగులెత్తి...ప్రాతఃకాల దేవత యొక్క దివ్యభవనపు సోపానాలపై దాగుడుమూత లాడుతుంది. అంతలోనే గబగబా మెట్లన్నీ అధిరోహిస్తుందికూడా. మూలి కలతో వైద్యంచేసే వైద్యుని కుమార్తెయైన హీజెయా యొక్క శిలాప్రతిమలు ఒకచేతిలో పామునూ, మరొకచేతిలో ఒక చిన్నిపాత్రనూ పట్టుకొని నిలిచిన భంగిమలో చెక్కినవి— మీరు చూచేఉంటారు. ఆ పాము ఆ పాత్రనుండి అప్పుడప్పు డేమో తాగుతూ ఉంటుందటకూడా. మీరు రదంతా వినే ఉంటారు. చెప్పవచ్చిం దేమంటే—ఆమెకు నేనేమీ భక్తుణ్ని కాదు. శిష్యుణ్నీ కాదు. కానీ "జ్యూనో" కుమార్తెయైన "హీబీ" కు మాత్రం అలా భక్తుణ్నో, శిష్యుణ్నో చెప్ప కోవడమంటే నా కిష్టమే. ఆమెను నేను పూజిస్తాను. "జ్యూపి టరు"కు పానపాత్ర నందిస్తూఉన్న భంగిమలో ఆమెప్రతిమలు మీరు చూచే ఉండవచ్చు. ఆమెకు మనుష్యులకేకాదు దేవత లకుకూడా, యౌవన వయోదార్ఢ్యాన్ని పునః ప్రాప్తింపచేసే శక్తి ఉన్నది. ఆమె అంతటి శక్తిమంతురాలు. ఈ భూమిమీద

పుట్టిపెరిగిన వా ళ్ళందరిలోనూ బహుశా ఆమె ఒక్కత్తే సర్వసంపూర్ణమైన ఆరోగ్యంతో, సర్వాంగసౌందర్యంతో అనన్యసౌష్ఠవముతో అలరారిన ఉత్తమురాలని, మానవసీమంతురాలనీ చెప్పుకోవాలి. ఈ భూమిమీద అలా కన్పిస్తూతిరిగిన దామె ఒక్కతే అనాలి. నిజం—ఆమె ఎక్కడ అడుగుపెడితే అక్కడల్లా వసంతమే అవతరిస్తుంది. ఆమె మనోహరదృక్కులు ప్రసరించినంతమేరా నందనవనాలు ప్రత్యక్షమవుతాయి. వాసంతవేళావికసిత సర్వలతాంతవినిర్గతదివ్యసౌరభాల గుబాళింపులతో నడిచివస్తుం దామె.

*

## 7 సరోవరాలు

వాల్డన్ చెరువుకు దక్షిణంగా రెండుమైళ్ళదూరంలో ఆ చెరువుకు దారిచూపుతూ ఒక చిన్న సైనుబోర్డు కట్టబడి ఉన్నది. దానిపైన వాల్డన్ లేక (వాల్డన్ సరస్సు) అని వ్రాయ బడి ఉన్నది. అరమైలు వెడల్పు ఆరుఫర్లాంగులు పొడవు ఉన్న ఈ జలమయ ప్రదేశానికి ఈ చెరువుకు ఉత్తరాన మరో సైనుబోర్డు కూడా ఈ చెరువుకు దారిచూపుతూ ఉన్నది. దానిపై వాల్డన్‌పాండ్ (వాల్డన్ చెరువు)అని వ్రాయబడి ఉన్నది. థోరోమహాశయుడున్న కాలంలో – ఆ రోజుల్లో ఈ పేరు విషయంలో ఏవిధమైన చర్చాలేదు. అది వాల్డన్‌పాండుగనే వ్యవహారింప బడుతుండేది. కాని నేడు బోస్టను, కంకార్డు పత్రికలు "లేక్ వాల్డన్" అనే పేర్కొంటాయి.

న్యూ ఇంగ్లాండుకు చెందిన చాలా ప్రాంతాలలో ఇప్పుడు అన్నిచోట్లా ఇటువంటిమార్పే జరుగుతున్నది. పూర్వం పాండ్సు (చెరువులు) అన్నవాటినే ఇప్పుడు లేక్సు (సరస్సులు) అంటున్నారు. దీనికి సరియైన హేతువు – వాఖ్యా నిం ఇదై ఉంటుంది. ఏమంటే – రకరకాల మోటారుబండ్లు వాడుకలోనికి వచ్చినతర్వాత ప్రజానీకానికి ఇవన్నీ అందు బాటులోకి వచ్చాయి. ఇటువంటి చాలా ప్రదేశాలు స్నానాల రేవులుగా తయారయి పోతున్నాయి. లేక (సరస్సు లేక సరో

వరం) అన్నమాట కాస్త ఆకర్షణీయంగా: చెరువన్నమాటకంటే ఏదో గొప్పగా వినిపిస్తుంది. చెరువు అనగానే బురదా, నాచూ, ఒక్కసారి నీటిపైన తేలుతూ కన్పించి, చప్పున లోపలకు పోతుండే తాబేళ్ళూ ఇవన్నీ ఉన్న దృశ్యమేదో స్ఫురిస్తుంది. అలాగే సరస్సు - సరోవరం, అనేసరికి స్వచ్ఛంగా నిరాపాయకరంగా, విశాలంగా అందంగా కన్పించే దృశ్యం మనస్సులో మెదల్తుంది. కాని మొత్తంమీద ప్రభుత్వంమాత్రం దాన్ని వాల్డన్‌పాండు అనే పిలుస్తున్నది. అది అలాగా ముందుముందు కూడా, దాన్ని బాగా ఎరిగిఉండి, దాని పరిసరంలో నివాస మేర్పరచుకొనిన మహనీయుడువ్యవహరించిన పేరుతోనే వాల్డన్‌పాండు గానే ఉండిపోతుందనే చెప్పవచ్చును. వేసవి కాలం శనివారంపూట ఆప్రదేశమంతా ఎంతో కోలాహలంగా ఉంటూ ఉంటుంది. కొన్ని వేలమంది ఈతగాళ్ళు అక్కడ స్నానాలకని చేరి ఆ నీటిని చెదరగొడుతూ ఉంటారు. నానా అల్లరిచేస్తూ ఆనీళ్ళల్లో ఈదులాడుతూ ఉంటారు. చెరువుఒడ్డున చాలాచోట్ల చిన్నచిన్న రేడియోలు ఏర్పాటు చేయబడి ఉంటాయి. ఇక అచ్చటి వాతావరణమంతా ఆ రేడియో పాటలతో ఈ ఈతగాళ్ళ అరుపులతో, చప్పట్లతో అల్లరి చిల్లరగా ఉంటుంది.

అంత ప్రశాంతంగా ఆ నీటిలో ఇటువంటి - తమాషాలు, యంత్రాల సహాయంతో ఈదడాలు, ఎగరడాలూ జరుగుతాయనిగానీ, కాలిగోళ్ళకు కూడా రంగు వేసుకొనే ఈతవాళ్ళు (ఆధునికులు!) అక్కడ ఈదులాడతారనిగానీ తోరో ఊహించనేలేదు. కాని వాళ్ళంతా ఎవరి దారిని వాళ్లు

వెళ్ళినతర్వాత ఆ చెరువు పూర్వంలాగానే అంత సౌందర్య వంతంగానూ కన్పిస్తుంది. అప్పటిదాక అంత అల్లరి చిల్లరిగా ఉన్నా వాళ్ళు వెళ్ళాక ఆటవికమైన వాతావరణమూ, నిశ్శబ్దాణా పిలిస్తే పలుకుతూ ఉంటుంది.

ఒకనాటి ఉదయం నేనక్కడికి వెళ్ళాను. ఆ క్రిందటి రోజే వేలమంది ఆ ప్రదేశాన్ని దర్శించి వెళ్ళారు. అప్పుడో అడవిబాతు "డీప్‌కోవ్" నుండి నెమ్మదిగా రెక్కలు రెప రెపలాడిస్తూ మంచుపడుతూన్న సమయంలో, స్వేచ్ఛగా ఈదుకొంటూ వెళ్ళడం చూచాను. ఆ దృశ్యం ఎంతో మనో హరంగా ఉంది. అందువల్లనే అక్కడికి వెళ్ళాలనుకొనేవారికి వసంతకాలంలోగానీ, చలికాలంలోగానీ వెళ్ళమని సలహా ఇస్తాను. అదే మంచిసమయం అక్కడికి వెళ్ళడానికి.

మన అదృష్టవశాత్తు ఈప్రదేశం ఇప్పటికీ పూర్వం లాగానే ఉండిపోయింది; రాల్ఫ్‌వాల్డోఎమర్సన్ కుటుంబీకులు కొంతభూమిని దానంచెయ్యడం మూలకంగా ప్రభుత్వం దాన్ని ఆవిధంగా దాన్ని ఉంచగల్గింది. లేకపోతే ఒకప్పుడు చర్చించ బడినట్లుగా దీన్ని- ఈ వాల్డన్ చెరువును కంకార్డు-లింకను పట్టణాలకు నీటిసరఫరాకై నీళ్ళ రిజర్వాయరుగా మార్చేవారే. ఆవిధంగా సాండీపాండును మార్చారు. ఆ స్థితే దీనికిపట్టేది. థోరో నివసించిన ప్రదేశాలను చూడవచ్చే, యాత్రీకులు "ఇది రహదారి కాదు", "ప్రవేశము లేదు", "ఒడ్డున నడచు వారు దండింపబడుదురు" ఇలాంటి ప్రకటనలు వ్రాసిన బల్లలు చూచేవారే దీన్నికూడా ఆవిధంగా మార్చిఉంటే...అవేకాక ఇతరకాల వ్యాపారప్రకటనలు-ఈమందు- త్రాగుడువల్లకలిగే

దుర్వాసనలను తొలగించును...ఇది ఆరోగ్యానికి చాలా మంచిది, నరాల బలంకోసం విటమిన్ "బి" కలుపబడింది. ఇలాంటి విషయాలు వ్రాయబడిన బల్లలు ఉన్నాయి "ఈ తోట లోకి వెళ్లే దారిలో గేట్లను మోటారుబండ్లు కేవలంగా కూడా నిషేధింపబడినవి" అన్న ప్రకటనగల బల్లలుకూడా ఉన్నాయి. ఇవన్నీ ఆ మహాశయుడు కనుక చూడటమే తటస్థపడితే ఎంతగా నవ్వుకొంటాడో.

'అయినా నిషేధింపబడినవి' అంటే చాలును అంతఅర్థమూ వస్తుంది. కాని మరికొన్ని మాటలు అదనంగా చేర్చారు. ఇలా అదనంగా చేర్చబడిన మాటలు ఈకాలపు పోకడను సూచి స్తున్నాయి. అంటే మాటలు సూటిగా సులభంగా అర్థంకాగలిచ్చే శక్తిని, వాటి నిజతత్వాన్ని కోల్పోతున్నాయన్నమాట. కాని ఆ మాటలు చాలవు. ప్రస్తుత పరిస్థితినిబట్టి ఇంకా ఏదో కలపాలి. ఎందుచేతనంటే ఒకరోజు మధ్యాహ్నం నేను స్వయంగా లోపల 54 మోటారుకార్లూ, 5 మోటారుసైకిళ్ళూ, మరికొన్ని లారీలూ డీప్‌కోల్ చుట్టూ నిలచిఉండడం గమ నించాను. అంటే ఆ ప్రకటనలోని మాటలు చాల లేదన్న మాటే గదా!

ఎల్లా ఉంటుందో తెలుసుకోవాలని ఉంటే ఆవుల్ని కాచే కుఱ్ఱవాణ్ణి అడగండి. అంతకంటె శరద్రాత్రులలో అచ్చటికి విహారానికి వచ్చే చకోరాన్ని అడగండి. మీరు స్వయంగా చెట్టునుండి ఆ పండ్లు కోసుకోవడం తటస్థపడి ఉండకపోతే వాటి రుచి మీకు తెలియదన్నమాటే, తెలుసునని ఊరికే అనుకోవడం కేవలం పొరపాటే అవుతుంది. దాని అసలు

రుచితో ఒక్క హాకిల్‌బరీ కూడా బోస్టన్ నగరానికి ఎన్నడూ చేరదు. ఆ మూడు పర్వతాలపైన అవి పెరగడం ఆరంభించిన కాలంనుంచీ కూడా వాటిసంగతే బోస్టన్ ఎరుగదు. వాటిల్లో ఉండే ప్రధానమైన, అమృతోపమానమైన భాగము, వాటి వికాసము, – ఆ నవనవలు వాటిని బజారుకు తీసుకొని వచ్చేందుకు బండిలో వేసినప్పుడే – ఆ బండ్లో వాటిని కుప్పగా వేసి కుదిపినప్పుడే – పోతాయి. ఆ పండ్లు కేవలం ఎండుగడ్డిలా అయిపోతాయి. శాశ్వత న్యాయము అన్నది లోకాన్ని పాలిస్తున్నంత కాలమూ అమాయకంగా నిష్కల్మషంగా ఉండే ఏ ఒక్క హాకిల్‌బరీపండునూ కూడా ఆ కొండలనుండి యథాస్థితిలో పట్టణాలకు ఎగుమతి చెయ్యలేము. ఆ పండ్లు అలా ఎగుమతి చెయ్యబడవు.

*    *    *    *

అప్పుడప్పుడు, నా పొలందున్నకోవడం అదీ అయ్యాక వెళ్ళి సాహచర్యానికై త్వరపడుతున్న అశాంతితో ఆరాటపడుతూన్న వ్యక్తిని కలుసుకొని అతనితో కాలక్షేపం చేసేవాణ్ణి. ఆ వ్యక్తి ప్రొద్దున్నే ఆ చెరువులో చేపలు పట్టడానికని వచ్చి అప్పటినుంచి సాయంకాలందాకా నిశ్శబ్దంగా, చలనంలేకుండా నీటిపై నిలచిపోయినబాతులా, అలలపై తేలుతూ ఆకులా కూర్చుండిపోయి, అప్పటికే అనేకరకాలైన తాత్త్వికసిద్ధాంతాలనుగురించి మననం చేసిచేసి వాటిని ఆచరణలోకి తెచ్చుకోవాలని ప్రయత్నంచేసి నేను వచ్చేసరికే తాను పూర్వకాలానికి చెందిన "కొనోబైట్సు" తెగకు చెందిన వేదాంతిని అన్న

నిర్ణయానికి వచ్చేవాడు. నేను అటువంటివాణ్ని కలుసు కొనేవాణ్ని.

అక్కడ వయస్సు మళ్ళిన వ్యక్తి ఒకడుండేవాడు. అతను చేపలుపట్టడంలోనూ అన్ని పద్ధతులయిన వ్యవసాయపు పనుల్లోనూ మంచి నేర్పరి. అతనొకసారి నా యిల్లుచూచి జాలరివాళ్ళకు అనుకూలంగా సౌకర్యంగా కట్టబడిన ఇల్లులా ఉన్నదంటూ ఎంతో సంతోషిస్తూ నా యింటినీ, నన్నూ మెచ్చుకొన్నాడు. అతను తనవలలు సరిచేసుకొంటూ, అల్లు కొంటూ నా గుమ్మంముందు కూర్చున్నప్పుడు నేనూ నిజంగా అంతగానూ సంతోషించాను. ఎప్పుడో అప్పుడప్పుడు మే మిద్దరం ఒక కొసను నేనూ మరోకొసన అతనూ పడవలో కూర్చుని వాల్డన్ చెరువులో కాలం గడిపేవాళ్ళం. కాని మే మిద్దరం ఎక్కువ మాట్లాడుకొనేవాళ్ళం కాదు. ఎందుకంటే వయసుముదిరాక అతనికి చెవుడు వచ్చింది. కొన్ని సమయాల్లో అత నోపదం అందుకొని కూనిరాగాలు తీసేవాడు. ఆపాట నాకు సరిపడేదికూడానూ. ఆవిధంగా మా స్నేహం తెగ కుండా సౌమ్యంగా, సవ్యంగా నడిచింది. అలా నడచినస్నేహం అదీ జ్ఞాపకం చేసుకోవడం మా యిద్దరిమధ్యా సంభాషణ పెరిగి ఉండిఉన్నప్పటికంటె ఎక్కువ ఆనందదాయకంగా ఉన్నది. అత నలా సన్నగా పాట పాడేటప్పుడు ప్రక్కతాళం వేస్తూ అతని పాటలో అతని ఆనందంలో భాగం పంచుకోడానికి నాకు మరో పరికరం, మరోమార్గం కన్పించేదికాదు. అందువల్ల చేతిలో ఉన్న చిన్న తెడ్డుతో పడవప్రక్కల్ని కొడుతూ ఉండే వాణ్ని. ఆ ధ్వనులు మాచుట్టూఉన్న అడవుల్లో గుండ్రంగా

తిరుగుతూ గాలిలో కలిసిపోతూ బహుదూరం, వ్యాప్తము లవుతుండేవి. మాకు వాటి ప్రతిధ్వనులు విన్పిస్తుండేవి. మృగ ప్రదర్శనశాలలో ఉండే కావలివాడు భయంకర మృగాలను లేవగొట్టడానికి శబ్దాలు చేసినట్లుగా – నేను ఆ అడవుల్ని నిద్ర లేపడానికా అన్నట్లు నేను తెడ్డుతో పడవప్రక్కల్ని కొడుతూ శబ్దం చేసేవాణ్ని. ప్రతి కొండచెరియనుండీ, దట్టంగా చెట్లు పెరిగిఉన్న అడవిలోని ప్రతిమూలనుండీ ప్రతిధ్వనులు – గర్జనలు విన్పించేదాకా అలా కొట్టేవాణ్ని.

*   *   *

వెచ్చని సాయం సమయాల్లో నేను తరచుగా నా బోట్లో కూర్చుని మురళి వాయిస్తూ ఒక మంచినీటి చేపను చూస్తుండేవాణ్ణి. నా మురళీవాయిద్యం దాన్ని సమ్మోహ పరచిందో ఏమో – అది నాచుట్టూ తిరుగుతుండేది. ఆ చెరువునీటి అడుగుభాగం – విరిగిపడిన కొమ్మలతో, నాని పోతున్న దుంగలతో – చిందరవందరగా ఉండేది. ఆ నీటి అలలపైన చంద్రుడు మెల్లగా కదలాడుతూ ఉండడం నేను సంతోషంగా గమనిస్తుండేవాణ్ణి. పూర్వపురోజుల్లో వేసవి కాలపు సమయాల్లో చాలాసార్లు చీకటిరాత్రుళ్ళు మరో స్నేహితుణ్ణి వెంటపెట్టుకొని ఇక్కడకు వచ్చేవాణ్ణి. అల్లా రావడం పెద్ద సాహసకార్యం చేసినట్లుగా అనిపించేది. అలా వచ్చి నీటికి సమీపంలో చేపల్ని, మంటలు ఆకర్షిస్తాయని, కట్టెలూ అవీ పోగేసి పెద్దమంటలు చేసేవాళ్ళం. అలా మంటలు చేసి, చేపల్ని ఆకర్షించేవాళ్ళం. ఒకపెద్దతాడుకు గాలాలు

అమర్చి, వాటికి పురుగుల్ని ఎరలుగా పెట్టి, చాలా చేపల్ని పట్టేంకూడానూ. మా పనంతా పూర్తి అయ్యాక రాత్రి చాలా పొద్దుపొయ్యాక ఆ మండుతున్న కట్టెల్ని తీసి ఒకటొకటే పైకి ఎత్తుగా వెళ్ళి నీళ్ళల్లో పడేటట్లుగా విసరివేసేవాళ్ళం—ఆకాశపు రాకెట్లలాగా. అవి నీటిని తాకుతూ 'చుయ్'మని పెద్దగా శబ్దంచేస్తూ చల్లారిపొయ్యేవి. అప్పుడు అకస్మాత్తుగా మా చుట్టూ అంధకారం క్రమ్ముకొనేది. ఆ కటిక చీకట్లో మేమిద్దరం ఒకళ్ళనొకళ్ళం వెతుక్కోవలసివచ్చేది కూడా. చివరకు ఈల పాట పాడుంకొంటూ, చప్పట్లుచరుస్తూ తిరిగి మనుష్య సంచారమున్న ప్రదేశానికి వెళ్ళేవాళ్ళం. కాని ఇప్పుడో... నాయిల్లే ఇక్కడకట్టుకొన్నాను. నా నివాసమే ఇక్కడయింది.



పూర్వం కొన్నిసార్లు గ్రామసావిడిలో కొంతసేపు కూర్చుని మావాళ్ళంతా పడుకోడానికి వెళ్ళాక నేనీ అడవికి తిరిగివచ్చేవాణ్ని. మరునాటి భోజనానికి పనికివస్తాయని చేపలు పడుతూ, ఆ వెన్నెలరాత్రుళ్ళు చాలాసేపు ఆ చెరువులో బోట్లో షికారుచేస్తూ గడిపేవాణ్ని. అప్పుడా ప్రదేశమంతా నిర్జనంగాఉండేది. చాలాదూరంలో నక్కలు అరుస్తుండేవి. గుడ్లగూబల కూతలుకూడా వినిపించేవి. దగ్గరలోనే ఎవరూ పేరైనాఎరగని ఏదో ఒక పిట్ట ఉండిఉండి మధురంగా సంగీతం పాడుతుండేది. దాని సంగీతం విని ఎంతో సంబరపడుతూ ఉండేవాణ్ని.

మరో చక్కని అనుభవం కలిగింది. అది చిరకాలం జ్ఞాపకం ఉంచుకోవలసిందీ – చాలా విలువైనదీ.

నేను బోటు వేసుకొని ఆ చెరువులో వెన్నెల వేళ షికారుకు బయలుదేరి ఒడ్డుకు ముప్పై నలభై గజాలదూరంలో, నలభై అడుగుల లోతుఉన్న నీళ్ళల్లో లంగరు వేసి నిలచిపోయే వాణ్ని. కొన్ని వేల మంచినీటి చేపలు నీటి పైమట్టంపై తేలుతూ మెరుస్తుండేవి. కొన్ని చేపలు బారులుబారులుగా పోతూ తోకల సాయంతో నీటిపై నాగలిచాళ్లలా నీటి పాయలు ఏర్పరచేవి. నీటి అడుగున నివాస మేర్పరచుకొన్న మరోరకం చేపలు కొన్ని బారులుతీరి పైన తేలుతూ ఈదుతున్న వాటిని తాకుతూ నిలువు వరుసలు ఏర్పరచేవి. అవన్నీ కలిసి మెరుపుల్లా మెరుస్తూ కన్పిస్తూఉండగా రాత్రిళ్లు వీచే చల్లని పిల్లగాలులు నన్ను స్పృశిస్తూ ముందుకు సాగిపొయ్యేవి. ఆ గాలులకు నా పడవ కూడా కొంచెం కదిలేది.

ఆ నీరవ వాతావరణంలో ఆ దృశ్యాన్ని తిలకిస్తూ ఆ గాలులు జీవచైతన్యం కలవిగా భావిస్తూ, అలా కొంతసేపు ఉండిపోయేవాణ్ని. అట్టి అనుభూతి నీకూ కలిగితే నీవూ అలాగే ఆ ధ్యాసలో చాలాసేపు ఉండిపోతావు. చిట్టచివరకు నీవు నెమ్మదిగా లేస్తావు – ఒకచేతికిపైగా మరోచేతిని పైకి లాక్కొంటూ, ఓ మంచినీటి చేప గాలానికి తగులుకోవడంచేత గాలాన్ని బయటకు లాగుతావు. అది సన్నని శబ్దంచేస్తూ, చిందులువేస్తూ, పైన గాలిలో ఎగురుతుంది. అప్పుడు మనం చెయ్యి ఒక్కసారి వెనక్కు లాక్కుంటాము. ఆ కుదుపువల్ల ఆ చేప అలా విసురుగా గంతువేయడం మూలకంగా అలా చేస్తాం. అది ఒక విచిత్రమైన అనుభూతి. అందులోనూ అలా

నిశ్శబ్దంగా ఉన్న ఆ నిశాసమయాల్లో మనం ఆలోచనలోపడి మన ఆలోచనలు చాలాదూరం పోయి జగత్సృష్టిని గురించిన మీమాంసలో పడినప్పుడు ఈచేయి చివుక్కుమనడం – ఈ చిత్రమైన కుదుపు చాలా క్రొత్తగానూ, బహు విచిత్రంగానూ ఉంటుంది. అది నీ ఆలోచనలకు నీ కలలకు అడ్డుతగులుతుంది. మళ్లా నీకీ ప్రకృతితో సంబంధం కలిగిస్తుంది.

  

ఆ వెన్నెలరాత్రిళ్లు ఎక్కువగా మంచు పడుతుండేది. చుట్టూతా దట్టంగా మంచు కమ్ముకొనేది. అలాంటి సమయాల్లో నేను నా గాలాన్ని నీటిలోంచి పైకి లాగాక రెండవ సారి విసరేటప్పుడు – ఈసారి పైకి గాలిలోకి విసరా లనిపించేది. ఎందుకంటే ఆ మంచుకూడా ఆ నీటిలాగానే అంత చిక్కగా ఉండేది. ఒక్క గాలంతోనే రెండుచేపల్ని పట్టానని అనిపించేది. ఒకటి నీటిలోనుంచీ రెండోది గాలిలోనుంచీ పట్టానని అనిపించేది.

వాల్డన్ చెరువూ, ఆ దృశ్యమూ అదీ చాలా అందంగా ఉన్నా అది చాలా సామాన్యంగా ఉన్నట్లే అనిపిస్తుంది. అది ఏదో గొప్పదిగా, బ్రహ్మాండమైనదిగా అనిపించదు. అంతే కాదు– ఆ ప్రాంతాలలో తరచు తిరుగనివారికీ, దాని ఒడ్డున నివాస మేర్పరచుకోని వారికీ అదేమంత ఆకర్షణీయంగా, అంత ఆత్మీయంగా అగుపించదేమో కూడానూ. కాని లోతుగా ఉండి స్వచ్ఛమైన నీరుఉండే ఈ చెరువును గొప్పగా వర్ణించక పోతే న్యాయంచేసినట్లు కాదనిపిస్తున్నది.

అర్ధమైలు పొడవున - మైలు మూడు ఫర్లాంగులు చుట్టుకొలత కలిగి ఆ చెరువు అతి స్వచ్ఛంగా ఉంటుంది. అది అరవై ఒకటిన్నర ఎకరాలమేర ఆక్రమించుకొన్నది. దేవదారు, టేకు చెట్లు దట్టంగా అల్లుకొనిపోయి ఉన్న అడవి మధ్యలో ఉన్నదది. నీరు వచ్చేందుకు కానీ- పోయేందుకుకానీ కాల్వలు, తూములులాంటివేమీ లేవు. నీరు ఆవిరై పైకి పోవడం - (ఇగిరిపోవడం) వర్షాలుకురిసి నీరు చేరడంతప్ప.

దాని చుట్టూతా నీటి అంచులను తాకుతూ 40 - 80 అడుగుల ఎత్తైన పర్వతశ్రేణు లున్నాయి. ఆగ్నేయదిక్కునా, తూర్పుదిక్కునా ఆ కొండలు మరీ ఎత్తు. వాటిల్లో 100 మొదలు 150 అడుగుల ఎత్తు ఉన్నవికూడా ఉన్నాయి. ఆ కొండలన్నింటిపైనా దట్టమైన అడవులు పెరిగాయి.

మన కంకార్డులో కన్పించే నీటికి సామాన్యంగా రంగు ఉంటుంది. ఆనీరు కనీసం రెండు రంగుల్లో ఉంటుంది. దూరం నుండి చూచినప్పు డొకరంగూ - న్యాయంగా చూడవలసిన తీరున- దగ్గరగా చూచినప్పుడు మరోరంగునూ. దూరంనుండి కన్పించే నీటి రంగు ఎక్కువగా వెలుతురుపై ఆధారపడి ఉంటుంది. ఆకాశం ఏరంగులో ఉంటే నీరు ఆరంగులో కన్పిస్తుంది. అసలు స్వచ్ఛమైన నీరు ద్రవస్థితిలో ఉన్నా కాక గడ్డకట్టుకొని ఘన రూపంలో ఉన్నా ఆకాశపురంగులో - లేత నీలపు రంగులో ఉంటుందని కొందరి భావన. కాని ఇతరత్రా ఎక్కడయినా బోటులో నిలబడి మనం సూటిగా నీళ్లలోకి చూస్తే ఆనీరు వివిధమైన రంగుల్లో కన్పిస్తుంది. అయితే విచిత్రమేమంటే మీరు అలా చూచినా వాల్డన్‌పాండులోని నీరు రెండురంగుల్లో

మాత్రమే - అంటే కొన్ని సమయాల్లో నీలంగానూ, మరి కొన్ని సమయాల్లో ఆకుపచ్చగానూ కన్పిస్తుంది. భూమికీ స్వర్గానికీ మధ్యగా ఉంటూ ఆ రెండింటియొక్క సహజ వర్ణాల లోనూ పాలు పంచుకొంటుంది ఆ నీరు. దూరంగా కొండల మీదనుండి చూస్తే ఆకాశపు నీలంరంగే ఆ నీటిలో ప్రతిఫలిస్తూ ఉంటుంది. కాని దగ్గరగా చూస్తే ఆనీరు అతి లేత ఆకుపచ్చ రంగులో కన్పిస్తుంది. సరే ఇదంతా ఎలా ఉన్నా ఓ విషయం మాత్రం సత్యం. ఆ చెరువునీరు - ఒక గ్లాసుడు తీసుకొని ఆ గాజుగ్లాసును వెలుతురులో ఎత్తిపట్టుకొని పరీక్షగా చూస్తే ఆనీరు మీకు స్వచ్ఛంగా ఏరంగూ లేకుండా- అంతే పరిమాణం గల గాలిని ఆగ్లాసులో పట్టిచూస్తే ఎలా కన్పిస్తుందో - అలా కన్పిస్తుంది. ఆనీరు ఎంత స్వచ్ఛమంటే - ముప్పై అడుగుల పైఎత్తునుండి నీళ్ళలోనుండి నేలమట్టాన్ని తేలిగ్గా పరీక్షించవ వచ్చును. ఆనీరు అందుకు అనువుగా ఉంటుంది. బోటులో వెళుతూకూడా కొన్ని అడుగుల లోతున తిరిగే రెండురకాల చేపలనూ - అవి నిజానికి ఓ అంగుళంకంటె నిడివికలవి కావు కాని విడివిడిగా వాటివాటి ఆకార విశేషాలనుబట్టి గుర్తింపవ వచ్చును. చాలా సంవత్సరాల క్రిందట "పికెరల్" ఏరుకోవ డానికి మంచుగడ్డలా ఉన్న ఆ నీటి ఒడ్డున తిరుగుతున్నాను. ఆ మంచుగడ్డలో కన్నాలు పెడుతున్నాను. ఎందుకో బుద్ధిపుట్టి నా గొడ్డల్ని మంచుగడ్డపై కొంచెం దూరంగా విసిరికొట్టాను. ఆ మంచుగడ్డలో కన్నంపడి నా గొడ్డలి లోపలికి జారి క్రింద ఉన్న ఇరవై అడుగుల నీళ్ళల్లో పడిపోయింది. నాకేమో ఆసక్తి కలిగి - అక్కడ బోర్లపడుకొని ఆ కన్నంలోగుండా లోనికి

తొంగి చూచాను. నా గొడ్డలి స్పష్టంగా కన్పించింది. గొడ్డలి భూమిమీద ఆని ఉన్నది. పైనుండే కట్టుపిడి నెమ్మదిగా చెరువు ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కాబోలు అటూ ఇటూ కదులు తున్నది. ఆతర్వాత ఆకన్నం కాస్త పెద్దదిచేసి తాడుతో ఉచ్చువేసి నా గొడ్డల్ని నెమ్మదిగా పైకి చేదుకొన్నాను. ఈ విషయం ఎందుకు చెప్పానంటే – క్రింద నీళ్ళల్లో ఉన్న వస్తువులు అంత స్పష్టంగా కన్పిస్తాయని ఋజువుచేయడానికి. చెరువు చుట్టూతా గట్టున– ఒడ్డంతా నున్నని నున్నపురాళ్ళతో నిండి ఉంటుంది. ఒకటి రెండుచోట్ల మాత్రం ఇసుక కన్పిస్తుంది. ఒడ్డునుండి ఒక్క గంతువేసి నీళ్ళల్లోకి దూకితే నిలువులోతు నీళ్లల్లో ఉంటాము. తల పూర్తిగా మునుగుతుంది. మరీ ఒడ్డున కూడా అంతలోతూ ఉంటుంది. లోపలకు పోయినకొద్దీ లోతు ఎక్కువ అవుతుంది. ఆ చెరువులో నేల అసలు తగలదనీ, ఆ లోతుకు అంతూ పొంతూ లేదనీ కొంతమంది అంటారు. ఆ చెరువులో ఎక్కడా నాచుమొక్కలు కానీ ఆఖరికి తామర కానీ కన్పించదు. అయితే ఆ చెరువుకు ఒక ప్రక్కగా ఉన్న చిన్న మైదానంలోకి నీరు క్రొత్తగా ప్రవహించి కొంతమేర ఆక్రమించుకొన్నది. అక్కడ మాత్రం ఒకటి రెండు నీటి మొక్కలు కన్పిస్తాయి. అంతే. అక్కడతప్ప మిగతా చెరు వంతా అద్దంలా ఉంటుంది. నీళ్ళల్లోకి దిగితే మొదట ఒక అడుగుదూరం చిన్నచిన్న రాళ్ళు తగులుతాయి. అంతే, లోపలకు వెళితే ఎక్కడా రాళ్ళు తగలవు. అంతా స్వచ్ఛ మైన మంచినీటి ఇసుక. ఆ చెరువులో ఎక్కడా బురదతగలదు. కాకపోతే మరీ లోతైన భాగాలలో ఒకటి రెండు అంగుళాల

మందాన మెత్తని మట్టి తగులుతుంది. చెరువు చుట్టూతా ఉన్న చెట్టు చేమలనుండి రాలి పడిన ఆకూ అలమూ నీళ్ళలో నాని, కుళ్ళి అడుగున చేరగా ఏర్పడిన మట్టిపొర అది.

దీనికి రెండున్నర మైళ్ళ పడమరగా "నైన్ ఏకర్ కార్నర్" లో మరో చెరువు ఇలాంటిదే "లైట్ పాండు" అన్నది ఒకటి ఉన్నది. అదీ నాకు పరిచితమైందే. అదేకాక ఇక్కడికి పది పన్నెండు మైళ్ళ దూరంమేరకు నలువైపులా ఉన్న చెరువులు అన్నీ నాకు సుపరిచితాలే. కాని చెరువుల్లో మూడవ స్థానాన్ని ఆక్రమింపగలది మరొకటి నా ఎరికలో లేదు. అంత స్వచ్ఛంగా మంచినీళ్ళ బావిలా ఉండే మరో చెరువు నాకు తెలిసినంతలో లేదు.

ఒకరి తర్వాత మరొకరు అనేక జాతులవారు ఈదారిన వెళ్ళి ఉంటారు. ఈ చెరువులోని నీరు తనివితీర త్రాగి ఈ చెరువును మనసార మెచ్చుకొని, దాని లోతు కనుక్కోవాలని కుతూహలపడుతూ అందులోదిగి హాయిగా స్నానాలు చేసి అత్యంత సంతృప్తులై తమదార్ని తాము తరలివెళ్ళి ఉంటారు. అంతమంది అలా స్నానాలు చేసినా, అన్నివేళ్ళు గడచిపోయినా ఆనీరు అందంగా ఆకుపచ్చగా స్వచ్ఛంగా ఆకర్షణీయంగా అలా ఉండిపోయింది. ఎడతెగకుండా నీటిని అందచేస్తూ ఉండడానికి ఆ చెరువులో ఎన్ని ఊటలున్నాయో. అప్పుడానాడు వసంతకాలపు ఉదయాన్న 'ఆడామూ ఈవ్వూ' ఈడెన్నుండి వెళ్ళగొట్ట బడినప్పుడు అప్పటికే ఈ సరోవరం స్వచ్ఛజల పరిపూర్ణమై సన్నగా మంచు పడుతుండగా — దక్షిణపు గాలులు హాయిగా వీస్తుండగా తన సుస్వరూపాన్ని

వారికి ప్రదర్శించి ఉంటుంది. అప్పటికే ఆనీటిలో అందమైన జాతులు స్వేచ్ఛగా తిరుగాడుతూ ఉండి ఉండాలి. దానికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు - దానిలో తరంగాలు ఏర్పడి, ఇప్పటి రంగుపచ్చి, మనోహరమై ఉండి ఉండాలి; అప్పటికే ఇతర అన్ని చెరువులకంటె ప్రత్యేకతను కూర్చుకొని- ప్రపంచంలో కల్లా వాల్డన్‌పాండు ఒక్కటే అత్యంతము ప్రశస్తమైనదనీ, ఆకాశంనుండి సన్నని జల్లువలె జాలువారిన చిన్నిచిన్ని మంచు బిందువులను అందుకొని, కాచి వడపోసినట్లుండే స్వచ్ఛజలాన్ని అందించే బట్టీ అని స్వర్గలోకంచేత కూడా అప్పటికే అది పొగడ్తల నందుకొని ఉండి ఉండాలి. మనకు జ్ఞాపకములేని ఎన్ని జాతుల సాహిత్యాలలో ఇది కాస్టాలియన్ ఫౌంటెన్‌గా పేర్కొనబడినదో! స్వర్ణయుగంలో ఎంతమంది జలదేవతలు ఎన్నిసార్లు ఇచట సమావేశమై నాట్యాలు చేశారో! ఆ నీరు ఆ ప్రాంతాలలోకల్లా అత్యంతము ప్రశస్తమైనదీ - అతి పురాతనమైనదిన్నీ. ఆ చెరువు ఒక వజ్రంలాంటిది. కంకార్డు నగరం ధరించే కిరీటంలోని ప్రధానమైన వజ్రమది.

ఈ చెరువుదగ్గరకు మొట్టమొదటగా వచ్చివెళ్ళిన మనుష్యులు నడిచిన బాటల గుర్తులు ఇప్పటికీ నిలచి ఉన్నాయి. ఆ చెరువు చుట్టూతా, ఒడ్డున దట్టమైన అడవి ఈమధ్యనే కొట్టివేసిన ప్రదేశాల్లోకూడా, కొండ ప్రక్కగా, ఒకసారి పైకి ఎక్కుతూ, మరొకసారి క్రిందకు దిగుతూ, ఒకసారి నీటి అంచులను తాకుతూ అక్కడికి దారితీస్తూ, మరొకసారి నీటి ఒడ్డుకు దూరంగా తొలగివెళ్లే వంకర టింకర కాలిబాటను చూచి ఒకసారి నేనెంతో ఆశ్చర్యపడ్డాను. ఇచ్చటి మానవ

జాతి ఎంత పురాతనమైనదో ఈ కాలిబాటకూడా అంత పురాతనమైనదే. ఆ బాటలో- ఆ దారిపొడుగూతా ఆనాటి వారి- ఆదిమవాసుల, వేటకాండ్ర పాద ముద్రలు స్పష్టంగా కన్పిస్తాయి. అయితే ఈ ప్రాంతాలలో ఉంటూ ఉన్న ఇప్పటి వాళ్ళు కొందరు తెలివితక్కువగా వాటిపైన అడుగులువేస్తూ అటు వెళ్ళడంచేత పీళ్ళ పాదముద్రలు, బూట్ల గుర్తుకూడా అక్కడక్కడ కన్పిస్తాయి. ఈ కాలిబాట సంగతి చలికాలంలో చెరువు అంతా గడ్డకట్టుకొనిపోయి ఉన్నప్పుడు ఆ చెరువు మధ్యలో నిలుచునిచూస్తే బాగా తెలుస్తుంది. కొంతసేపు మంచు కురిసి వెలిసినతర్వాత వెళ్ళి అలా అక్కడ నిలుచుని చూస్తే వంకరలు తిరుగుతున్న తెల్లని గీతలా- పట్టీలా స్పష్టంగా చిన్న మొక్కలూ, పొదలూ వాటివలన మరుగుపడకుండా ఒక మైలుదూరందాకా అనేకచోట్ల ఆ కాలిబాట కన్పిస్తుంది. కాని ఎండకాలంలో మొక్కలూ అవీ దట్టంగా పెరగడంచేత, దారి దాదాపు కప్పడిపోవడంచేత దానికి చాలా దగ్గరగా నిలబడి కూడా ఆ కాలిబాటను పోల్చుకోలేము.

*   *   *   *

ఈ చెరువులో నీటి మట్టము పెరుగుతూ తరుగుతూ ఉంటుంది. ఇది సరిగ్గా ఏయే సమయాల్లో జరుగుతుందో ఎవరికీ (సాధారణంగా చాలా విషయాల్లో చాలమంది ఏమో తెలిసినట్లు నటించినట్లే ఈ విషయంలోకూడా నటించినప్పటికీ) తెలియదు. అది వేసంగిలో తరుగుతూ ఇతర కాలాల్లో పెరుగుతూ ఉంటుంది. కాని ఇది జరగడం పొడిగాలులనుబట్టీ, గాలిలోని

తేమనుబట్టీ కాదు. ఈ చెరువు నీరు ఒకటి రెండు అడుగులు తకు _వగా ఉండడమూ ఎరుగుదును. అదే విధంగా నేనక్కడ నివసిస్తు న్నప్పటికంటె అయిదు అడుగులు నీటిమట్టం పెరగ డమూ ఎరుగుదును. ఇలా నీటిమట్టం పెరగడం తరగడం నేను స్పష్టంగా గుర్తించాను. దీన్ని గురించి నా మిత్రులతో చెబితే వాళ్ళకు నమ్మకం కలుగలేదు. సరే వాళ్ళునమ్మినా నమ్మక పోయినా అది రెండు సంవత్సరాలలో నిదానంగా క్రమంగా పెరిగి ఇప్పుడు '౪2 వ సంవత్సరం వేసంగిలో నేను అక్కడ నివసిస్తూ ఉన్నప్పటికంటె, లేక, ముప్పై సంవత్సరాలకు పూర్వంలాగా, అయిదు అడుగులు పెరిగింది. మొత్తంమీద ఈ మార్పువలన నీటి మట్టంలో ఆరు ఏడు అడుగుల ఎడుగు వచ్చింది. చుట్టూతా, ఉన్న కొండలనుండి ప్రవహించి వచ్చిన వాననీరు మొత్తం కొత్తగా చేరిన నీటి ప్రమాణంతో పోల్చి నప్పుడు లెక్కలోకి రాదు. ఇందుకు కారణమల్లా చెరువులో ఉన్న ఊటలే. అవే అంతనీరు అందిస్తుంటాయి. దీనికి తూర్పు దిక్కుగా మైలుదూరంలో ఉన్న "ఫ్లింట్సు" చెరువులోకూడా ఇలాంటి పెరుగుదలను నేను గమనించాను. నా పరిశీలనవలన వైట్ పాండు ("వైట్" చెరువు) కూడా ఇటువంటిదేనని చెప్ప గలుగుతున్నాను. బహు సంవత్సరాలు జాగ్రత్తగా పరిశీలించిన మీదటే నేనీ విషయాలు చెప్పగలుగుతున్నాను. ఈ నీటి మట్టము ఇలా తరగడానికీ పెరగడానికీ మధ్య కొన్ని సంవత్స రాల వ్యవధి ఉంటుంది. నా మట్టుకు ఒకసారి పెరగడం చూచాను. రెండుసార్లు తరుగుతుండగా కొంతవరకు గమనిం చాను. ఒకసారి అయిదు అడుగులకు పెరగడం గమనించానని

చెప్పాను. ఆతర్వాత మరలా తరగడం గమనించి నే నెన్నడూ చూచి ఎరగనంత లోతుకు వస్నేందు పదిహేను సంవత్సరా లలో తిరిగి తగ్గిపోగలదని నేను అంచనా వేశాను. ఇలాంటి తరుగుదల పెరుగుదల మూలకంగా కలిగే ఉపయోగ మొక టుంది. పెరిగినప్పుడు నీరు ఆఎత్తున ఓ సంవత్సరమో అంత కంటె ఎక్కువకాలమో అలా నిలబడి ఉంటుంది. ఆ సమ యంలో ఒడ్డున నడవడం కష్టం. అంతకుముందు నీటిమట్టము తక్కువగా ఉన్నప్పుడు సంవత్సరంపాటు పెరిగిన చిన్న మొక్కలూ, పిచ్‌పైను, బెర్చ్, ఆల్టర్, ఆస్పెన్ ఇంకా ఇతర రకాలైన మొక్కలూ ఈ నీళ్ళల్లో మునిగిపోయి, నాని, చచ్చి పోతాయి. మళ్ళా నీరుతీశాక చక్కనితీరము ఏర్పడుతుంది. రోజూ ఆటూ పోటూ తగిలే సముద్రపుతీరంలా ఆ చెరువు చుట్టూతా చక్కనితీరము పరిశుభ్రంగా ఉంటుంది. నీరు కనిష్ట ప్రమాణంలో ఉన్నప్పుడు తీరం మరీ బాగుంటుంది.

చెరువుకు ప్రక్కగా నాయింటివైపున పదిహేను అడుగుల ఎత్తున పెరిగిన దేవదారువృక్షాల వరుసలు కొన్ని ఉన్నాయి. అవి ఎదిగిన ఎత్తునుబట్టి అవి ఎన్నేళ్ళక్రిందట మొలకెత్తినవో చెప్పవచ్చును. అంటే క్రిందటిసారి చెరువుయొక్క నీటిమట్టము ఎప్పుడు పెరిగిందో తెలుసుకోవచ్చునన్నమాట. ఆ చెట్లు అన్నీ రంపపుమరతో కోసినట్లుగా కూలిపోయినాయి. అవన్నీ నీటిలో మునిగిపోయాయి. అవి క్రమంగా చీకిపోయి నాశనమై పోయాయి. ఈవిధమైన మార్పులను పురస్కరించుకొనే ఆ చెరువు ఒడ్డును "వాహ్యాళికుపయోగపడే తీరము" అని అంటే

ఆ పేరు సార్థకమే అవుతుంది. ఈ తీరం ఒక సరళరేఖలా ఉండదు. ఆ తీరము ఒకచోట ముందుకూ మరోచోట వెనక్కూ చొచ్చుకొని వస్తూఉంటుంది. చెరువుచుట్టూఉన్న చెట్లు ఆ చెరువును సరిగ్గా ఒక నిర్ణీతస్థలంలో కట్టుదిట్టంలో ఉంచలేక పోతున్నాయా అనిపిస్తుంది. ఆ చెట్లు బారులుతీరి సహజమైన దిట్టమైన సరిహద్దు ఏర్పడలేకపోతున్నా యనిపిస్తుంది.

ఈ తీరాన్న మొక్కలు నిలువలేవు. అప్పుడప్పుడు ఆ చెరువునీరు పొంగివచ్చి వాటిని తుడిచివేస్తుంటుంది. నీరు బాగా నిండాఉన్నప్పుడు, ఆల్టర్, లిల్లో, మేపల్ మొక్కలు, భూమి నుండి మూడు నాలుగు అడుగుల ఎత్తుగా, నీళ్ళలో తేలుతూ ఉంటాయి. వాటి కాండాలనుండి ఎఱ్ఱనివేళ్ళూ, పిల్ల వేళ్ళూ చాలా అడుగులదూరందాకా వ్యాపించి ఆ మొక్కలను నీటిలో నిటారుగా నిలవడానికి ప్రయత్నంచేస్తున్నాయా అన్నట్లు కన్పిస్తాయి. ఆ తీరానికి దాపున ఎత్తుగా పెరిగే బ్లూబెఱ్ఱీ మొక్కలు (ఆ మొక్కలు ఇతరత్రా ఎప్పుడూ పిందెవెయ్యవు-) ఈ పరిస్థితుల్లో విపరీతంగా కాపుకాస్తాయి.

కొందరు ఆ సరోవర తీరమంతా అల్లా ఎందుకు ఎట్లా నున్నగా, తాపీపని చేసినట్లుగా చదరంగా ఉన్నదో చెప్పలేక పొయ్యారు. అది వారికి అమితాశ్చర్యకరమైనవిషయం. మరి కొంతమంది - ఆ ప్రాంతపు గ్రామీణులు - అందులోనూ బాగా వయసుమళ్ళిన వాళ్ళు "మా చిన్నతనంలో విన్నవిషయమిదే" అని అంటూ ఆ చెరువునుగురించి పూర్వం ప్రచారంలో ఉన్న కథ ఒకటి చెబుతూ ఉంటారు. ఆ కథ ఇలా నడుస్తుంది.

చాల పురాతన కాలంలో ఆదిమవాసులైన "ఇండి యన్లు" ఇక్కడొక పర్వతంపైన ఒక పెద్దసభ ఏర్పాటు చేసు కొన్నారు. వారు వివిధ విషయాలు చర్చించుకొండామని అలాగా సమావేశమయ్యారు. వారున్న ఆ పర్వతం - ఇప్పుడీ చెరువు భూమిలోకి జారుతున్నట్లుగా అప్పుడు పైకి ఆకాశం లోకి అంతకంతకు ఎత్తుగా పెరిగింది. అప్పుడు వాళ్లు దైవనింద చేశారు - నిజానికి అలాగా దైవనిందచేసే అలవాటు లేదు వాళ్ళకు - అలాంటి అపచారము తరచుచేసే తరహా మను ష్యులు కాదు వాళ్ళు. కాని కథలో అలా చెప్పబడి ఉన్నది. అలా దైవనింద చేస్తున్నప్పుడు ఆకొండ ఒక్కసారి కంపించి పోయి కృంగిపోయింది. అక్కడ చేరినవాళ్ళల్లో వాల్డన్ అన్న పేరుగల ఒక్క ముసలమ్మ మాత్రం ప్రాణాలతో తప్పించు కొన్నది. ఆమె పేరనే ఈ చెరువుకూడా వాల్డన్‌పాండు అని పిలువబడుతూ వచ్చింది. ఆ కొండ అలా కంపించినప్పుడు అనేక వందల రాళ్లు కొండలపైనుండి దొర్లి వచ్చినాయనీ... అందుమూలంగా ఈ తీరం ఇలా ఏర్పడిందనీ ఊహించ బడుతున్నది.

ఈ కథ సంగతి ఎల్లా ఒక్క విషయంమాత్రం నిశ్చ యంగా చెప్పవచ్చు - పూర్వం ఒకప్పుడు - ఇప్పుడీ చెరువు ఉన్న ప్రదేశంలో చెరువు అంటూ ఒకటి ఉండేదికాదని చెప్ప వచ్చును. నేను క్రితంలో మరో అధ్యాయంలో నాకు సుపరి చితుడని పేర్కొన్న ఆదిమ నివాసి నాతో చెప్పినదానికీ ఈ కథ ఏమీ వ్యతిరేకంగా లేదు. దాంతో పోల్చిచూస్తే ఇది అంత అసందర్భంగా కనిపించదు. పచ్చగడ్డి మొక్కల వేళ్ళతో

నిండిఉన్న ఆ భూమి పైభాగంనుండి సన్నని పొగలాగా నీటి తుప్పర పైకివస్తున్నట్లు తాను గమనించినట్లూ, దాన్ని బట్టి అక్కడొక పెద్ద మంచినీళ్ళబావి త్రవ్వాలని ఒక దృఢ నిశ్చయానికి వచ్చినట్లూ, ఆ విషయమంతా తనకు బాగా జ్ఞాపకం ఉన్నట్లూ అతను అంటూ ఉండేవాడు. ఇక పోతే ఆ రాళ్ళ విషయం. చెరువు చుట్టూతా ఉన్న కొండ క్రిందిభాగాలను చెరువు నీటి అలలు నిరంతరం ఒరసికొనడం వలన ఆ రాళ్ళు ఏర్పడినాయన్న విషయం ఇప్పటికీ చాలమంది అంగీకరించరు. ఈపని ఆ అలలు చేసినపనేనని స్పష్టంగా కన్పిస్తుంది. ఆ చుట్టూతా ఉన్న కొండలపై ఉన్న రాళ్లనూ, ఈ రాళ్లనూ ఒక్కలాగే ఉన్నాయి. వాటి స్వరూప స్వభావాదుల్లో ఎక్కువ పోలికలున్నట్లు నేను గమనించాను. అందువల్లనే నాకీ విషయం అంత ఆశ్చర్యకరంగా కన్పించలేదని అన్నాను. ఆ కొండలనూ, వాటిని తాకుతూఉన్న ఆ అలలనూ చూచినప్పుడే ఈ తీరం ఇంత చక్కగా చదునుచేసినట్లు ఎందుకున్నదో నాకు అవగతమై పోయింది.

"సాఫ్రాన్‌వాల్డన్" అని పిలువబడే ఒకానొక ఆంగ్ల ప్రాంత మున్నది. వాల్డన్ అన్నది అట్టి ప్రాదేశిక నామభవము కాకపోయినట్లయితే దీని పేరుయొక్క పుట్టు పూర్వోత్తరాలను గురించి ఇలా అనుకోవచ్చును. అది తొలుదొల్తగా చుట్టూతా గోడలు కట్టబడిన అంటే (Walled in pond) వాల్డ్ ఇన్ పాండు అని పిలువబడి ఉంటుంది. అది వ్యవహారంలో నలిగి క్రమంగా 'వాల్డన్' అయి ఉంటుంది.

* * *

ఆ చెరువు కేవలం నాకొరకే ప్రకృతి సిద్ధపరచబడిన మంచినీటి బావిలాంటిది అనిపించింది. సంవత్సరంలో నాలుగు నెలలు ఆ నీరు చల్లగా ఉంటుంది. ఆనీరు అన్ని కాలాలలోను పరిశుభ్రంగా ఉంటుంది. ఎండాకాలంలో సాధారణంగా ఇతర ప్రదేశాల్లో చెరువుల్లోనీళ్లు వేడెక్కుతాయి. కాని వాల్డన్ చెరువులో నీళ్లు అలా వెచ్చబడవు. ఓ బకెట్టుతో నీళ్ళు తెచ్చుకొని ఇంట్లో పెట్టుకొన్నా అంతే – వారం రోజులైనా ఆనీటి ఉష్ణోగ్రత మారదు. నీరు చెడదు. రుచి మారదు.

వాల్డన్ చెరువులో ఎన్నోరకాల చాపలు లభిస్తాయి. "వాల్డన్ పికెరల్" అన్నవి ఒక్కొక్కటీ ఏడు పౌండ్ల బరువు తూగుతాయి. "పెర్చ్‌పౌట్లు, షైనర్, ఛిబిక్‌రోచ్, బ్రీమ్, ఈల్" అనే చాపలుకూడా లభిస్తాయి. అవి ఒక్కొక్కటీ రెండేసి మూడేసి పౌన్లు తూగుతాయి. బరువును బట్టే చాపలు విలువ పెరుగుతుంది. ఏమైనప్పటికీ మొత్తంమీద చెప్పాలంటే వాల్డన్‌పాండు చాపలు అంత విస్తారం దొరికే చెరువుకాదు. పరిశుభ్రంగా కన్పించే ఒకరకం కప్పలూ, తాబేళ్ళూ కూడా కన్పిస్తాయూ చెరువులో.

*　　　　*　　　　*

తీరము వంకర టింకరగా ఉండడంచేత చూడడానికి మనకు విసుగ్గా ఉండదు. అటువైపు ఎంతసేపు చూచినా చూడాలనే ఉంటుంది. పెద్దపెద్ద అఖాతాలతో పశ్చిమతీరమూ, నిరాటంకంగా కన్పించే ఉత్తరతీరమూ, అందంగా అలంకరించినట్లుండే, ఇంతకుముందెవ్వరూ కనుక్కొని, చిన్నచిన్న అఖా

తాలతో నిండిఉన్న, దక్షిణ తీరమూ - నా మనస్సులో ఎప్పుడూ మెదులుతూనే ఉంటాయి. చుట్టూతా సరిగ్గా నీటి అంచులను తాకుతూ పర్వతశ్రేణు లున్నట్లుగా అనిపిస్తుంది. ఆ చెరువుమధ్యనుండి చూస్తే దాని చుట్టూఉన్న అడవి ఎంతో మనోహరంగా కన్పిస్తుంది. ఒడ్డునే ఉన్న పెద్దపెద్ద చెట్లన్నీ ఆ చెరువునీటిలో ప్రతిబింబిస్తూ ఉంటాయి. ఆదృశ్యం ఏనాటికీ మరువతగింది కాదు. ఆ చెరువును ఆనుకొని పొలాలు ఉన్న చోటకంటె - చెట్లూ అవీ నరికివేయబడి చదును చేయబడిన ప్రదేశాల్లో కంటె - దానిదారిన దాన్ని వదలివేసిన ప్రదేశం లోనే తీరం బాగుంటుంది. నీరున్న వైపుకు చెట్లు విస్తారంగా పెరగడానికి కావలసినంత అవకాశం ఉన్నది. అక్కడ ప్రతి చెట్టూ - తన కొమ్మలను నీటివైపుకు నిడివిగా విశాలంగా వ్యాపింప చేస్తుంది.

ఆ చెరువు అంచులను ప్రకృతి చాల మనోహరంగా, చాల సహజంగా తీర్చి దిద్దింది. అంచులవెంబడి మొట్టమొదట చిన్నచిన్న పొదరిండ్లూ, వాటి తర్వాత వాటిపై తమ నీడల్ని పరుపుతూ విశాలంగా ఎత్తుగా పెరిగిన రకరకాల చెట్లూ - ఆ దృశ్యం ఎంతో కన్నుల పండువగా ఉంటుంది. అక్కడ చాలా కొద్ది ప్రదేశాలు తప్ప మిగిలినవన్నీ మానవ సంబంధమైన "ముద్రలు" లేకుండా- నేటి నాగరక చిహ్నాలు లేకుండా స్వేచ్ఛగా స్వచ్ఛంగా కన్పిస్తాయి. ఒక వెయ్యి సంవత్సరాల క్రితం ఆ తీరం ఎలా ఉండి ఉన్నదో ఇప్పుడూ సరిగ్గా అలాగే ఉన్నది. ఆ నీటి ప్రభావం అటువంటిది.

అక్కడ మనదృష్టికి ఆనేటంతమేర విశాలమైన

భూభాగంలో ఆసరస్సు ఇతరము లన్నిటికంటే అందమైనదిగా, అత్యంతము భావ ప్రధాన మైనదిగా కన్పిస్తుంది. ఆ సరస్సు భూదేవియొక్క ముఖబింబము. ఆమె ముఖంవంక - ఆమె కనులవంక చూచేసరికే తద్దర్శకునికి తన ప్రస్మృతీ, తన హృదయపు లోతులూ ఇట్టే అర్థమైపోతాయి. తీరాన్న ఉన్న పర్వతశ్రేణులు ఆమె కనుబొమలు గానూ, మరీ దాపునపెరిగే మొక్కలు ఆ కనుబొమ్మల్లో ఒత్తుగా కన్పించే కనురెప్ప వెంట్రుకల్లాగానూ అనిపిస్తాయి.

వసంత కాలంలో, ప్రశాంతంగా, విశ్రాంతిగా ఉన్న రోజుల్లో ఓపూట అక్కడకు వచ్చి, ఒడ్డున కాస్తంత ఎత్తుగా, ఏ కొట్టివేసిన చెట్టు బోదెపైనో కూర్చుని సన్నని నీరెండలో ఆ చెరువును పరిశీలిస్తూ ఉండడం ఎంత హాయి అనుకొన్నారూ! ఉట్టప్పుడు ఆ చెరువు ఒక అద్దంలా తళతళ మెరిసిపోతూ స్వచ్ఛంగా కన్పిస్తుంది. సూర్య కిరణాలువడి ప్రతిఫలిస్తుంటాయి. అప్పుడప్పు డానీటిలో అక్కడక్కడ సుళ్లు బయలుదేరతాయి. అప్పుడా కదలే తరంగాల మూలకంగా ఆ నీళ్ళలో చుట్టూ ఉన్న చెట్టుచేమల ప్రతిబింబాలు అందంగా తలలాడిస్తూ ఒయ్యారంగా ఊగుతూ కన్పిస్తాయి. అంతవరదాకా అవన్నీ ఎందుకు కన్పించలేదా అని ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. విడిగా చూస్తే ఒక్క చాపగానీ, ఒక్క పురుగుకానీ పైకి కన్పించవు. కాని వాటి ఉనికీ వాటి గమనమూ సుడులు కారణంగా నీళ్ళ మధ్యలో బయలుదేరి ఒడ్డుదాకా కదలివెళ్ళే ఆ తరంగాలలో - ఆ సౌందర్యరేఖా వలయాంతరాలలో మనం పోల్చుకోగలం. ఆనీరు నిరంతరం మన స్థూలదృష్టికే, సాధారణపు

చూపులకు కన్పించకుండా ఉబుకుతూ ఉంటుంది. తన్మూలకంగా ఆ సరోవరంలో ఒకవిధమైన జీవచైతన్యం ద్యోతకమవుతుంది. అందు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కన్పిస్తాయి. నీరు పైకీ క్రిందికీ ఉబుకుతూ, పొంగు చల్లాడుతూ ఉన్నట్లు కన్పిస్తుంది. అది ఆనందపారవశ్యాన కలిగిన చకితత్వమో, పులకరింతల పొంగో, దుఃఖవైవశ్యాన కలిగిన మార్పో మనం స్పష్టంగా వేరుపరచి చెప్పలేము. కాని ఎంత సౌందర్యం! ఎంత వైచిత్రం! ఆ సరోవరాన్ని ఆవరించియున్న ఆ ప్రసన్న గంభీరత ఎంత మనోహరమైనదీ !

ఏ మి స రో వ ర మి ది !

ఈ సరోవరకాంత అసలే సహజమనోహరాకృతి కలది; సహజాకర్షణ కలది. ఆపాత మధురమైనది. అది చాలదా అన్నట్లు తన పరిసర ప్రకృతిగత సర్వశోభాసౌభాగ్యాన్నీ రహస్యం తనలో ఇముడ్చుకోవడానికి ప్రయత్నంచేస్తూ అంతటి రహస్యాన్ని, అంత సౌందర్యాన్నీ లోన దాచుకోలేక ఆ సౌందర్యాన్ని ప్రతిఫలింపచేస్తూఉన్నది. ఆమె సహజసుందరతర వదనబింబానికి ప్రకృతిసౌందర్యం ఒక దివ్యాలంకరణగా భావిస్తున్నది. ఆమె వదనమున్నూ, ఆమె కనులున్నూ సహజంగానే కాంతివంతమైనవి, అది చాలదా అన్నట్లు సూర్యచంద్రుల కాంతికిరణాలను సర్వదా గ్రహిస్తూఉన్నది. తత్కాంతిచ్ఛటలు ఒకచోట నిలువక తన స్నిగ్ధమైన కపోలాలపైనా, ఫాలభాగంపైనా చిందులువేస్తుంటే, తత్కాంతి సంచయ మృదుస్పర్శచే ఆమె పులకితగాత్ర అవుతూ ఉన్నది. ఆమె ఆ కాంతులనూ,

ఆ పులకరింతలనూ తుడిచివేయాలని ప్రయత్నంచేస్తూనే ఉన్నది. ఆ ప్రయత్నంలో ఆమె అప్రయత్నంగా అత్యాకృష్ట స్వీయ సౌందర్యాన్ని ప్రదర్శిస్తున్నది...క తరంగాలు వల యాలు వలయాలుగా గమిస్తున్న ఉద్వేగమే అది. ఆ సరోవర మంతా అలా నిరంతరం తళతళలాడుతూ ఉండడానికి కార ణమే అది.

సెప్టెంబరులోనో, అక్టోబరులోనో ఒకరోజు వచ్చి చూస్తే ఆ చెరువు చుట్టూతా స్వచ్ఛమైన ఏ కెంపులతోనో, విలువైన స్ఫటికశిలలతోనో చక్కగా తాపడం చెయ్యబడిన ఒక దర్పణంలా కన్పిస్తుంది. ఈ భూమిమీద కన్పించే సకల వస్తుసముదాయంలోకీ ఇంత అందంగా, ఇంత స్వచ్ఛంగా, ఇంత విశాలంగా ఉండే మరోవస్తువే లేదు—ఈ ఒక్క సరోవరంతప్ప. స్వచ్ఛమైన వియద్గంగ ఇది. అనేక జాతులు పుట్టిపెరిగాయి. దీని ప్రక్కగా నడిచివెళ్ళాయి. కాని ఇదిమూరలేదు. రాళ్ళతో కొడితే ముక్కలైపొయ్యే అద్దంవంటిది కాదిది. ఇది శాశ్వత దర్పణం. దీని వెనుకఉండేపూత ఏమాత్రమూ చెడదు. తుఫాన్లు గానీ, దుమ్ముగానీ దీనిపై నిలువదు. దర్పణం ఉపరిభాగం ఎప్పుడూ తళతళలాడుతూ ఉంటుంది. అక్కడ ఏదైనా ఆకూ అలమూ రాలినా, దుమ్మూధూళీ పడినా, వెంటనే లోపలకు కృంగిపోతుంది; గాలులు వాటిని పరిశుభ్రంగా తుడిచివేస్తాయి. అందువల్ల అదిఎప్పుడూ స్వచ్ఛంగా,నిత్యనూతనంగా కన్పిస్తుంది.

*　　　*　　　*

కొన్ని ఎకరాలమేర ఆక్రమించి పైన గాలిలో ఉన్న ఒకానొక శక్తితో సమరూపమైన శక్తి .. స్వచ్ఛశక్తి. స్వభావ

మును కన్పరుస్తుంది. అది పైనుండి నిరంతరంగా నూతన జీవ శక్తినీ, నవ చైతన్యాన్నీ అందిపుచ్చుకొంటూ ఉన్నది. అది భూమి ఆకాశాలకు మధ్యగా, మాధ్యమికదశలో ఉన్నది. భూమిమీద గడ్డిమొక్కలూ, చెట్టుచేమలూ ఇవిమాత్రమే గాలితాకున తలలూపుతాయి. కాని చెరువులో ఆ ఉపరిభాగ మంతా-ఆ నీరే గాలికిచెదరిపోయి చిన్నచిన్న అలలు అలలుగా విరిగిపోతున్నది. ఆనీటి పైగా ఎక్కడ గాలి దూసుకొనిపోతు న్నదో ఆ కాంతికోణాల చారికలనుబట్టి కనుక్కోగలము. దాని ఉపరిభాగాన్ని పైనుండి క్రిందకు వంగిచూస్తూ పరిశీలింపగలము. బహుశా చివరకు గాలియొక్క సమోపరితలంపైకూడా అలాగే చూడగలుగుతా మేమో! అలాపరికించి నీటిపై అలలుకలి గించే ఈ వాయుశక్తికంటె ఇంకా సున్నితమైనశక్తి ఆ వాయు వీచికలపై ఎక్కడ రాసుకొని దూసుకొనిపోతుందో కనిపెట్ట గలుగుతామేమో!

*　　　　　*　　　　　*

తీవ్రంగా మంచుకురియడం మొదలుపెట్టాక అక్టోబరు నెల చివరిభాగంలో నీటి పురుగులూ అవీ పూర్తిగా కన్పించ కుండా పోతాయి. ఆ తర్వాత నవంబరులో సాధారణంగా ప్రశాంతంగా ఉండే ఏరోజున అయినా ఆ చెరువునీరు కదల కుండా నిండుకుండలా తొణకకుండా ఉంటుంది. అలలు కలిగేం దుకు ఏ అవకాశమూ ఉండదు. నవంబరు నెలలో ఒకసారి చాలరోజులదాకా విడవకుండా జోరున వానకురిసి తగ్గిన తర్వాత ఓ మధ్యాహ్నపు సమయంలో అక్కడికి వచ్చాను.

అప్పటికి ఇంకా ఆకాశమంతా మబ్బులు కమ్ముకొనేఉన్నాయి. మంచు కురుస్తూనే ఉన్నది. అప్పుడా సరోవరమంతా ఎంతో నున్నగా – ప్రశాంతవంతంగా కన్పించింది. దాని జలోపరి భాగాన్ని వేరుగా గుర్తించటమే కష్టమైంది. అది అప్పుడు చైత్రమాస రమాస్మితశోభలను ప్రతిబింబింప చేయటంలేదు గాని చుట్టూతాఉన్న పర్వతాల సహజవర్ణాన్ని ప్రతిఫలింప చేస్తున్నది. నేను నాబోటును ఎంతో నెమ్మదిగా నడుపుతున్నాను. కాని దానికే సన్నగా బయలుదేరిన చిన్నచిన్న అలలు నా కనుచూపుమేరదాకా వ్యాపిస్తూ నీటిలో కన్పించే ప్రతిబింబాల రూపాలను చెదరగొట్టాయి. అప్పుడా నీటి మధ్యభాగంలో అక్కడక్కడ తళతళ మెరిసిపోతూ–తీవ్రంగా కురిసిన మంచు నుండి తప్పించుకొన్న మెరుగుపురుగులు కుప్పలు పోసినట్లుగా, కాక–నీటి అడుగునఉన్న ఒకచిన్న ఊటనుండి నీరు పొర్లివస్తూ బుడగలు వస్తున్నట్లుగా కన్పించింది. నెమ్మదిగా తెడ్డువేస్తూ బోటు అక్కడకు నడుపుకొని వెళ్ళాను. ఆ ఆకుపచ్చని నీటిలో ఒక్కొక్కటీ అయిదేసి అంగుళాలు పొడవుగా, సువర్ణఛాయలో తళతళ మెరిసిపోతున్న పెర్చ్‌చేపలు నన్ను చుట్టుముట్టాయి. అవి వేలసంఖ్యలో ఉన్నాయి. అవన్నీ క్రిందనుంచి పైకి తేలుతూ ఈదుతూ వస్తున్నాయి. పైకి గాలిపీల్చుకొని, గాలి విడిచిపెట్టే బుడగలు కలిగిస్తూ చప్పున లోపలికి మునిగిపోతున్నాయి. అదంతా వాటికో ఆటలా ఉన్నది. అన్నివేల చేపలు నా చుట్టూతా తిరుగుతూ ఆడుకొంటూంటే, నాకెంతో ఆశ్చర్యమైంది. స్వచ్ఛంగా, మందంగాఉన్న అద్దంలోనుండి ఒకప్రక్కనుండి మరోప్రక్కకు అన్నీ కన్పిస్తూఉన్న లోతు

తెలియని ఆ నీళ్ళల్లో, ఆకాశాన్నీ, ఆకాశంలో మందమంద గమనాల వయ్యారాలు పోతున్న మేఘమాలలను ప్రతిబింబిస్తున్న ఆ సరోవరంలో అలా షికారుచేస్తున్నప్పుడు నాకు నిజంగా గాలిలో మేఘాలను తాకుతూ ఆకాశవీధుల్లో ఓ బెలూనులో కూర్చుని విహారంచేస్తున్నట్టుగానూ, నాచుట్టుతా ఉన్న చేపలు రెక్కలువిప్పుకొని ఎగురుతున్న పక్షుల గుంపుల లాగానూ అనిపించింది. ఆ చేపల తోకలు రెక్కల్లా అనిపించాయి. అవన్నీ నా కాళ్ళక్రిందుగా ఎక్కడకో ఎగిరిపోతున్నట్టుగా, వాటిరెక్కలు నా అరికాళ్ళకు కగిలినట్లుగా అనిపించి నాకు చక్కలిగింత కలిగింది.

ఆ చెరువులో అలా పెర్చ్‌చేపలు కుప్పలు తెప్పలుగా ఉన్నప్రదేశాలు చాలా కన్పించాయి. ముందు రాబోయే ఋతువునుగురించి భయపడి అవి ఇప్పుడే వేలసంఖ్యలో అభివృద్ధిచెందుతున్నాయా అనిపించింది. అవును మరి చలికాలం వస్తే మంచు గడ్డిపొర ఒకటి-సన్నని గాజుపలక మూతవేసినట్లుగా-కమ్మేసుకొని వస్తుంది...నేను కొంచెం అజాగ్రత్తగా వాటికి మరీ దగ్గరగా వెళ్ళేసరికి అవన్నీ ఒక్కసారి అతివేగంగా తోకలాడించి చప్పున ముడుచుకొనిపోయి లోపలికి, అగాధంలోకి పారిపోయి దాక్కున్నాయి. శరపరంపరలను ప్రయోగించినప్పుడు పారిపోయినట్లుగా పోయాయవి. నేను ఆశ్చర్యచకితుణ్నై కొంతసేపు అలాగే ఉండిపోయాను. చిట్టచివరకు-మళ్ళీ గాలి విజృంభించింది. మంచుపడడం ఎక్కువయింది. నీటిలో అలలు వేగంగాకదలడం మొదలుపెట్టాయి. అప్పుడు వెంటనే అతిఉత్సాహంతో పొంగిపోతూ పెర్చ

చేపలు అన్నీ నీటిపై ఎగిరిగంతులు వేశాయి. నీటిపైన ప్రాగ్వం కంటె ఎత్తుగా ఎగిరిపడి మునుగుతూ మళ్ళీ పైకివస్తున్నాయవి. డిసెంబరు నెలలో అన్నిరోజులు గడిచాక అప్పుడు వర్షంకురిసే ఛాయలు కన్పించాయి. నీటి ఉపరిభాగంపైన అక్కడక్కడ ఎత్తుపల్లాలు ఏర్పడ్డాయి. దాన్నిబట్టీ అదీకాక మంచు కురవడం ఎక్కువకావడాన్నిబట్టీ వెంటనే పెద్దవాన కురవబోతున్నదని అంచనా వేస్తూ, చుక్కానిదగ్గరకువెళ్ళి త్వరత్వరగా తెడ్డు వేస్తూ ఇంటిముఖం పట్టాను. నా ముఖంపై నీటితుప్పర పడక పోయినా అప్పుడే చినుకులు పడుతున్నాయా అనిపించింది. ఇంటికి పోయేసరికి పూర్తిగా తడిసి ముద్దయిపోగలనని భయ పడ్డాను. కాని అంతలో నీటి ఉపరిభాగాన ఏర్పడ్డ ఎత్తుపల్లాలు మాయమయ్యాయి. నీటితుప్పర ఆగిపోయింది. ఎందువల్లంటే ఈ అల్లరంతా ఆ పెర్చ్‌చేపలు చేసిందే. తెడ్డు వేయడంవలన అయిన చప్పుడూ, అదీ విని, అవన్నీ ఒక్కసారి మునిగి లోప లకు పోయి ఎక్కడివక్కడ దాక్కొన్నాయి. నా బోటు ఉన్న చోటనే కాకుండా ఇతరచోట్లకూడా అవి లోపలకుపోవడం నేను గమనించాను, ఆపూట వర్షమూ లేదు; ఏమీ లేదు. "ఇవి భలే చమత్కారం చేశాయే" అనుకొంటూ ఆపూట మధ్యాహ్నం అంతా ఇంట్లోనే ఉండిపొయ్యాను.

నేను వాల్డన్‌దగ్గర నివాసమేర్పరచుకొని ఉంటూఉన్నప్పుడు పడవ నడుపుతూ ఆ సరోవరంలో విహరిస్తూ గంటలకొద్దీ కాలం హాయిగా గడిపాను. అట్లా గడిపిన కాలమంతా వృథా అయిందని ఎన్నడూ విచారపడలేదు. పడనుకూడాను. నేను డబ్బు విషయంలో భాగ్యవంతుణ్ని కాకపోవచ్చు. కాని

కాలంవిషయంలో నేను భాగ్యవంతుణ్నే. అలా స్వేచ్ఛగా, సుఖంగా, నిస్సంకోచంగా గడపడానికి నాకు వ్యవధి చాలా ఉన్నది. రోజులో అత్యంతము విలువైనకాలాన్నే నేను అలా అందుకని వ్యయపరిచి ఆనందించాను. అయ్యో! ఆకాలంఅంతా ఏ కర్మాగారంలోనో, ఏబళ్లోనో పనిచేస్తూ గడపకపోయ్యానా అని నేను పునరాలోచనలో పడలేదెన్నడూ. నే నా సరోవర తీరాన్ని విడిచిపెట్టిన తర్వాత కట్టెలుకొట్టేవాళ్ళు కొంతమంది అక్కడఉన్న చెట్లు చాలా కొట్టివేశారు. ఇంక కొంతకాలంపోతే చెట్లనూ, కొమ్మలనూ రెమ్మలనూ రాసుకొంటూ వాయువు తన స్వేచ్ఛావిహారం మానేస్తుందేమో! ముందుముందు అక్కడ మనకు "గాలిపాట" వినిపించదేమో! ఇట్టి నాఊహ తుమార్వామైందేనని మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే-అవి విహారించే ఉద్యానవనాలను అన్నింటినీ నిర్దాక్షిణ్యంగా కొట్టి వేస్తుంటే-పక్షులు పాటలు పాడతాయని మన మెలాఆశిస్తామండీ!

ఆ రోజులు వేరు. ఆ సౌందర్యతృష్ణ వేరు. ఆ చెరువు చుట్టూ దట్టంగా పెరిగిన ఆచెట్లూ, నీళ్ళఅడుగున పడిఉండే పెద్దపెద్ద దుంగలూ, అవన్నీ పోయాయి. అసలూ ఆ ప్రదేశానికి వెళ్ళి ఆ చెరువును కళ్ళారా తనివితీరచూచి, ఆనీరు దోసిళ్ళతో త్రాగాలనో, అందులో స్నానం చెయ్యాలనో అనుకోవడంలేదు ఈనాటి జనం. కాసినినీరు ఆ చెరువులోని-పవిత్ర 'గంగాజలం' కొంచెమైనా ఇంటికి తెచ్చుకొని భద్ర పరచుకొందామని అయినా అనుకోవడంలేదు వీళ్ళు. పైగా ఆ పవిత్ర గంగాజలాన్ని పంపుల ద్వారా తమ తమ ఇళ్ళవద్దకు తెప్పించుకొని కొళాయి తిప్పంగానే నీరు నేరుగా నోటికి

అందాలని పెద్ద పథకాలు, అంచనాలు వేస్తున్నారు. అతి తెలివి పోయి నన్నాగాలు పన్నుతున్నారు. ఆ చుట్టుపట్ల ఉన్న మనుష్యుల ఆలోచనలు ఇల్లా ఉన్నాయి. వాళ్ళకు ఆ సరోవర దివ్యసౌందర్యం సంగతి అల్లా ఉంచండి. ముందు అది ఎక్కడ ఉన్నదో కూడా తెలియదు కదా! పిచ్చి ఎంత అరసికులండీ! దాని ప్రక్కగా అల్లా ఒక్కసారి కారులో వెళ్ళినా చాలు ఇక ఆ దృశ్యం మరుపురాదే! మరచిపోదామని గట్టిగా అనుకొన్నా ఇల్లా మరవడం ఎవరికీ సాధ్యంకాదే!

నేను ఎరిగిఉన్న పాత్రల అన్నింటిలోకీ వాల్డన్ ఉత్తమ శ్రేణికి చెందినది. తన పావిత్ర్యాన్ని నిలుపుకొనే వాటిల్లో అది అగ్రతాంబూలం అందుకొంటుంది. అనేకనుంది గంగతో పోల్చబడడం జరిగింది - ఆ వాల్డన్ అంత పవిత్రమురా అని ఎంతోమందిని పోల్చి చెప్పడం జరిగింది. కాని నిజానికి వారిలో బహుకొద్దిమందికి తప్ప ఆ గౌరవం దక్కదు. మొట్టమొదటగా చెట్లు నరికేవాళ్లువచ్చి ఆ సరోవరతీరాన మకాంపెట్టి అక్కడ చాలా చెట్లు నరికివేశారు. ఆ తర్వాత ఐరిష్‌వారు ఐర్లాండు దేశస్థులు తత్సమీపంలో చిన్నచిన్న ఇండ్లు కట్టుకొన్నారు. దాని సరిహద్దును అతిక్రమిస్తూ రైలుమార్గం వేశారు. మరి కొందరు మంచుగడ్డలకోసమని ఆ చెరువు అంతా తవ్విపోశారు. ఆ మంచుగడ్డలతో పెద్ద వ్యాపారంచేశారు. కాని ఎన్ని చేసినా అది ఏమాత్రమూ మారలేదు. నాకు, నా చిన్నతనంలో ఏ స్వచ్ఛజలాలు దర్శనంఇచ్చి ఆనందపారవశ్యం కలిగించాయో అవే ఇప్పుడూ కన్పిస్తున్నాయి. వచ్చిన మార్పంతా నాలో వచ్చింది. ఇన్నిఏండ్లు గడిచినా ఇన్నేళ్ళగా ఎన్నో వేల

అలలూ, ఎన్నో కలతలూ వచ్చిపోయినా, కలిగినా, ఆ సరో వర కాంత యొక్క శరీరంపై ఎక్కడా ఒక్క ముడత (ముసలితనాన్ని సూచించేది) అన్నది ఏర్పడలేదు. ఈమె శాశ్వతంగా యౌవనవతియై ఉండిపోయింది. అవును మరి దేవకన్యలకు వయసు మళ్ళడం అనేది సంభవించలేదుకదా!

*　　　　*　　　　*

ఆ దారిన వెళ్లే కార్లూ అవీ అక్కడ ఆగవు కాని ఇంజ నీర్లు, ఫైర్‌మన్, బ్రేక్‌మన్ మొదలగు పనివాళ్లు వాళ్లేకాక సీజను టిక్కెట్లమీద ఆ దారిన తరచు వెళ్లే ప్రయాణీకులూ, వీళ్ళు కూడా ఆ దృశ్యం చూడతగినవారే ననిపిస్తుంది. ఆ కారు నడిపే ఇంజనీరు ఇంటికి వెళ్లిన తర్వాత తప్పనిసరిగా ప్రశాం తత, పవిత్రత అలముకొన్న ఆ వాతావరణాన్ని – ఆ ప్రదే శాన్ని రోజులో కనీసం ఒక్కసారైనా చూచాను గదా అని అనుకుంటాడు. ఆ దృశ్యం ఆ రాత్రికి జ్ఞాపకం చేసుకోక తప్పదతనికి. అతని ప్రవృత్తి అల్లా జ్ఞాపకంచేసుకోకుండా ఉండ నివ్వదు. అల్లా ఒక్కసారి చూచినా చాలును స్టేట్‌స్ట్రీటునూ (రాజవీధిని) ఇంజను యొక్క మసినీ తన దృష్టిపథంనుండి తొలగించుకోడానికి ఆమాలిన్యాన్నంతా తుడిచివేసుకోడానికి ఉపయోగిస్తుంది. దీన్ని "భగవంతుడిచ్చినవరము" అని పిలవా లని సూచించా డాకాయన.

*　　　　*　　　　*　　　　*

ఈ చెరువులోకి నీరు వచ్చేందుకుగానీ, ఈ చెరువులో నుండి నీరు బయటకు పోయేందుకుగానీ ఏవిధమైన మార్గాలూ

లేవని నేనే క్రిందటి అధ్యాయాలలో ఒకచోట చెప్పాను. కాని బహుజాగ్రత్తగా పరిశీలించినమీదట ఇలా చెప్పవచ్చునని పిస్తున్నది. ఈ చెరువుకు ఎగువున ఎత్తుగా ఉన్న ప్రాంతంలో కున్న ఫ్లింటు చెరువుకూ, దీనికీ సంబంధం ఉన్నది. దానికీ దీనికీ మధ్య చిన్నచిన్నవి చాలా చెరువులు ఉన్నాయి. అలాగే వాల్డన్ చెరువుకు దిగువన పల్లపు ప్రాంతాలలో ప్రవహిస్తున్న కంకార్డు నదిదాకా చిన్నచిన్న చెరువులు అనేకం ఉన్నాయి. పూర్వం ఎప్పుడో కొన్నివందలు, లేక వేలసంవత్సరాలకు పూర్వం ఒకప్పుడు ఎగువున ఉన్న ఫ్లింటు చెరువునుండి వాల్డన్‌లోకి, ఆ తర్వాత అక్కడనుండి కంకార్డునదిలోకీ నీరు ప్రవహించి ఉంటుంది. మళ్ళీ ఇప్పుడుకూడా వీటిని కలుపుతూ ఒక కాల్వ లాంటిది త్రవ్వితే—(పాపం శమించుగాక!) అలాగే పూర్వంలా నీరు పైనుండి క్రిందకు ప్రవహిస్తుంది. మన అదృష్టవశాన ఈ వాల్డన్ వాటి అన్నింటినుండీ విడిపోయింది. ఒక ఋషిలాగా ఏకాంతంగా తపస్సుచేసుకొంటూ ఉండిపోయి స్వచ్ఛమై, అత్యంతము పవిత్రమై అవతరించిన ఈ వాల్డన్ చెరువులోకి ఆ ఫ్లింటులోని నీటి నెందుకు ప్రవహింపచెయ్యాలి? ఆ తర్వాత ఈ నీళ్ళన్నీ కలిసి సముద్రంలోకి ఎందుకు కలవనివ్వాలి? ఆ స్వచ్ఛజలాల అపూర్వ మాధుర్యాన్నంతా అల్లా వ్యర్థ పరుస్తామా ? !

♦ ♦ ♦

వాల్డన్‌కు తూర్పుగా మైలుదూరంలో లింకాలన్‌లో ఉన్న ఫ్లింటు లేక సాండీపాండు అన్నది మన ప్రాంతాలలో

ఉన్న అన్నింటిలోకీ అతి విశాలతమమైనది. భూమి మధ్య భాగంలో ఉన్న సముద్రం అది. దాని విస్తీర్ణం నూటతొంభై ఏడు ఎకరాలు. అందులో చేపలు చాలా విస్తారంగా లభిస్తాయి. ఆ నీరు అంత స్వచ్ఛంగా ఉండదు. దానిచుట్టూఉన్న అడవుల్లోకి నేను అప్పుడప్పుడు వినోదంకోసం వెళ్ళివస్తుండేవాణ్ణి. సముద్రతరంగాల్లాగా పరుగులిడుతూ వచ్చే ఆ అలలూ, చెంపలను తాకుతూ విసురుగా వీచే ఆ గాలీ, అక్కడి నావికుల జీవితమూ తరచు జ్ఞాపకంచేసుకోతగిన విషయాలే. ఒకసారి ఆ అడవిలోకి, ఈదురుగాలి కొడుతున్న మధ్యాహ్నసమయంలో, సీమబాదంకాయలు కోసుకొందామని వెళ్ళాను. అవి చెట్ల నుండి రాలిపడి కుప్పలుకుప్పలుగా ఆ చెరువులో అలలమీద తేలుతున్నాయి. ఆ అలలు వాటిని ఒడ్డుకు నెట్టివేస్తున్నాయి. ఒడ్డున నడిచిపోతూంటే అవన్నీ నాపాదాలదగ్గరకు వస్తున్నాయి. ఈ చెరువుయొక్క ఉత్తరపుతీరమంటే నాకెంతో ఇష్టం. ఆ తీరమంతా ఇసుకపరచి నట్లుంటుంది. ఆ ఇసుకమీద ఆ చెరువునీటి అలలు బలమైన ముద్రలువేశాయి. ఆ ఇసుకపై ఏర్పడిన అలలు ఎప్పుడూ చెరగకుండా కన్పిస్తుంటాయి. ఆ అలలమధ్య ఏర్పడ్డ చాళ్ళల్లో చిన్నమొక్కలూ అవీ వరుసవరుసలుగా పెరిగాయి. వాటి నల్లా వరుసలు వరుసలుగా ఆ తరగకన్యలే నాటివెళ్ళారా అనిపిస్తుంది. నాచుకు సంబంధించిన ఒకరకం నీటిమొక్కలు గుండ్రంగా గడ్డిబయల్లా నీటిపై తేలుతూ ఒడ్డుకు కొట్టుకొనివచ్చి కొంతసేపు ఇసుకమీద నిలచి మళ్ళీ అంతలో నీటిఅలలతో పాటు లోపలికి పోతూఉంటాయి. అవి ఎల్లా ఏర్పడ్డయ్యా అని ఆశ్చర్యం కలుగుతుంది. సముద్రపుఒడ్డున తరంగాల తాకిడివల్ల

ఏర్పడే గుండ్రని గులకరాళ్ళలా నీటిలో మరీ చిన్నవి కన్పిస్తాయి. మొట్టమొదట చూచినప్పుడు ఇవన్నీ గులకరాళ్ళలా అలల మూలకంగానే ఏర్పడ్డాయి అని అనిపిస్తుంది. కాని జాగ్రత్తగా ఆలోచించినమీదట అది వాటిపని కాదనే తెలియవస్తుంది. పైగా సాధారణంగా నీటి అలల స్వభావము ఉన్న స్వరూపాలను అంగతీయడమే కాని క్రొత్తగా సృష్టిచేయడంకాదు. నీరుతగ్గి, ఒడ్డునుచేరి అవి ఎండి చాలాకాలందాకా వాటి సహజ స్వరూపాన్ని నిలబెట్టుకొంటాయి.

* * *

ఫ్లింట్‌పాండు – ఫ్లింట్ చెరువు! ఇదేంపేరండీ! ప్రత్యేకంగా ఆయా శాస్త్రాలలో శాస్త్రార్థాన్ని సరిగా సూచించే పదాలను ప్రయోగించాలి. ఈ పేరునుబట్టి అల్లా ప్రయోగించే విషయంలో మనకెంత పదదారిద్ర్యం ఏర్పడిందో తెలుస్తున్నది. ఎవరో ఒక రైతు దాని తీరంలో ఇల్లు కట్టుకొన్నాడనా, అతని పొలాలు ఈ ఆకాశ జలపుటంచులను తాకుతూ ఉన్నాయా – ఉంటే! ఉన్నంతమాత్రంచేత అపరిశుభ్రంగా మడ్డిగా కన్పించే ఆ వెఱ్ఱివెంగళప్ప – ఆ వెఱ్ఱిరైతుపేరు దీనికి పెట్టేస్తారా! అల్లా పిలిపించుకోడానికి అతని కేం అధికారమున్నదీ! ఆ ఓ డాలరు నాణెమో, లేక ఒక సెంటు నాణెమో చూచి తెగ మురిసిపోతూ కాస్త తెల్లగా మెరుస్తున్న దాన్లోనో తన సిగ్గూ ఎగ్గూలేని ముఖాన్ని చూచుకొని సంతోషపడుతుంటాడతను. ఆ చెరువులో స్థిరనివాస మేర్పరచుకొన్న అడవి బాతులను హద్దుమీరి నడచినవిగా, పరాయివానిగా పరిగణించే స్వభావం కలవాడతను. వృత్తి పరికరాలనూ వాటినీ విస్తారంగా వాడుతూ

ఉండడంచేతా, ప్రొద్దస్తమానం డబ్బుకోసం ఆశపడుతూ పని చేస్తుండడంచేతా అతని వేళ్ళు బండపారిపొయ్యాయి. అదుగో అతని పేరు వచ్చింది చెరువుకు. ఏనాడూ ఈ సరోవరాన్ని దర్శించని, ఏనాడూ ఇందులో స్నానం చెయ్యని, ఏనాడూ దీన్ని మనసారా ప్రేమించని, దీన్ని కాపాడని, కనీసం దీన్ని గురించి ఒక్క మంచిమాట మాట్లాడని, ఇంత ఉత్తమమైన వస్తువును రూపొందించి ప్రపంచానికి అందించిన భగవంతునకు ధన్యవాదాలైన అర్పించని, అతగాణ్ని చూడడానికిగానీ, అతగాణ్ని గురించి వినడానికిగానీ నేను ఇష్టపడను. అంతకంటె అందరి మనస్సులనూ ఆకర్షిస్తూ ఆ నీళ్ళల్లో ఈదులాడే చిన్ని చేపల పేరు దీనికి పెట్టినా, కాదూ అంటే ఈ సరోవర దర్శనార్థం ఇక్కడకు తరచువచ్చే అడవి పక్షులపేరు పెట్టినా, అదీ కాదను కొంటే ఆ సరోవరతీరాల స్వేచ్ఛగా మనోహరంగా పెల్లి విరిసే పూలపేరు పెట్టినా లేదా ఆ సరోవరతీరాన్న మొట్ట మొదటగా నడిచివెళ్ళిన ఏ ఆటవికుని లేక ఏ బాలకుని పేరో (అందులోనూ అతని జీవిత చరిత్రతో ఈ సరోవరచరిత్ర అల్లుకొనిపోయి ఉన్నప్పుడు) పెట్టినా ఎంతో బాగుండిపొయ్యేది; ఎంతో సంతోషించేవాణ్ని అల్లా జరిగిఉంటే. అల్లాకాక అతని పేరా పెట్టడం! అందుకు అతనే తగిన కారణం చూపుకోలేడు– ఏ శాసనమో, ఏ పొరుగువాడో అలా పిలవమని అనడం మినహాయిస్తే మరో హేతువే కనిపించదు. కేవలం దాని తాలూకు డబ్బు విలువను గురించి మాత్రం ఆలోచించే అతని పేరు, ఆ చుట్టుపట్ల ఉన్న భూమి, అడవీ అంతా కొల్లగొట్టిన, వీలుగా ఉంటే ఆ నీరంతా కాజేసే, ఇంకా ఏమాత్రం అవ

కాశం ఉన్నా ఆ నీటి అడుగున ఉండే బంకమట్టికోసం ఆ చెరువు నీరంతా ఇంజన్లుపెట్టి తోడించివేసి ఆ చెరువు చెరువంతా ఎవరికైనా అమ్మివేసే - అతనిపేరా ఆ చెరువుకు పెట్టడం! అతనికి డబ్బేగదా ప్రధానం! పిలుంటే ఆ మనోహర ప్రకృతిని - ప్రకృతి దృశ్యాన్ని - ఆ దేశాను తన పూజా మందిరంలో ఉన్న దేవుణ్ణికూడా ఎత్తుకొనివెళ్ళి సంతలోపెట్టి అమ్మివేస్తా నతను. అతని పొలాల్లోనూ, అతని తోటల్లోనూ, పండేవి, పూచేవి, కాసేవి, ధాన్యమూ, కాయలూ, పళ్ళూ కావు. డాలర్లు. డాలర్లు. అతని దృష్టి అంతా డాలర్లమీదనే! అతని బ్రతుకంతా డాలర్లకోసమే. ఎంత అన్యాయమండీ! అటు వంటి మనిషిపేరు ఈ చెరువుకు తగిలించడం! పవిత్ర దేవాలయ ప్రాంగణంలో, శిల్పాకారాల మధ్య ఉన్న ఆ కాస్త - ఎంతో బంగారుకుండలు పండించేసి డబ్బు చేసుకోవాలని [illegible] వేస్తున్న ఈరకం మనుష్యులపేర్లు సరోవరాలకు పెట్టి [illegible]చేసి కండీ! వద్దు, వద్దు అలా చెయ్యకండి. ప్రకృతిలో అతి మనోహరమైన, అతి సుందరమైన ఇల్లాంటివాటికి మనుష్యుల పేర్లు పెట్టాలంటే - వాళ్ళ పేరున ఇవి పిలువబడాలి అంటే ముందు వాళ్ళను అత్యుత్తములుగా, ఇతరు లందరికంటె గొప్ప మేధాసంపన్నులుగా పేరెన్నిక గలవారుగా - అత్యంతము 'విలువైన'వారుగా తయారు కానియ్యండి. ఐక్రేనియన్ సముద్ర తీరంవంక చూడండి. ఆ ప్రశాంతమైన తీరం అతి సాహసంతో కూడిన ఏదో ప్రయత్నానికి ప్రోత్సాహం కలుగచేస్తుంటుంది. అట్టి ప్రోత్సాహపు పలుకు లేవో అక్కడ ప్రతిధ్వనిస్తుంటాయి.

కనీసం అల్లాగా నిజమైన, స్వచ్ఛమైన పేర్లు పెట్టుకొందాం మన సరోవరాలకు.



ఫ్లింటు చెరువుకు వెళ్లేదారిలోనే చిన్నదిగా కన్పించే గూస్ పాండు. నైరుతి దిక్కుగా మైలుదూరం వెళితే ఓడెబ్భై ఎకరాలకు వ్యాపించివున్న "ఫెయిర్ హేవెన్" సరోవరం వస్తుంది. అక్కణ్ణించి మైలున్నర దూరంవెళ్ళితే నలభై ఎకరాల మేర ఆక్రమించిన "వైట్ పాండు" వస్తుంది. ఇదీ నాసరోవరాల దేశం. ఇవి, వీటితోపాటు కంకార్డునదీ నాకు నిరంతరం ఆనం దాన్ని అందించే సాధనాలు. రాత్రీ పగలూ, దినదినము, ప్రతి సంవత్సరమూ నాకు ఆనందహేతువులై నిత్యనూతనంగా అలరారు తున్నాయి. ఈ సరోవరాలూ – ఈ నదిన్నీ.

వాల్డన్ తర్వాత చెప్పుకోతగింది "వైట్ పాండు." వాల్డన్ చెరువు అన్నింటిలోకి సుందరమైనది కాకపోతే కాకపో వచ్చుగాని అది అత్యంతము ఆకర్షించే చెరువు. వైట్ పాండు అన్నది ఒక రత్నం – దానికి – అందులో కన్పించే స్వచ్ఛజలాల మూలకంగానో లేక అందులోని ఇసుకకుండే రంగుకారణం గానో ఆపేరువచ్చింది. వాల్డనూ, వైట్ పాండూ ఇవి రెండూ కవల పిల్లలా అనిపిస్తుంది. ఈ రెండింటి తీరాలనూ, ఈ రెండింటిలోని నీటినీ పరిశీలించిచూస్తే ఇవిరెండూ తప్పకుండా కవలలేననీ, ఈ రెండింటికీ క్రిందుగా భూమిలోగుండా ఏదో మార్గంఉండి సన్నిహిత సంబంధం ఉన్నదనీ చెప్పాలని అనిపి స్తుంది. నేను అక్కడికి తరచువెళ్ళి వస్తుండేవాణ్ణి. వెళ్ళినప్పు

డల్లా బుట్టలకొద్దీ ఇసుక తెచ్చుకొని వస్తువులకు మెరుగు పెట్టుకునేందుకు ఉపయోగపడే గరుకు కాగితాలు తయారు చేసుకొనేవాణ్ణి.

వాల్డన్ పాండూ, వైట్ పాండూ ఈ రెండు చెరువులూ ఈ ప్రపంచంలో ముఖ్యంగా అత్యంత ప్రధానంగా కన్పించే రెండు స్వచ్ఛమైన, విశాలమైన స్ఫటికాలు. అవి కాంతికోణాల నిలయాలు. కాదు అవి ఉజ్వలజ్యోతిస్సరోవరాలు. నిత్యనూతన మనోహర సరోవరాలవి. వాటినే గనుక శాశ్వతంగా గడ్డకట్టుకొనేటట్లు చేసి, అందులోనూ వాటిని చేతికి చిక్కేలాగున చిన్నవిగా చేయగలిగే ఉన్నట్లయితే - వాటిని ఏ బానిసలో ఎత్తుకొనిపోయి ఎంతో ధరకు అమ్ముకునేవాళ్ళు. వాటిని ఏ మహాచక్రవర్తో కిరీటపురాళ్ళుగా అలంకరించుకొనేవాడు. కాని అలా కాక, ద్రవరూపంలో పెద్దవిగా చక్కగా, సర్వహృదయాలనూ ఆకర్షిస్తూ మన అందరి అందుబాటులోనూ ఉండి శాశ్వతంగా మనకూ మనతర్వాత తరాలవారికీ చిరాస్థిలా నిలచిపోయేసరికి మనమేమో దాన్ని లెక్కచేయడంలేదు. దాన్ని చిన్నచూపు చూస్తున్నాము. ఒకవంక ప్రకృతి అందించిన దాన్ని చిన్నచూపుచూస్తూ వేరొకవంక కోహినూరు వజ్రం కోసం అఱ్ఱులు సాస్తున్నాం. జాగ్రత్తగా ఆలోచించిచూస్తే నిశితంగా పరిశీలిస్తే ఆ వజ్రంకంటె ఈ వాల్డన్ సరోవరం ఎంత విలువైనదో అవగతమవుతుంది. అప్పుడు ఆవజ్రంకోసం అలా ఆత్రపడడమూ, దానికోసం అలా పరుగులుపెట్టడమూ ఎంత వెఱ్ఱిబాగులతనమో తెలిసివస్తుంది. నిజంగా ఆ సరోవరాలు ఎంత స్వచ్ఛమైనవో! ఎంత పవిత్రమైనవో! వాటిలో ఎటువంటి

మాలిన్యమూ లేదు. ఒకవేళ ఏదైనా మాలిన్యం వచ్చి చేరినా అది ఎక్కువసేపు ఉండదు. అందులో లీనమై అదీ పవిత్రమైన దిగా మారిపోతుంది. వీటికి వయసుమీరి ముసలితనం రావడం అంటూ లేదు. వీటి విలువ ఇంతా అంతా కాదు. దాని విలువ కట్టలేము. వాటిలోని స్వచ్ఛజల బిందువులకు విడి విడిగా గానీ మొత్తంగా గానీ ఖరీదుకట్టగల షరాబు లేడు. బొగ్గు గనుల్లో అక్కడా బొగ్గులతో పాటు దొరికే సాధారణపు రాళ్ళ విలువలు కట్టే సామాన్యపు షరాబులకు సచ్ఛాకాశం నుండి జాలువారిన అమృతబిందువులను స్వీకరించి తనయందు నిలువ చేసుకొని నిరంతర ప్రయత్న ఫలితంగా వాటిని స్వచ్ఛతరం చేసి పవిత్రతనూ, సౌందర్యాన్నీ చేకూర్చి, రంగూ, రుచులను సమకూర్చి మనోహరంగా తయారయిన ఈ సరోవరాలకు నిఖార్సయిన విలువకట్టగల సామర్థ్యం ఉండదు. ఉండగలదని మనం ఆశించడం అనవసరం.

అవి మన సాధారణ మానవజీవితాలకంటె ఎంత సౌందర్యవంతములైనవో! ఎంత ప్రేమింప తగినవో! అవి మన సాధారణ "పాత్రల" కంటె మన శీలాలకంటె ఎంత స్వచ్ఛతరమైనవో! వాటినిగురించి ఏ ఒక్క అవగుణమూ మన మేనాడూ వినలేదు. అవగుణమంటూ ఒకటుంటేగదా మనం వినడానికి! మా కర్షకుల ఇళ్ళముందు ఉండే దారువుల్లో, మురికి నీటి గుంటల్లో మామూలు బాతులు తిరుగుతుంటాయి. కాని ఇక్కడో, ఈ సరోవరాల్లోనే స్వచ్ఛమైన శరీరకాంతితో శరత్కాల మేఘాలవంటి అచ్ఛమైన అందమైన అంచలు విహరిస్తాయి. అవును మరి ఇవి క్షీరసరోవరాలు గదా!

తన్ను నిండుహృదయంతో, నిష్కల్మషమైన మనస్సుతో అభినందించే మానవుడు ఒక్కడూ ప్రకృతికాంతకు లభించలేదు. అసలటువంటి మనిషి లేడుకూడాను. ఈ ప్రకృతిని పక్షులు తమతమ రెక్కలను విప్పి లాస్యంచేస్తూ, తమ మధుర గానంతో అభినందిస్తున్నాయి. పూవులను సంతోషపరుస్తున్నాయి. పువ్వులతో పక్షులు స్నేహంచేస్తున్నాయి. వాటికి అత్యంతము సన్నిహితమవుతూ కొసకు వాటితో తాదాత్మ్యాన్ని చెందుతున్నాయి. కాని యువకలోకానికి ఏదీ ఆ స్నేహభావం? వీళ్ళల్లో ఆ ఆర్ద్రమనస్కత కన్పించదేం? వాళ్ళంతా నివసిస్తూ ఉన్న మహానగరాలకు, ఈ వెఱ్ఱిమొఱ్ఱి నాగరికతా వరణానికిదూరంగా, వెఱ్ఱితలలు వేస్తున్న నవనాగరకతకు దూరదూరంగా ఒంటరిగా హాయిగా ఉంటున్నదీ ప్రకృతి కాంత. ఆమె అక్కడే దినదిన ప్రవర్ధమానమవుతూ వికసిస్తున్నది. అటువంటి ప్రకృతినే అభినందించలేనప్పుడు ఇక స్వర్గాన్నిగురించి మాట్లాడం సిగ్గుచేటు కాదూ!



## 8 గ్రంథపఠనము

ఏకాంతంగా కూర్చుని ఆలోచించుకోడానికే కాకుండా చక్కగా శ్రద్ధగా చదువుకోవడానికికూడా నా నివాసం ఒక విశ్వవిద్యాలయంకంటే ఎక్కువ అనుకూలంగా ఉండేది. నాకు ఏ సంచార గ్రంథాలయమూ అందుబాటులో లేకపోయినప్పటికీ మొదట ఏ చెట్ల బెరళ్ళమీదనో లిఖితమై క్రమంగా ఆధునికమైన మార్పులు వచ్చినపిదప కాగితాలపై ముద్రితమై ప్రపంచఖ్యాతిచెందిన గ్రంథాలతో నాకు మంచి పరిచయమేర్పడింది. హోమరు కవీంద్రుని – 'ఇలియడ్' కావ్యం మొదటిసంవత్సరం వేసవికాలమంతా నాబల్లమీద పడిఉంటూ వచ్చింది. ఎప్పుడో అక్కడొక పుట ఇక్కడొక పుట తిరగ వెయ్యడం తప్ప మరోటి జరగడానికి అవకాశం లేకపోయింది. అప్పటికి నాకు చేతినిండా పనిఉన్నది. ఇల్లు కట్టుకోవడం పూర్తి చేసుకొని, పొలం దున్ని ఆహారంకోసం పాదులుపెట్టుకోవాల్సి వచ్చింది. అందువలన అప్పుడు ఎక్కువ చదవలేక పోయ్యాను. కాని ముందుముందు అటువంటివి చదువుదామన్న కోరిక మాత్రం నాలో గాఢతరమైంది అప్పటికే. పనిపాటలు చేసుకొంటూ మధ్యమధ్య లభ్యమయ్యే విశ్రాంతిసమయాలలో చవకబారు పుస్తకాలు – నవలలూ, రైళ్ళల్లో కాలక్షేపానికని అమ్మే చెత్తపుస్తకాలు కొన్ని వరుసబెట్టి చదివేశాను. అవన్నీ

చదివి చివరకు నేనే సిగ్గుపడ్డాను. ఇంతదూరంవచ్చింది ఈ చిత్త పుస్తకాలు చదవడంకోసమేనా అని పలుమార్లు ప్రశ్నించుకొన్నాను.

గ్రీకుభాషలో వెలువడిన ఉత్తమగ్రంథాలను హోమరు-ఎస్కిలస్ కవివర్యుల గ్రంథాలను ఏవిధమైన కష్టమూ, విసుగూ లేకుండా పఠించవచ్చును. అల్లా చదవడంమూలంగా మన మానసిక శక్తి ఎంతమాత్రం వృధాకాదు. వాటివలన పవిత్రమైన విషయాసక్తి రేకెత్తును. పైపెచ్చు అవి మనకు ఉత్తమ మానసిక స్థితిని కలుగచేస్తాయి. ప్రాతఃసమయాల్లో వాటిని పఠిస్తే మనం పవిత్రులమవుతాము. వాటిల్లో చిత్రించిన వీరులను మనం అనుకరించాలని ప్రయత్నించేస్తాం. కనీసం ఊహాల్లోనైనా - అటువంటి మంచిఆలోచనలకు పునాదులయినా పడతాయి. అభిరుచులు ఏర్పడతాయి. అటువంటి గొప్ప పుస్తకాలను మనభాషలోనికి అనువదించి ముద్రించినా - ఉత్తమ నీతినియమాలూ, సత్సంప్రదాయాలూ కోల్పోయిన ఈనాటి లోకానికి అవి సరిపడవు. రుచించవు, అర్థంకావు. ఆ గ్రంథాలను చదివేటప్పుడు మనం ప్రతీవాక్యాన్నీ ఎంతో శ్రద్ధగా పరిశీలిస్తాము. ప్రతీమాటకూ అర్థాలుచూచుకొంటాం - ఏదో నిఘంటువులను తిరగవేసీ - పండితులను అడిగీ - ఆ మాటలు అర్థంచేసుకుంటాం. అంతేకాదు మనకున్న సామాన్యమైన విజ్ఞానమూ- సానుభూతి, సంస్కారమూ, వీటి సహాయంతో ఆ మాటలను ఎంతవరకు అర్థంచేసుకోగలమో ప్రయత్నించి చూస్తాము. మనకున్న పాండిత్యాన్ని, భావనాశక్తిని ఆ ప్రయ

త్నంలో వినియోగిస్తాము. అలా ప్రయత్నించి ఆయాపీఠుల చరిత్రలను, వారిశీలాలను ఊహించడానికి సిద్ధపడతాము.

నేడు ఇంతగా అభివృద్ధిచెందిన ముద్రణా యంత్రాలూ మొదలైనవాటి సహాయంతో ఎప్పటికప్పుడు ముద్రించే అనువాదాలు - బజ్జారు వంటి పుస్తకాలు వచ్చాయి. పూర్వపు రచయితల ఉత్తమ గ్రంథాలతో పరిచయమూ సాన్నిహిత్యమూ ఏర్పరచుకోవడానికి అవేవీ ఎంతమాత్రమూ తోడ్పడలేదు. మీదుమిక్కిలి వాటికే దూరమవుతున్నాంకూడా- అంటే అంతకంతకు ఆ గ్రంథాలను మనం చదవలేకుండాపోతున్నాం. ఆ అశక్తత మనలో ఏర్పడుతున్నది. ఆ భాషా మనకు తెలియడం లేదు. ఆ ఉన్నతభావాలనూ మనం అర్థంచేసుకోలేకుండా పోతున్నాం. ఆ గ్రంథాలు ఒంటరిగా ఎక్కడో ఏ మూలనో పడి మూలుగుతున్నాయి. యౌవనంలో విలువైన కాలాన్ని వెచ్చించి ఇవి చదవడంమూలంగా ప్రయోజనమే కలుగుతుంది. అవి ఆవిధంగా చదవతగినవే. ఆ భాషలో కనీసం కొన్ని స్వల్పమైన మాటలైనా వస్తేచాలు. అవి ఏదో అర్థాన్ని అందాన్ని స్ఫురింపచేసి నిరంతరమైన ఉత్సాహాన్ని ఆనందాన్ని కలుగచేస్తాయి. గ్రామస్థులు తాము విన్న గ్రీకు - లాటిను పదాలను జాగ్రత్తగా జ్ఞాపకంఉంచుకొని సంభాషణలలో మధ్యమధ్య వాటిని దొర్లిస్తూఉండడం కేవలం నిష్ప్రయోజనం కాదని గుర్తుంచుకోవాలి. అలాచేయడంలో ఆమాటల ఔన్నత్యాన్ని గుర్తించారనీ, ఆ భాషయందు మోజు ఆసక్తి కలిగిందనీ మనం అర్థంచేసుకోవాలి.

కొంతమంది ఈ పూర్వగ్రంథాలను ముందుముందు

ఎవ్వరూ నడవరనీ, అవి ముమ్ముందు విస్మృతాలై పోతాయనీ వాటి స్థానంలో ఆధునిక గ్రంధాలు సాధారణ కార్యాచరణలో ఉపయోగపడే నవీన శాస్త్ర గ్రంధాలు ప్రాధాన్యాన్ని వహిం చుతాయనీ అంటూఉంటారు. నిజమైనవిద్యార్థి ఆ యా గ్రంధాలలోని అర్థాలను కనిపెట్టాలనే యత్నిస్తుంటాడు. జీవిత సత్యాలను తెలుసుకోవాలని కుతూహలపడే బుద్ధిమంతుడు అవి ఏ భాషలోఉన్నా అవి పురాతనమైనవి అయినా, ఇతిహాసా లుగా - మహాకావ్యాలుగా - శ్రద్ధగా చదువుతాడు; ఆ ఇతిహాసాలలో మానవుని అత్యుత్తమమైన ఆలోచనలు, భావనలుమాత్రమే నిక్షిప్తమై ఉన్నాయి కనుక, మానవు అట్టి అవకాశమూ, వ్యవధీ లేకపోతే అత్యంత పురాతనమైన ఆ ప్రకృతిని పరిశీలించడం మానవచ్చును; కానీ గ్రంథపఠనం మాత్రం ఏనాడూ ఏపరిస్థితుల్లోనూ తుణమైనా విడువ కూడదు. అది అలా మానవలసింది కాదు.

బాగా చదవడమనేది - అంటే ఉత్తమ గ్రంధాలను (ఆ పేరును సార్థకంచేసుకొనే పుస్తకాలను) పఠించడం మంచి మానసిక పరిశ్రమ. పాఠకుణ్ణి మామూలు శరీరవ్యాయామంలో కంటె ఎక్కువ శ్రమపెడుతుంది. ఈ పరిశ్రమ ఆ యా బల శాలులు శ్రమపడినట్లుగానే ఈ విషయంలో మనమూ అంత క్రమశిక్షణతోనూ, అంత దృఢమైన వాంఛ, స్పష్టమైన లక్ష్యంతోనూ పని చేయ్యవలసే ఉన్నది. ఆ యా గ్రంథకర్తలు వాటిని ఎంత నెమ్మదిగా భావనచేసి వ్రాశారో - ఎంత విశాల దృక్పథంలో విస్తృతంగా వ్రాశారో మనమూ వాటినిగూర్చి అంత నెమ్మదిగా అంత విశాల దృక్పథంతో తరచి తరచు

చదవాలి. మళ్ళా ఇక్కడొక చమత్కారముంది. ఆ గ్రంథ కర్తలువ్రాసిన భాషను మనం నేర్చుకొని ఆ భాషలో మాట్లాడి వేయగల్గినంతమాత్రాన చాలదు. ఎందుకంటే ఆ మహానుభావులు జీవించిన దేశంలో ఆ కాలంలో అదే తమ మాతృభాషగా ఉన్న ఇతరప్రజలు వారి పుస్తకాలను చదివి అర్థంచేసుకోలేరు, — లేదుకూడా, కేవలం భాష వచ్చినంత మాత్రాన, అది వారి మాతృభాష అయినంతమాత్రాన అవి వారికి అర్థంకాలేదు. కారణమేమంటే అవి మాట్లాడుకొనే భాషలో సాధారణపదాల కూర్పులో వ్రాసినవి కావు. అతి ఉత్తమమూ, అతి ప్రశస్తమూ అయిన, మిక్కిలి అర్థవంతము లైన పదాలను ఏర్చికూర్చి వ్రాసిన గ్రంథాలవి. సామాన్య జనానికి తాము మాట్లాడేది మాతృభాష అయితే – ఈ గ్రంథాలను పితృభాషలో వ్రాశారు. అందువలన వాళ్ళా వాటిని అర్థంచేసుకోడానికి అధికమైన పరిశ్రమ చెయ్యవలసే వచ్చింది. కనుక మనమూ అంతే. నిజానికి కొన్నాళ్ళు ఆ గ్రంథాలు విస్మృతాలయినాయి. సాధారణమైన విలువలుగల సాహిత్యానికి అధిక ప్రాధాన్యం వచ్చింది కొన్నాళ్ళు మన దేశంలోనే కాదు చాలా పాశ్చాత్యదేశాలలో ఇదే జరిగింది. తర్వాత తర్వాత ఇవి మళ్ళీపైకివచ్చాయి. ఇలా ఉద్ధరించిన గ్రంథాలు తమ పూర్వవైభవాన్ని పూర్వపు ఔన్నత్యాన్ని మళ్ళా ఒకసారి లోకానికి బహువిధాల వెల్లడిచేశాయి. ఒకనాటి రోమను, గ్రీకు, దేశాల ప్రజాబాహుళ్యం ఏ ఉత్తమ విషయాలను విని, ఆనందించలేకపోయిందో — ఆ అదృష్టానికి నోచుకోలేకపోయిందో–ఆ విషయాలు కొన్ని శతాబ్దాల అనం

తరం పండితులు పఠించి ఆనందిస్తున్నారు. ఆ చదివేది కొద్ది మందే కావచ్చును. మరేం ప్రమాదంలేదు. నిజమే ఆ గ్రంథాలను కొద్దిమందే పఠించారు. మున్ముందుకూడా బహుశా కొద్దిమందే పఠిస్తారు. అయినా పర్వాలేదు. వాటి ఘనతకు ఏ మాత్రం లోటురాదు.

ఉపన్యాసాలను మన మంతగా మెచ్చుకో నవసరంలేదు. ఏదో ఆవేశప్రవాహంగులో ఉపన్యాసకుడు తన వాక్చాతుర్యాన్ని ప్రదర్శిస్తాడు. కొన్ని వందలమాటలు ప్రవాహంగా దొర్లిపోతాయి. ప్రవాహంలా పరుగులెత్తే ఉపన్యాసంతో గంటలు గడిచిపోతాయి. సభికులు వ్యామోహితులు కావచ్చును. ఉపన్యాసాల కంటే గ్రంథాలు ఉత్తమ మైనవి. ఆ వుపన్యాసాలలోని మాటలకంటే గ్రంథస్థమైన విషయాలు ఉత్తమమైనవి. నోటి మాటలకూ గ్రంథస్థమై ఇలా పదిలపడిన పదాలకూ చాలా వ్యత్యాసం ఉన్నది. మాట్లాడుకొనే భాష మబ్బులవంటి దైతే గ్రంథరచన ఆ మబ్బులవెనుక ఎత్తుగా అనేక నక్షత్రాలతో కూడిన ఆకాశంవంటిది. ఆ నక్షత్రాలు ఉత్తమ వాఙ్మయంలోని విశిష్టమైన పదాలవలే శాశ్వతంగా ఉంటాయి. నిత్యమూ కాంతి సుందరములై ఉంటాయి. అవి అక్కడే ఉన్నాయి. వాటిని దర్శించి అర్థంచేసుకొనే శక్తిమంతులు వాటిని దర్శింపవచ్చును. జోతిశ్శాస్త్రజ్ఞులు, పండితులు వాటిని సర్వదా దర్శిస్తూనే ఉంటారు. వాటిపై వ్యాఖ్యానాలు చేస్తూనే ఉంటారు. అవి అంత ఉత్తమమైనవి. అవి కొందరి మాటల్లాగా ఒట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కావు. అవి

శాశ్వతమైనవి. అచిరిగా మారి మాయమయ్యే వ్యవహారం లోని పదాలు కావవి. సార్వకాలీనత, విశ్వజనీనత తమలో ఇముడ్చుకొన్నవవి.

వేదికపై ఏది వాక్చాతుర్య మనిపించుకొంటుందో అదే గ్రంథరచనా విషయంలో అలంకార మనిపించు కొంటుంది. ఒకరు వేదికపై నిలబడి మాటలు త్వరత్వరగా దొర్లించే నేర్పు ప్రదర్శిస్తే మరొకరు పుస్తకాలు ముందువేసుకొని తమ గదిలో కూర్చుని ఆనేర్పునే మరోరూపంలో – అలంకార శాస్త్రజ్ఞతా ప్రదర్శనం చేస్తారు. ఉపన్యాసకుడు తాత్కాలికమైన ఒకానొక సందర్భానికి – ఒకానొక సంఘటనకు వశుడై తన ముందు ఉండే ప్రజానీకాన్ని ఉద్దేశించి మాట్లాడుతాడు; విని వెళ్ళే జనాన్ని ఉద్దేశించి మాట్లాడుతాడు. కానీ రచయిత విషయం వేరు. అతని ప్రశాంత జీవితమే ఒక సంఘటన. అతని ప్రశాంతమూ పవిత్రమూ అయిన జీవనమే ఒక మధుర సన్ని వేశం. సభలలో కూర్చునేజనుల గుంపులవైపుకు అతని మనస్సు పరుగెత్తదు. అది అటు మరలదు. అతడు వారిమూలంగా తాత్కాలికమైన ఉత్సాహాన్ని పొందడు. వారి పొగడ్తకు పొంగిపోడు! అతడు ప్రపంచంలోని సర్వకాలాలలోని సర్వ మానవ హృదయాలనూ, మనీషనూ ఉద్దేశించి మాట్లాడు తాడు; వ్రాస్తాడు. తాను చెప్పింది అర్థంచేసుకొనే వాళ్ళను ఉద్దేశించి వ్రాస్తాడతను.... ఇదుగో అంత వ్యత్యాసం ఉన్నది మామూలు ఉపన్యాసానికీ శాశ్వతంగా ఉండే గ్రంథరచనకు.

ప్రపంచాన్ని జయించాలని కుతూహలపడిన అలగ్జాం డరు మహాచక్రవర్తి విజయయాత్రలకు వెళ్ళినప్పుడల్లా తన

వెంట 'ఇలియడ్' కావ్యాన్ని రత్నఖచిత సువర్ణపేటికలో పెట్టుకొని భద్రంగా తీసుకొనివెళ్లేవాడు. ఈ గ్రంథరాజం అంటే ఆ చక్రవర్తికి అంతటి మక్కువ. ప్రపంచంలో పురావస్తు సముదాయంలో అన్నింటికంటె గ్రంథస్థమైన ఒక్కమాట అత్యుత్తమమైనది. అది మన జీవితాలకు సన్నిహితమైనది. ఏ ఇతర కళాసృష్టికంటే కూడా అది సార్వకాలీనమైనది. శాశ్వతమైనది. అది జీవితానికి అత్యంతమూ సన్నిహితమైన ఒక దివ్యకళాఖండము. దాన్ని మనం స్వీయభాషలోకి అనువదించుకోవచ్చును. అంతేకాదు దాని ద్వారా మనం ఈ భౌతికశరీరంతోనే ఒక దివ్యానుభూతిని పొందగలము. అది ఏకాన్వాసు గుడ్డపైనో కుంచెతో చిత్రించినది వంటిదికాదు— ఏ పాలరాతినో మలచి ఆకృతిని కల్పించినటువంటిదికాదు. అది కేవలం మనజీవితాన్నే — అనుభవాన్నే — మానవుని చైతన్యాన్నే మలచుకోవడం వంటిది.

రెండువేల ఏండ్లు గడచిపోయాయి. అన్నికోవి కాలాలూ, అన్నిశీతాకాలాలూ గడచిపోయ్యాయి. వాటి అన్నింటినీ తట్టుకుని నిలచినదా గ్రీకుసాహిత్యం. కాలం దాన్ని కబళించివెయ్యలేదు. దానికి కాలదోషం పట్టలేదు. దాని నిగ్గు చెడలేదు. ఆ గ్రంథాలు క్రమంగా సర్వదేశాలలోనూ ప్రచారమైనాయి. అవి ఎక్కడ ఉంటే అక్కడ ప్రశాంతమూ స్వర్గతుల్యమూ అయిన వాతావరణం ఏర్పడింది. ఇన్నివేల ఏండ్ల తర్వాత ఆ సాహిత్యం అన్నిదేశాలలోనూ, ప్రపంచంలో నలుదిక్కులలోనూ — సర్వేసర్వత్రా వసంత నవశోభా వైభవంతో, నిత్యనూతనకాంచన చంచద్ద్యుతితో అలరారుతున్నది.

ఉత్తమ గ్రంథాలే ప్రపంచానికి నిధినిక్షేపాలు. తరతరాలకూ, సమస్త జాతులకూ స్థిరాస్తి, పిత్రీయం ఆ గ్రంథాలే. ప్రతి పర్ణకుటీరంలోనూ, అలమరలలోనూ అతి పురాతన ఉత్తమ గ్రంథాలు ఉచిత స్థానాన్ని అలంకరించి ఉంటాయి. అవి 'అయ్యా! మమ్మ ఉండనీయండి' అని వాదించుకోవు. కాస్తంత ప్రపంచంజ్ఞానం కలవాడెవ్వడూ విజ్ఞానాన్ని అంద చేస్తున్న వాటిని కాదనడు. వాటిని పూజించక మానడు. ప్రతి మానవ సంఘంలోనూ, సహజమైన, పోనిరాకరించడానికి వీలు గాని, అనన్య భాగ్యసంపదలు ఆ యా ఉత్తమగ్రంథ రచయి తలే. వారే ఆ సంఘానికి గర్వంగా చెప్పుకొనతగిన సహజ వైభవం. ఆ సంఘానికి సర్వజనాంగీకృతమైన - ఎదురై వచ్చిన సిరి. అయ్యా - ఇంత ఎందుకూ. మానవకోటి యొక్క సిరి సంపదలంటే స్పష్టంగా వారే. విశాల ప్రదేశాలను పరిపాలిం చిన రాజరాజుల కంటే, సువిశాల మహాసామ్రాజ్యాధినేత లైన మహా చక్రవర్తులకంటే వారే ప్రపంచంపై అధికప్రభా వాన్ని ప్రసరింపజేశారు. ఆ ప్రభావం లోకంలో శాశ్వతంగా నిలచిపోయింది.

*  *  *

ఆ యా పూర్వగ్రంథాలను - ఆ యితిహాసాలను అవి మొట్టమొదటగా వ్రాసిన భాషలోనే చదవనివారికి - అంటే మాతృకలను చదవనివారికి ప్రపంచ మానవ కథాపరిజ్ఞానం లోపిస్తుందనే చెప్పుకోవాలి. అందువలన మూలగ్రంథాలనే పఠించాలి. నిజానికి వాటిని ఏ యితర ఆధునిక భాషల్లోనికీ

అనువదించలేదు. పూర్వీకులైన ఆ గ్రీకుల నాగరికతనే తరతరాలుగా అలవర్చుకొంటేతప్ప మరొకరికి - మరొక జాతివారికి అనువాదం సాధ్యంకాదు. హోమరు కవీంద్రుని కావ్యాలుకానీ, ఎస్కిలస్ మహాశయుని నాటకాలు కానీ, ప్రఖ్యాత రోమను రచయిత యొక్క 'ఏనియడ్' అనే ఇతిహాసం కానీ మన ఆంగ్ల భాషలో అసలు ముద్రితం కాలేదు. వాటిని అనువదించి మన భాషలో ముద్రించినట్లుగా మనమంతా అపోహపడుతుంటాము. ఒక్కసారి మాతృకలవంక చూడండి. అవి గ్రంథరాజాలో - ఎంత సున్నితమైన రచన! ఎంత ఉన్నతమైన రచనానైపుణి! ఎంత చక్కని శిల్పచాతురి! ఎంతటి ఉదాత్త కార్య నిర్మాణం! వానిలో ప్రభాతసమయంలో అగుపించే ప్రసన్నని సౌందర్యమే, మూర్తి కట్టినదా ఏమిటి!! లోకంలోని సర్వమాధుర్యాన్ని పోగుచేసి వారిలా మూటగట్టారా ఏమిటి!

వారు వారివారి జీవితాంతం శ్రమపడి, తమతమ జీవితాలను అందుకు అర్పించి అంతటి ఉత్తమ గ్రంథసృష్టి చేశారు. వారు అలాటి పవిత్ర కార్యనిర్వహణలో తమ జీవితకాలాన్ని గడిపారు. నేడు కొందరు ప్రబుద్ధులు గ్రీకు, లాటిను భాషలు మృత భాషలనీ - కనుక వాటిని మనం ఎంత త్వరగా మర్చిపోతే అంత ఉత్తమమనీ వాదిస్తున్నారు. వారికసలు ఆ యా గ్రంథాలతో పరిచయమే లేదుకదా! ఒకసారి పరిచయమై అర్థమయిన తర్వాతకదా, వాటిలోని లోతుపాతులు తెలిసిన తర్వాతకదా - అందులో ఏమీలేదు, మరచి పోవచ్చునని మనకు హితబోధ చెయ్యడానికి అవకాశం ఉండేది! వాటిని చదివి అర్థం చేసుకొని అభినందించడానికి కావలసిన పాండి

త్యమూ - ప్రతిభా అలవరచుకొన్న తర్వాత వారు (మీరూ) ఆమాట అన్నా తప్పులేదు. మనమీనాడు మహా కావ్యాలుగా, పురాణాలుగా ప్రఖ్యాతిగాంచిన ఉత్తమమైన పూర్వగ్రంథాల నన్నిటినీ శ్రద్ధగా పఠించాలి. ఆవిధంగా పఠించినప్పుడే - ఆ యుగమే స్వర్ణయుగం అవుతుంది. ఆ గ్రంథాలే కాదు అన్ని దేశాల మత గ్రంథాలనూ - హిందువులు అపౌరుషేయాలని పిలచే వేదాలనూ, పార్సీల జెంద్ అవెస్తానూ, సరే మన క్రైస్తవులలోని రెండు వర్గాలకు చెందిన బైబిలు గ్రంథాలనూ పఠించాలి.

ఆ యా మత గ్రంథాలతోపాటు హోమరు, డేంటీ, షేక్స్పియర్ లాంటి మహాకవుల గ్రంథాలనుకూడా ఆసక్తితో శ్రద్ధగా, రసపిపాసులమై పఠించాలి. అక్కడతో ఊరుకొంటే సరిపోదు. అల్లా పఠించి పఠించి, అత్యధికమైన పాండితిని సంపాదించి మన ప్రతిభ నుపయోగించి దానితో జోడించి వారితోపాటు - వారివలెనే మనమూ ఉత్తమ సాహిత్యసృష్టి ఉదాత్త గ్రంథరచన సాగించాలి. ప్రపంచ కళారంగంలో మన శక్తిసామర్థ్యాలను, మన ప్రతిభా వ్యుత్పత్తులను వాటికై అంకితం చెయ్యాలి. ప్రపంచానికి ఉత్తమ గ్రంథాలను అందివ్వాలి. అల్లా ప్రపంచంలోని ఉత్తమ గ్రంథాల సంఖ్యను పెంచాలి. అల్లాచేస్తూ ముందుకు వెళ్ళగలిగినప్పుడే మనం కైవల్య ధామానికి ప్రయాణంచేసే యాత్రికులం అవుతాము. అల్లా చేస్తూ పురోగమిస్తేనే అంతిమలక్ష్యానికి కొద్దికొద్దిగా దగ్గరకు చేరగల్గుతూ ఉంటాము.

అక్షరజ్ఞానం కల్గిన తర్వాత - ఇక అప్పటినుంచీ ఏది ఉత్తమమైనదో - ఏది సాహిత్యరంగంలో హిమాలయపు ఔన్నత్యాన్ని అందుకొన్నదో దాన్నల్లా చదువుతూఉండాలి. ఊరికే వచ్చిన అక్షరాలనే, వచ్చిన శబ్దాలనే మళ్ళీమళ్ళీ గుణించుకుంటూ కూర్చొనకూడదు. ప్రాచీన గ్రంథాలను పఠించాలి. ప్రాచీన మహాకవుల గ్రంథాలను ఉత్తమ [illegible] పేర్కొనడం ఏదో ఒకే ఒక కారణాన్ని ప్రరస్క[illegible] కాదు. అల్లా పేర్కొనడానికి అనేక కారణాలున్నాయి. వారి గ్రంథాలలో కొన్ని మాటలు సరాసరి హృదయాలు [illegible] హృదయాలలో స్థానం కలిగించుకొంటూాయి. అవి మనకు సంబంధించినట్లుగా కన్పిస్తాయి. అవి అల్లా పుంచండి. మరొక విశేషమున్నది. ఒక మహా మేధా సంపన్నునితో - ఆతని ఆలోచనలతో మంచి పరిచయం కలిగినప్పుడు కొందరిలో నవ చైతన్యంకలిగి-వారికది మేల్కొలుపు కావచ్చును. ఆ మహాత్ము లకు-ఆ మహాత్ముల హృదయాలకు సన్నిహితులం కాగలిగితే మన మానవచరిత్రలో ఒక నూతన శకారంభమే కావచ్చును.

పుస్తకాలే సృష్టి వైచిత్ర్యాన్ని విడమరచి చెప్పగల సామర్థ్యం కలవి. వాటివలన మనం క్రొత్త వైచిత్ర్యాలను కనుగొనగల్గుతాము. మనం నేడు అనుకోనైనా అనుకోని విష యాలు ఏనాడో వ్రాసిన ఏ గ్రంథంలోనో ఉంటున్నాయి. మనలను ఈనాడు గాబరాపెట్టి, కలతపరచి, అయోమయం చేస్తున్న అనుమానాలే వాళ్ళకూ కలిగాయి, అల్లాంటి ప్రశ్నలే వాళ్ళకూ వచ్చాయి. అల్లాంటి సమస్యలే ఆ మేధావులకూ ఎదురైనాయి. వారంతా తమ శక్తివంచన లేకుండా తమ

జీవిత సంపూర్ణానుభవాన్ని ఆధారంగా చేసుకొని ఆ అనుమా నాలు తీర్చారు ఆ ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు. ఆ సమస్యలను పరిష్కరించారు. మనమూ ఆ విజ్ఞానాన్ని ఆ ఫలి తాలను సంశోధించి ప్రయత్నించి అందుకోవచ్చును. అవి అందుబాటులో ఉన్నాయి. మనలో లోపించినదల్లా అది కావాలనే కాంక్ష. అలాటి కాంక్ష కలిగించుకొని, పెంచుకొని విజ్ఞానాన్ని అందుకొంటే మనకు విశాలదృష్టి కలుగుతుంది. హృదయ వైశాల్యం పెరుగుతుంది.

*　　　　*　　　　*

కాని ఈ విషయాలను ఈనాటిజనం ఎంతో నిర్లక్ష్యం చేస్తున్నారు. స్వల్ప విషయాలకై శ్రమను వ్యర్థపరుస్తూ వాటిలో మునిగిపోయి ఉత్తమ విషయాలను మరచిపోతున్నారు. మన సంస్కృతి ఇలాటి ఉన్నతపథాన్ని అందుకొన్నదని చెప్పటానికో డానికి ఈనాడు ఏం ఆవకాశం ఏర్పడిందీ? మన సంస్కృతి ఏం పెరిగిందీ అని మీరే ప్రశ్నించుకోండి ఒక్కసారి. ఇదుగో మన కంకార్డు నగరవాసులకేసి చూడండి – వాళ్ళంతా ఎలా సంచార గ్రంథాలయాలలో సులభంగా లభించే చెత్తపుస్తకా లన్నీ చదివి సంతృప్తి చెందుతున్నారో!

ఇక్కడ ప్రచారంలో ఒక పుస్తకమున్నది. దానిపేరు 'లిటిల్ రీడింగు' దాన్నిండా వెఱ్ఱికథలున్నాయి. ఆ పుస్తకం పిల్లలుమాత్రమే చదవడానికి అర్హమైనది నా దృష్టిలో. దాన్నే పిన్నలూ పెద్దలూ చదివి సంతృప్తిపడుతున్నారు. వాళ్ళ మనస్సులకు మేత వేస్తున్న దాపుస్తకమే. వాళ్లు అల్లాంటి

దాంతో విలువైన కాలాన్ని వ్యర్థం చేస్తున్నారు. ఇలా జరగడం ఒక్క సామాన్యుల విషయంలోనే కాదు. విశ్వవిద్యాలయ విద్యాభ్యాసంచేసి ముగించుకొని వచ్చాం - పెద్దపెద్ద డిగ్రీలు మోసుకొని వచ్చాం అని గర్వంగా చెప్పుకొంటూ తిరిగే వాళ్ళవిషయంలోనూ ఇదే జరుగుతున్నది. వాళ్ళకు...ప్రాచీన భాషలో ఉన్న గ్రంథాలసంగతి దేవుడెరుగు - ముందు కనీసం ఆంగ్ల భాషలో ఉన్న పూర్వ కావ్యాలతోనైనా పరిచయం ఉండడంలేదు. వారు నాదృష్టిలో నిరక్షరాస్యులకంటే ఏమాత్రమూ ఘనమైనవాళ్ళు కాదు. ముమ్మాటికీ కాదు. అసలు వాళ్ళకాదృష్టిలేదు. ఆ అభిరుచిలేదు. 'ప్లేటో' వంటి ఉత్తమ సాహిత్యపరుని తమ పొరుగున ఉన్న వారు మాట్లాడించరు.

అయ్యో! ప్లేటోమహాశయుని పేరు వినికూడా మీరు అతని రచన చదవకుండా ఉండడమా! సన్నిహితుడై ఉండగా అతన్ని దర్శించకపోవడమా! పొరుగున ఉంటేగా ఆ మేధా సంపన్నతను పరిశీలించకపోవడమా! ఎంత విచిత్రమండీ! ఎందుకండీ మన డిగ్రీలు; మన డాంబిక వేషాలు! కాస్త అక్షర జ్ఞానం కలిగి, పిల్లల పుస్తకాలవంటివేవో ఒకటి రెండు చదవంగానే సరా? పూర్వగ్రంథాల ఔన్నత్యాన్ని తెలుసుకోవడం ద్వారానైనా మనం మనపూర్వీకులంత గొప్పవాళ్ళం కావడానికి చేసే ప్రయత్నంలో వాళ్ళ ఔన్నత్యాన్ని గుర్తెరగడమన్నది మొదటిమెట్టు అవుతుంది. కాని మనమీనాడు ఆ ప్రయత్నమే చెయ్యడంలేదు. ఒక్క విషయం చూడండి - ఈరోజుల్లో ఏ మనిషికైనా సరే - వారూ వీరూ అని కాదు-

ఎటువంటి వ్యక్తికైనా అతను పోతున్న దారిలో ఒక చిన్న వెండినాణెం కన్పించిందే అనుకోండి, ఇక ఆ వ్యక్తి ఎంత శ్రమపడి అయినా కొంత హద్దుమీరి నడిచి అయినా దాన్ని ఏరుకొని రహస్యంగా భద్రపరచుకొని ముందుకు సాగిపోతాడు - ఒకసారి ముందు వెనుకలు చూచుకొని ఎవరూ తన్ను చూడలేదని నమ్ముతూ...అల్లా ఉన్నది స్థితి. ఇటొక్కసారి పరికించండి. మహామేధాసంపన్నులూ, మహోదారులూ అయిన మన పూర్వీకులు ముందుకాలాల వారికోసమై కూడా రచించి పొందుపరచి పోయిన గ్రంథాలలో సువర్ణాక్షర లక్షలు ఉన్నాయి. వాటిని తిలకించండి. వాటిని మనం నిర్భయంగా అందుకోవచ్చును. ఎందరు పుచ్చుకొన్నా తరగవవి. దురదృష్టవశాత్తు మన ఆలోచనాశక్తి సన్నగిల్లుతున్నది. ఆ విషయంలో మనం ఊహాపథాలలో ఉన్న స్థానాలకు ఎగురలేని చిన్న చిన్న పిట్టలమవుతున్నాము. అతి సాధారణపు విషయాలను మించి అదనంగా అధికంగా మన ఆలోచన సాగడం లేదు. ఏవో వార్తాపత్రికలు చదువుతూ, బొమ్మల పత్రికలు తిరగవేస్తూ, సంతృప్తి చెందుతున్నాం. అంటే మన ఆలోచనా శక్తి, మనబుద్ధినైశిత్యం అంతవరకే. ఆ కాస్తమేరకు మాత్రమే వినియోగమవుతున్నదన్నమాట.

అన్ని పుస్తకాలూ నిరుత్సాహకరంగా ఉండవు. వాటిల్లో కొన్నిమాటలు సరిగ్గా మనస్థితిని ఉద్దేశించి ఉంటాయి. వాటిని మనం చదివి, విని, సరిగ్గా అర్థంచేసుకొంటే అవి మనకు సూర్యోదయంకంటే, వసంతాగమనంకంటె ఎన్నోరెట్లు అధికంగా శ్రేయస్కరంగా ఉంటాయి. ఆనందాన్ని ఇస్తాయి. అవి

బహుశా మనకొరకై మనం నిత్యంచూచే వస్తువులకే ఒక క్రొత్తదనం కలిగించి వాటియందు మనకు క్రొత్త దృక్పథం ఏర్పరుస్తాయి. ఒక్కొక్కపుస్తకాన్ని చదవడంమూలంగా ఎంతమంది మనుష్యులు జీవితయాత్రలలో నూతన శకారంభమైనది! ఆయా పుస్తకాలన్నీ ఉన్నది మనకోసమే. అవి చదవడమే మిగిలిన కర్తవ్యం.

* * *

మనమంతా 19 వ. శతాబ్దానికి చెందినవారమనీ,అనేక విషయాల్లో, రంగాలలో ముందడుగు వేస్తూ పురోగమిస్తున్నామనీ గొప్పలు చెప్పుకొంటున్నాం. కాని నెమ్మదిగా పరిశీలించండి. ముందు మన ఈ గ్రామం సాంస్కృతికరంగంలో ఏం కృషిచేసిందో, చెప్పండి? తన సంస్కృతిని ఏమాత్రం పెంచుకొన్నదీ? నేను మీ గ్రామీణులను ఒక్కసారి పొగడేసి-వారిచేత పొగడ్తలను అందుకోవాలని ఉబలాడపడడంలేదు. అలాంటి కార్యక్రమంవలన ఒరిగే దేమీ లేదు. ఎవరో వెనకాల ఉండి ఎద్దులను పొడిచినట్లు పొడుస్తుంటేతప్ప పనిపాటలు చెయ్యడం లేదు. అంతకంతకు బద్ధకం పెరుగుతున్నది. మనకేవో పాఠశాలలూ అవీ ఉన్నాయి. కాని అది కేవలం పిల్లలను ఉద్దేశించి ఏర్పాటయినవిమాత్రమే చెప్పుకొనతగిన ప్రయోజనం మనం వాటివలన పొందటంలేదు. కేవలం భౌతికమైన సౌఖ్యాలకోసమే అధికంగా తాపత్రయ పడుతున్నాం. బుద్ధికి సంబంధించిన-మనస్సుకు కావలసిన పుష్టిని, శాంతి సౌఖ్యాలను చేకూర్చుకొనడం లేదు.

బాల్యందాటి మనుష్యులం కాగానే-పెద్దవాళ్ళంకాగానే ఇక చదువు కట్టిపెట్టనక్కరలేదు వయస్సుకూ చదువుకూ విరోధం కాదు. ఒకదానికి మరొకటి ఏనాడూ బాధకంకాదు. అందువలన వయస్సును లెక్కచేయకుండా ఎప్పుడూ గ్రంథ పఠనం కొనసాగిస్తూనే ఉండాలి.

ఇక మన గ్రామాలే విశ్వవిద్యాలయాలు కావాలి. మన గ్రామీణులంతా ఇక్కడే చదువుకొనే విద్యార్థులు కావాలి. ఏ ఒకటిరెండు-ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జీలవంటి విశ్వవిద్యాలయాలతో సంతృప్తి చెంది ప్రపంచాన్నంతటినీ వానికే పరిమితంచేసి ఊరుకోవడమా! మన విద్యార్థులు ఇక్కడేఉంటూ అక్కడ లభ్యమయ్యే-సాధారణంగా లభ్యంకాగల-ఉన్నత విద్యను అభ్యసించలేరా? ఏ ఏబ్లార్డు పండితుడ్నో, ఏ మత బోధకుడ్నో ఇక్కడికే పిలిపించుకోలేమా? మన గ్రామస్థులీనాడు ఎక్కడచూచినా-ప్రొద్దస్తమానమూ గొడ్లకు మేత వేస్తూ, ఏదో పొలంపనులు చేసుకొంటూ కాలం గడిపేస్తున్నారు. అలాకాదు. నవీనకాలంలో కలిగిన అన్ని సదుపాయాలనూ మనం సక్రమంగా పూర్తిగా వినియోగించుకోవాలి.

పూర్వం ఏకొద్దిమంది భూస్వాములదగ్గరో గ్రంథాలుండేవి. అవి వారుమాత్రమే చదువుకొనేవారు. వారు సంస్కృతినీ, పాండిత్యానీ, చమత్కారాన్నీ అభివృద్ధి చేయగల గ్రంథాలనూ తమతమ సంస్కృతినిబట్టీ అభివృద్ధినిబట్టీ ప్రోగుచేసి గ్రంథాలయం ఏర్పాటు చేసుకొనేవారు; వివిధతైలవర్ణ చిత్రాలూ, శిల్పాలూ, సంగీత, వేదాంతగ్రంథాలూ - అప్పటి పరిస్థితి అది. నేటి ప్రజాస్వామిక యుగంలో మనం ప్రతి

గ్రామంలోనూ ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పుకోవచ్చును. వందలకొద్దీ పండితులము కావచ్చును. ఇక్కడ ఒక్క పుర మందిరానికి 17 వేల డాలర్లు వ్యయపరిచారు. కానీ అందులో సగం డబ్బైనా మనం పుస్తకాలకోసం వెచ్చించడానికి వెనకాడుతున్నాం. అది కూడదని మనవిచేస్తున్నాను. సాలుకు 125 పౌన్లు విరాళం పోగుచేసి "ఏసియన్" హాలులో చలి కాలంలో మంచి ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తున్నారు. ఆ కాస్త మాత్రమే ఇతర ప్రణాళికల్లో ఖర్చుఅయ్యే మొత్తాన్నింటి కంటే కొంచెం విజ్ఞతతో ఖర్చుపెడుతున్నదని నేను అనుకొం టున్నాను. అది చాలదు. ఈ దేశంలోని ప్రతి గ్రామమూ పూర్వపు జమీందారుని – రాజ వంశీకుని స్థితికి రావాలి. ప్రతిగ్రామమూ అల్లా లలితకళలకు నిలయం కావాలి. మనం ఇన్నాళ్ళూ ఇతర పనుల్లో మునిగిపోయి చదువులు అశ్రద్ధ చేశాం. చదువులకు దూరమయ్యాం. ఇకనైనా ఆపని ఆరం భించాలి. కార్యక్రమాన్ని కొనసాగించడానికి కావలసిన ధనం మనదగ్గర ఉన్నది. మన దేశం భాగ్యవంతమైనదే. ఇక మనలో కావలసిందల్లా ఉదాత్తత – క్రొత్తసంస్కారం. మనకు ఇటువంటి సత్కార్యాలకు వ్యయం చేయడానికి, కావలసిన మూలధనాని కేమీ కొరతలేదు. విజ్ఞులైనవాళ్లు ఎంతో విలువైన, ప్రయో జనకరమైన పనులుగాఎంచే ఈ పనులకు ధనం వెచ్చించడాన్ని గూర్చి కొందరు (అజ్ఞులు అని అనను) కేవలం ఏదో గాలి మేడలు కట్టడంవంటిదని, చులకనగా మాట్లాడుతారు. అది మంచిదికాదు.

సాధారణ దినపత్రికలు చదువుతూ, అదే అనుకొంటూ రాష్ట్రీయతత్వం అలవరచుకొంటున్నాం. అది మానేసి 'ప్రపంచపత్రికలు' అందుకోండి. ఎంతసేపూ మనబోస్టన్ నగరాన్ని గూర్చిన స్థానికవార్తలేనా! ప్రపంచంలోని విద్య సంస్కృతిగల సంఘాలన్నింటినిగురించీ వార్తలూ విశేషాలూ మనకు అందుతుండాలి. మనం చదువుకొనే విశేషాలన్నీ ఏ కంపెనీవారో ఏరిపెట్టినిర్ణయించడమేమిటి? అదేంఖర్మం మనకు! మనం సమస్త విషయాలూ చదువుకుందాం. ఏదో ఒకటి ప్రాథమిక విషయాలు నేర్చుకొని, సంతృప్తిపడవద్దు – మన పూర్వులెవరో, ఉన్న ఒకటి రెండు పుస్తకాలూ చంకనపెట్టు కొని ఈ న్యూ ఇంగ్లాండు చేరారు కనుక, మనమూ ఆ రెండే చదివి ఊరుకొందాం అనడం కుదరదు. ఇతరత్రా మన పరిస్థితి చాలా బాగుపడ్డది. పూర్వపు జమీందారుని స్థితికంటె కూడా వైభవంగా ఉన్నది ఈనాటి మనపరిస్థితి.

నేటి మన నవ ఇంగ్లాండు ఎంత భాగ్యవంతమైనదంటే కావాలనుకొంటే ప్రపంచంలోని సర్వమేధాసంపన్నులనూ, ధనమిచ్చి పిలిపించుకొని వారిచేత సర్వవిషయాలూ బోధింప చేసుకోగలదు. వారికి అలాటి సమయంలో ఎన్ని ఏండ్లు అన్ని ఏళ్లూ ఆహారవస్త్రాలూ అన్ని సదుపాయాలూ కల్పించగలదు. ఆర్థికంగా అంతస్తోమతుఉన్నది మన దేశానికి. అవని జరగాలి. మనప్రతిగ్రామమూ ఒక అసాధారణ అపూర్వ పాఠశాల, కళాశాల, కాదు విశ్వవిద్యాలయం కావాలి. ఇప్పుడు మనం కోరుతున్నది పూర్వంలాగా ఒకరో ఇద్దరో రాజ్యవంశీయులు గొప్ప వంశస్థులు కాదు. వారికి బదులు విద్యావంతులైన

గ్రామీణులున్న గొప్ప గ్రామాలు. పెద్దలకోసం ఉద్దేశించిన విద్యాలయాలు నిర్మించడానికి మనం పూనుకోవాలి. అందుకు మీరంతా సన్నద్ధులుకమ్మని కోరుతున్నా. ఇప్పుడు మనకు అత్యవసరంగా కావాలసింది మరో రెండు పురమందిరాలు, మరోనాల్గు పశుశాలలూ కాదు. నేడు మనకు తప్పనిసరిగా కావలసింది మరో రెండువంతెనలు కాదు. అవసరమైతే వాటి నిర్మాణం వదలి వేయ్యండి. ఆ నదికి మరోవంతెన నిర్మించ నక్కరలేదు. ఆపని మానెయ్యండి. ప్రస్తుతానికి అవసరమైన వారు మరికొంతదూరం - చుట్టుతిరిగి చేరుకుంటారు. [illegible]లేదు. ఇప్పుడు మనం మనలో ఏర్పడిఉన్న అజ్ఞానమనే అగాధాన్ని దాటడానికి కనీసం ఒక్క వంతెన నిర్మించుదాం. ముం[illegible] మన మంతా అజ్ఞానాన్ని - మన తెలియనితనాన్ని వదిలించుకో[illegible]డానికి సమధిక కృషిచేదాము. అతి ప్రధానంగా గుర్తించుకో[illegible]సిన విషయాన్ని మరల ఒక్కసారి మనవిచేస్తాను - ఉత్త[illegible] గంధా లను పఠించాలి.



# ముగింపు

జబ్బుపడ్డవాళ్ళకు గాలిమార్పుకావాలనీ, స్థలంమార్పు కావాలనీ వైద్యులు సలహా ఇస్తుంటారు. మంచిపనే. ప్రపంచ మంతా ఇక్కడే లేదు. మీరు కట్టుకొన్న నాలుగుగోడలమధ్యనే ఉండిపోలేదు యావత్తు ప్రపంచమున్నూ.

లేళ్ళు మన నవ ఇంగ్లాండులో నివసించవు. పక్షి (ఇది ఇతరపక్షులు అన్నింటినీ అనుకరించి వాటిలాగా కూస్తుంది. వాటిని వెక్కిరిస్తుంది. అందుకని దాన్ని ఎగతాళిపిట్ట అనికూడా పిలుస్తారు ఈ ప్రాంతంలో.) యొక్కస్వరం ఇక్కడ చాలా అరుదుగా కాని విన్పించదు. అడవిబాతు ఉంది చూచారా అది స్వదేశ దురభిమానం కలది కాదు. మనకంటెకూడా అధికంగా సర్వసమ భావముగలది. అది ప్రొద్దుట కెనడాలో నిద్ర లేచి ఫలహారం ఆరగిస్తుంది. ఓహియోలో మధ్యాహ్నపు విందుభోజనంచేసి రాత్రిపూట భోజనానికి దక్షిణరాష్ట్రంలో కులుకుతూ తయారయి, అక్కడ నిద్రకు సన్నద్ధ మవుతుంది. దానికి ఒక్కచోటే నిలిచిపోవాలనిగానీ, ఒక్కచోటే భోజనం చెయ్యాలనిగానీ పిచ్చినియమాలు లేవు. అది స్వేచ్ఛాశీలి. దాని స్వేచ్ఛావిహారానికి రాష్ట్రాభిమానం అడ్డురాదు. మన సంగతి వేరు...చివరకు కాదున్నకూడా కొంతవరకు ఋతువుల ననుసరించి ప్రవర్తిస్తుంటుంది. అది కొన్నాళ్లు కాలోరెడో

లోని పచ్చిక మైదానాల్లో తిరుగుతుంది. 'ఎల్లోస్టోన్' లోని పచ్చిక బీళ్ళల్లో అంతకంటె మంచిదీ రుచికరమైనదీ అయిన పచ్చిక మొలకెత్తగానే వెంటనే అక్కడకు పయనమౌతుంది. దానికూడా అంత స్వేచ్ఛఉన్నది. కాని మనకో... మన మేమనుకొంటున్నామంటే–మన పొలాల చుట్టూతా వేసు కొన్న కంచె తీసివేసి దానిస్థానంలో మంచి కొండరాళ్ళతో, చెక్కనున్నంతో సరిహద్దుగోడలు కట్టివేస్తే ఇక మన జీవితా లకే సరియైన సరిహద్దులు ఏర్పడతాయనీ, ఇంక మన జాత కాలు ఖర్మలు శాశ్వతంగా నిశ్చయింపబడతాయనీ అను కొంటున్నాం. కాని ఈ విశ్వాసాన్ని గురించి మన కేర్పడిన అభిప్రాయాలకంటె విశ్వాసాలకంటె అత్యంతము విశాల మైంది ఈ విశ్వం. అది మరువకూడని విషయమని మనవి చేస్తున్నా.

ఆసక్తి కలిగిన నావికులవలె మనంకూడా మన వృత్తుల యందు తగు జాగ్రత్తవహించాలి. అందులోని అన్ని వివరాలు తెలుసుకోవాలి. సుఖజీవనం గడపాలి. కొందరు నావికులు ప్రాతత్రాళ్ళనుండి నారపీచు మరల సంపాదిస్తూ [illegible] ట్లుగా వెఱ్ఱిగా కాలయాపనచేస్తూ జీవనయాత్ర [illegible] గడప కూడదు. ఈ భూగోళంతో అవతలివైపునుగురించి నువ్వెంత ఆశ్చర్యపడనక్కరలేదు. అదీ నీకు వార్తలనందించే [illegible]ప్రవాము వంటిదే. మన నావికాయానము ఒక ప్రదక్షిణం చే[illegible]వంటిది.

వైద్యులు కేవలం చర్మానికి సంబంధించిన [illegible]ధులకు, పైకికన్పించే రోగాలకు మాత్రమే మందులిస్తారు. [illegible]ంగురించి సలహాలు చెబుతుంటారు. ఒకడు జిరాఫీని వెంటాడడానికి

దక్షిణాఫ్రికాకు పోవడానికి వేగిరపడతాడు. ఎందు కాతొందర! నిజానికి ఆసక్తి కనబరుపవలసింది అటువంటి విషయాల్లో కాదు. అతనాపని చెయ్యగలడే అనుకోండి, కాని ఎంతకాలమని ఆవెధవ జిరాఫీలను వెంటాడుతూ ఉండగలడో చెప్పండి. పిట్టల్ని కొట్టడం కొంతకాలం కాస్తంత ఆసక్తినీ ఉత్సాహాన్నీ రేకెత్తించి కొంత ఆనందం కలిగించవచ్చు కొందరి విషయాల్లో. కాని అదీ ఎంతకాలం? "ఆత్మ" పదార్థాన్ని గురించి దాన్ని మనోబాణంతో కొట్టడానికి ప్రయత్నం చెయ్యాలి. మనధీశక్తిచేత దాన్ని మన ఆలోచనా వాగురంలోకి పట్టగలిగితే అటువంటి ప్రయత్నంచేస్తుంటే అది మంచి వేట అవుతుంది. అల్లా అనే నా విశ్వాసం "నీదృష్టిని సరిగ్గా అంతరంలోకి, అంతరంగంలోకి మరల్చు. నీ మనస్సులోనే ఇంతవరకూ ఎవ్వరూకనుక్కోని అనేక సహస్రమండలాలు గోచరిస్తాయి. ఆ మండలాల్లో సంచరించు. అప్పుడు నీలోని జగత్తును తజ్జగద్వివరణాన్ని గురించి చర్చించుకో. ఆ విషయంలో అట్టిసాధనలో నీవు నేర్పరివి కా." ప్రపంచపటంలో ఆ ఆఫ్రికా, ఆ పశ్చిమదేశాలూ ఏ విషయం తెలపడంకోసం దేనికోసం ఉన్నాయంటారూ? నైలు నైగరూకాక మిసిసిపీ—ఈ నదుల నదీ మార్గాలనేనా వీటినేనా నిరంతరం శ్రమపడికనుక్కోవలసింది? మానవజాతికిఎదురయ్యేఅత్యంత ప్రధానమైనసమస్యలుఇవేనా? అంతేకాదు. ఆ పోయింది. ఒక్క ఫ్రేంక్లినుఒక్కడేనా ఏమిటి? ఆయనభార్య ఆయన్నుగురించి అంత ఓపిగ్గా అల్లా వెతకవలసిందేనా? పోనీ గ్రిన్నెల్ మహాశయునికి ముందుతానెక్కడవున్నదీ తెలుసునా? ఎందుకండీ ఈ బాధలూ? ముందు మీలోని

నదులకూ సముద్రాలకూ మీరు వెలిస్, క్లార్కు, ప్రొబిషర్ వంటి శాస్త్రజ్ఞులుకండి. మంగోపార్కువంటి స్థానాలుకండి. మీకు కావలసినంత ఆహారాన్ని వెంటేసుకొనైనా సరే బయలుదేరి ఉన్నత పథాలనుచేరండి. ఆహారపదార్థాలు పెట్టి ఉంచిన మూతలుబిగించి తెచ్చిన ఆ డబ్బాలన్నీ త్వరగా ఖాళీచేసి ఆకాశం అంత ఎత్తుగా కుప్పవేయండి - లోకానికి దాన్నే ఒకచిహ్నంగా, మీ విజయయాత్రాసన్నా హానికి సూచకంగా. మాంసం కుళ్ళిపోకుండా దాచే పద్ధతు లేమో ఎన్నో కనుక్కొన్నాం. అయితే ఆ పద్ధతులన్నీ కేవలం మాంసం కుళ్ళకుండా ఉంచడానికే నంటారా ? తద్వారా కేవలం మన భౌతికశరీరాన్ని నిలుపుకోవడానికేనా ? కాదు. కాదు. మీరు ప్రతిఒక్కరూ ఒక్కొక్క "కొలంబస్"లు కండి. మీలో లోనలోన ఉన్న క్రొత్తఖండాలను మండలా లను కనిపెట్టండి. క్రొత్తమార్గాలను, వ్యాపారంకోసం కాదు సుమండీ, ఆలోచనకోసం, భావనాశక్తిని పెంపొందించుకొనేం దుకు-అందుకై కనిపెట్టండి. ప్రతి మానవుడున్నూ ఒకరాజ్యా నికి ప్రభువు. ఆ రాజ్యం జారుచక్రవర్తి పాలించిన విశాల సామ్రాజ్యం కంటె కూడా విస్తృతిపొంది ఉంటుంది. ఈరెం టినీ చెప్పాలంటే ఒకటి అనంతమై కన్పించే మహాసముద్రం - రెండవది చిన్న మంచుగడ్డ.

కొందరు ఆత్మాభిమానం లేనివారు స్వల్పవిషయాల కోసమై అతి ఉదాత్తమైన విషయాలను త్యాగం చేసినవారు దేశభక్తులుగా వుంటారు. ఉండనివ్వండి. తమతమ సమాధులు కట్టేందుకు వినియోగపడే మృత్పిండాలనే వారంతగా ప్రేమి

స్తారు. పాతిపెట్టబడడానికై గోతులు త్రవ్వబడే భూమిని వా రంతగా ప్రేమిస్తారు. కాని మృత్యువిశేషమైన శరీరానికి, తమ మృచ్ఛరీరానికి ఉదాత్తస్థితినికలిగించే, కల్పించే ఆత్మను వారు ప్రేమించలేకపోతున్నారు. తమకు క్రమంగా ఉన్నతస్థితిని కలి గించే ఆత్మయందు వారికి సానుభూతిలేదు. ఆదరణ లేదు. తద్విషయ చింతనములేదు. కేవల స్వదేశాభిమానమన్నది వారి తలల్లో పురుగువంటిది. అది ఆ క్రిమి వారితలలను తొలుస్తున్నది.

అంత ఆడంబరంతో, అంత ధనవ్యయంతో కూడిన ఆ దక్షిణసముద్ర యాత్రపరిశోధనలు మనకేం గుణపాఠాలు చెబుతున్నాయి? "నీతి" అనే ప్రపంచంలో మనమింతకుముందు కనుక్కోని ఖండాలు ఖండాంతరాలు, సముద్రాలు అనేకం ఉన్నాయని పరోక్షంగా గుర్తించమనేకదా అవినేర్పిన గుణపాఠం. కొన్ని వందలమంది సేవకులు, సహాచరులు వెంటరాగా ఒక ప్రభుత్వనౌకలో తుపాన్లనూ, మంచువర్షాలనూ, నరమాంస భక్షకులనూ లెక్కచేయకుండా చేసేనౌకాయానం ఒంటరిగా ఇతరులసాయం లేకుండా తనలోని - తనలో అంతర్గతంగా ఉన్న సముద్రాలను కనుగొనడం కష్టమనేకదా మనంనేర్చుకొన్నది.

"వాళ్ళను అల్లా తిరగనివ్వండి. బహుదూరంలో ఉన్న ఆస్ట్రేలియన్లను సమీపించి వారిని దగ్గరగా పరిశీలించనివ్వండి. నాకేం బెంగలేదు. వాళ్ళ అనేక భూమార్గాలుంటే నాకు భగవంతుడున్నాడు. నాకు భగవంతుణ్ని గురించిన ఆలోచనలున్నాయి." అన్నారొకాయన. మంచిమాట అన్నారు. అందువల్ల నేను ప్రపంచంచుట్టూ తిరుగుతూ జాంజిబారులోని పిల్లుల్ని లెక్కపెట్టుకొంటూ పోవడముందే అది నీకు అర్థా

మైంది కాదని అంటాను. కాలం అల్లా వృధా చెయ్యడం ధర్మం కాదు. కాని అంతకంటే మరేమీ పనిలేకపోతే అలాగే చెయ్యి. చెయ్యంగా చెయ్యంగా నీకే నీ అంతర్యానికి దారి కనుక్కో గలుగుతావు. ఇంగ్లండు, ఫ్రాన్సు, స్పెయిను, పోర్చుగల్లు, గోల్డుకోస్టు, స్లేవ్ కోస్టు ఇవన్నీ సముద్రాన్ని అనుకొనే ఉన్నాయి. వీటికి సముద్రతీరా లున్నాయి వాటికెదురుగ్గా స్పష్టంగా హిందూ దేశానికి రహదారి కన్పిస్తూనే ఉన్నా, ఆ యా తీరాలనుండి ఏ ఓడకూడా కనుచూపుమేర దాటి వెళ్ళనే లేదు. అన్ని భాషలూ నేర్చుకొంటే, అన్ని సంప్ర దాయాలయందూ సహనాన్ని ప్రదర్శిస్తే అన్నిరకాల శీతోష్ణ స్థితులకూ అలవాటుపడితే, ఇతర యాత్రీకు లందరికంటె మీరే అధికులు కాగలరు. అందువల్ల మీరు ముందు మీ అంతర్యాన్ని పరిశోధించండి. ఆత్మపరిశోధన చేసుకోవడం అల వర్చుకోండి. అయితే ఈ విషయంలో అట్టిదృష్టి ధైర్యమూ కావాలి.

పిరికిపందలు పారిపోయి సైన్యంలో చేరతారు. పైవిష యంలో ఓడిపోయినవాళ్లు, అట్టి ఉత్తమ విషయాలను త్యజిం చిన వాళ్లు యుద్ధాలకు పోతారు. మీరు ఆత్మపరిశోధన చెయ్యండి. ఉదాత్తంగా అత్యున్నతంగా ఉన్న - ఉండే, ఆ ఆత్మను అందుకోడానికి సన్నద్ధులు కండి. అందుకై ఇప్పుడే ప్రయాణంకండి. అదుగో ఆ పశ్చిమమార్గాన గమనాన్ని ఆరం భించి పయనించండి. ఆమార్గంలో మీకు మిసిసిపీ తగలదు. అది చైనా జపాన్లకు దారితీయదు. ఆ మార్గము ఉత్తమము. అది అనంతము. క్రమక్రమంగా ఎత్తుగా ప్రాకుతూ 'ఆ' మండ

లానికి దారితీస్తుంది. పవలూ రాత్రీ-సూర్యుడు అస్తమించినా, చంద్రు డస్తమించినా వారేకాదు భూమే అస్తమించినా ఆమార్గం ఇంకా శాశ్వతంగా స్పష్టంగా ఉదాత్తంగా కన్పిస్తూనే ఉంటుంది. ఆమార్గాన గమించండి.



నేనా అడవినీ అచ్చటి నా యింటినీ విడిచిపెట్టి మళ్ళీ బయటి ప్రపంచంలోకి వచ్చేశాను. అక్కడికి వెళ్ళడానికి ఎంత ప్రబలమైన కారణం ఉన్నదో ఆ ప్రదేశాన్ని విడిచి వచ్చేయడానికీ అంత ప్రబలమైన కారణమూ ఉన్నది. అవును-నేనింకా ఎన్నో అనుభవాలు పొందవలసి ఉన్నది - క్రొత్త క్రొత్త జన్మలు ఎత్తవలసి ఉన్నది. ఎన్నో ప్రయోగాలు చేయవలసి ఉన్నది. అక్కడ చేసినవాటిల్లో ఒకటి. ఆ ఒక్కదానికోసమే ఇంకా ఎక్కువకాలం వ్యయపరచలేను. అందుకు నాకు వ్యవధి చాలదు.

ఎంత తేలిగ్గా ఎంత అనాలోచితంగా మనం కొన్ని కొన్ని ప్రత్యేకమార్గాలలో పడిపోతామో చూడండీ! ఇది ఒక విచిత్రమైన పద్ధతి. నే నక్కడ ఆ అడవిలో ఉండడం మొదలుపెట్టి ఓ వారంరోజు లయిందోలేదో అప్పుడే నా యింటి దగ్గరనుండి చెరువుదాకా ఓ కాలిబాట ఏర్పడిపోయింది. ఎప్పుడో ఆరేళ్ళక్రిందట నేనటు నడిచిన కారణంగా ఏర్పడిన ఆ కాలిబాట ఇప్పటికీ స్పష్టంగా కన్పిస్తూ ఉండిపోయింది. ఆ మార్గాన్నే అనుసరించి అది ఆ స్థితిలో ఉండడానికి దోహదం చేస్తూ ఇతరులు అటు వెళుతున్నారేమోనని నాకు అనుమానం

కలుగుతున్నది. ఈ భూమియొక్క ఉపరితలమూ ఎంత మృదువైనదీ! ఎంతమెత్తన ఈనేల! ఎంత సులభంగా మనుష్యుల అడుగులు పడతాయో! ముద్రలు నిలచిపోతాయో! అదే విధంగా మనో మార్గాలున్నూ- అంటే ఆలోచనలు ప్రసరించే పథములున్నూ. అందువల్ల ప్రపంచపు రహదారులు ఎంతగా దుమ్ముకొట్టుకొనిపోయి ఎంతగా శిథిలమై మరీ పాతపడిపోయి వ్యర్థంగా నిర్జీవంగా కన్పిస్తాయో! మూఢ విశ్వాసాల పాత నమ్మకాల స్థితీ అంతే...... నాకు స్వగృహానికి వెళ్ళే పాత బాటకంటె ఈ ప్రపంచనౌకాగ్రభాగానికి వెళ్లే రాజమార్గ మంటేనే ఎక్కువ ఆపేక్ష కలిగింది. దానియందే నాకు ఇష్టం ఏర్పడ్డది. అక్కడనుండి ఆ కొండల మధ్యలో, ఆ విశాల ప్రశాంత గంభీర ప్రకృతి మధ్యలో నిలుచుండి, శారదరాత్రులలో శీతలసమేతమైన దివ్యజ్యోత్స్నను నేను దర్శించగలుగుతున్నాను. అట్టి ఉన్నత స్థితిని అందుకొన్నాక ఇంక మళ్ళీ క్రిందకు దిగి రావాలని అనిపించడంలేదు, కానిట్టి ఆ దివ్యసీమలనుండి దిగిరాను. ప్రయోగాలు చేసిన అనంతరం అంటే స్వీయానుభవ పూర్వకంగా నేనీ క్రింది విషయాలు నేర్చుకొన్నాను. ఒకవ్యక్తి దృఢమైన ఆత్మవిశ్వాసంతో తన స్వప్నాలను సాధిద్దామనుకొంటూ పురోగమిస్తే - తాను కలలు కంటున్న ఆదర్శాలవైపుకు ముందుకు నడిస్తే తాను మనసులో ఆశతో ఎల్లా ఉండాలని భావనచేస్తున్నాడో అట్టి జీవితాన్ని అనుభవంలో గడపాలని ప్రయత్నం చేస్తుంటే ఆ వ్యక్తి తన సాధారణ దినక్రమంలోనే ఎప్పుడో అప్రయ

త్నంగా ఆనుకోకుండానే విజయాన్ని సాధించుతాడు. అతని కట్టి శుభసమయం తానుగా ఎదురవుతుంది. అతడు కొన్ని లౌకిక విషయాలను వెనక్కు నెట్టివేస్తాడు. కొన్ని సాధారణ నియమాలను పాటించడం మానివేస్తాడు. సామాన్యంగా సంఘం కొన్ని కట్టుబాట్లను సంప్రదాయాలను ఏర్పరుస్తుంది. కొన్ని విశ్వాసాలను కలిగిస్తుంది. అల్లాచేసి కొన్ని హద్దులను ఏర్పరుస్తుంది. కొన్ని అవధులను కల్పిస్తుంది. అది దాటరాదంటుంది. కాని అతడు ఆ అవధుల నతిక్రమిస్తాడు. అతడు నవ నవ్యమైన, విశ్వజనీయమైన, స్వేచ్ఛాయుతమైన కొన్ని సంప్రదాయాలను, నియమాలను ఏర్పరచుకొంటాడు. అతనిలో ఒక మార్పు వస్తుంది. తత్ఫలితంగా అతను సంఘంతో కూడా క్రొత్తగా వ్యవహరిస్తాడు. తానుగా ఏర్పరచుకొన్న నియమాలు క్రమంగా వేళ్ళుపాతుకొని స్థిరపడతాయి. అట్టి నూతన నియమాలకు నవ్యసంప్రదాయాలకు అతనే మూలపురుషు డవుతాడు. వాటిని స్థాపించినవాడుగా గుర్తింపబడుతాడు. అంతకు ముందున్న పాత సంప్రదాయాలకు, నియామాలకు విశాలదృష్టి ఆపాదింపబడుతుంది. అవే అతనికి అనుకూలంగావిస్తృతి కలిగింపబడి వ్యాఖ్యానింపబడతాయి. అతనికి స్వేచ్ఛ గలుగుతుంది. ఉత్తమస్థాయికి చెందిన ఉదాత్తచింతన చేసేటువంటి జీవిలా అతను జీవితం గడుపుతాడు. జనబాహుళ్యం అనుసరించిన అనుసరిస్తూ ఉన్న కట్టుబాట్ల విధివిశేషాలు అతనికి ఆటంకాలు కావు. దారికడ్డు నిలవవు. అవి ప్రక్కకుతొలగి అతనినూతన జీవిత యాత్రకు స్వేచ్ఛనిస్తాయి.

జీవితంలో ఆడంబరత్వాన్నీ విషయాసక్తినీ త్యజించి అతి సామాన్యంగా సాధ్యమైనంత సాధారణంగా కేవలంస్వచ్ఛంగా గడపగలిగినకొద్దీ మానవులకు లోకంఏర్పరచిన నీతినియమాలూ వివిధనిషేధాలూ అంతకంతకు తక్కువ కష్టంగా తేలిక సమస్యలుగా కన్పిస్తాయి. అవి అల్లాగా పరిణామం చెందుతాయి. ఇంక అప్పుడు ఒంటరితనము ఒంటరితనమూ కాదు. దారిద్ర్యము దారిద్ర్యమూ కాదు. బలహీనత బలహీనతా కాదు. అవన్నీ అతనికిఅనుకూలంగా కన్పిస్తాయి. అప్పుడావ్యక్తి వాటన్నింటికీ క్రమంగా అతీతుడవుతాడు.

మీరు ఈసరికే ఊహాసౌధాలను మహోన్నతంగా, మహావైభవంగా నిర్మించుకొనిఉంటే వాటి శ్రమ అంతా ఆ కష్టమంతా వృధా కానక్కర్లేదు. ఆ నిర్మాణాలు అలాగే ఉండాలి. వాటి నలాఉంచి ఇప్పుడింక వాటికి పునాదులు కల్పించండి. మంచి బలమైన పునాదులు కట్టుకురండి. వాటినిస్థిరంగా నిలపండి.

ఇంగ్లాండులోనూ, మన అమెరికాలోనూ వాళ్ళందరికీ అర్థమయ్యేలాగున నీవు మాట్లాడాలంటారు. కాని ఆ అవసరం నాకేం కన్పించడం లేదు. మానవులుకానీ, ఇతరజీవులు కానీ సరిగ్గా అలాగే జీవించడంలేదు...కాకపోయినా అదేమంత ప్రముఖ విషయమా! వారికంత ప్రాధాన్యం ఆపాదించడం దేనికి? తమ దృక్పథాన్ని మినహాయిస్తే వారు మనలను అర్థం చేసుకోలేరుకదా! ప్రకృతి కేవలం ఒక్కవిధానాన్ని మాత్రమే సమర్థిస్తున్నదా? ఒకవంక మనుష్యుల్నీ మరొకవంక చతుష్పాద

జంతువుల్నీ, ఒకవైపు నేలమీదప్రాకే ప్రాణుల్నీ మరొకవైపు పైన ఆకాశంలో ఎగిరే పక్షుల్నీ సమంగానే సమర్థించి, సమాన అవకాశాలు కల్పించడంలేదూ! అలాగే వారిదృక్పథానికి వారి విధానాలకు భిన్నమైనంతమాత్రాన మనం ఎందుకు అర్థం కాకుండాపోవాలి? మరొక దృక్పథం ఉండనేకూడదా? అజ్ఞానంలోమాత్రమే నిరపాయత, భద్రత ఉన్నాయనికాబోలు వారనుకోవడం!

నేను నిస్సంకోచంగా మాట్లాడుతున్నాను. స్వచ్ఛమైన ప్రభాతసమయాన అప్పుడే నిద్రనుండి మేల్కొన్నవాడు- అప్పుడే తనలాగానే నిద్రనుండి మేల్కొని స్వచ్ఛమనస్కులై యున్నవాళ్ళతో మాట్లాడినట్లుగా మాట్లాడుతున్నాను. నేను మంచి జాగ్రదవస్థలో ఉండి మాట్లాడుతున్నాను. నేను విషయాన్ని పెంచీ, కొండంతలుచేసీ చెప్పడంలేదు; ఉన్నవిషయాన్ని చెప్పడానికి భయపడడమూ లేదు.

సామాన్యులకు వినిపించని ఒక చక్కని దివ్య గంధర్వగాన మొకసారి విన్నతర్వాత ఇక దాన్నిగురించి నాలుగు ప్రశంసావాక్యాలు పలుకడానికి భయపడేవ్యక్తి ఎవరుంటారూ?

మన మాటలలోని సత్యపదార్థము మాత్రమే పరిణామం చెందుతుంది. మాటలు మారినా ఆ సత్యపదార్థము మాత్రమే నిత్యమై యుగయుగాలకూ శాశ్వతంగా నిలచిపోతుంది. మన విశ్వాసాలనూ, మన పావిత్ర్యాన్నీ వ్యక్తపరిచే మాటలు స్వప్నార్థకబోధకములు కావు. కాకపోవచ్చును. అలా అయినప్పటికీ అవి చాలా ముఖ్యమైనవే. అత్యంతమూ సువా

సనాథరితములైనవే. రసభరితములైనవే. వాటి సువాసనలు సాంబ్రాణిపొగవలె వ్యాపిస్తుంది. ఆ సువాసన ఉదాత్త మానిసులకు మాత్రమే ఆఘ్రాణయోగ్యమవుతుంది. కనుకనే వారికి-తమకు అర్థంకావడంలేదనే వారికిభయపడి వాటికి మనదృక్పథం అర్థంకాలేదని అంతమాత్రంచేత మనస్వేచ్ఛను అరికట్టుకో నవసరంలేదు.

ఎల్లప్పుడూ మందకొండిగా నిరుత్సాహకరంగాకన్పించే కాదూ అనిపించే అభిప్రాయాలకే మొగ్గుచూపడం ఎందుకూ? వాటికే అంత ప్రాధాన్యం అంటగట్టడ మెందుకూ? వాటికై అలా మనం కృంగిపోవడం దేనికి? అలా ఒకచోట కృంగిపోతూ దాన్నేమో లౌకికజ్ఞానమనీ ప్రపంచజ్ఞానమనీ పేర్లుపెట్టిపిలుస్తూ దాన్ని ప్రశంసించడమూనా! ఏమిటి ప్రపంచ జ్ఞానమంటే? దానికి కొలమానం ఏది? కొందరి విజ్ఞానంలో మనమే మూఢులమంతు అర్థంచేసుకొని ఇంక వాళ్ళను తెలివి తక్కువవాళ్ళక్రింద జమకడుతూ ఉంటాము. కొందరు సూర్యోదయం సమయంలో మేల్కొని తూర్పుదిశాంతల అగుపించే అరుణిమను చూచి ఎందుకో మూతివిరిచి ఎబ్బే అదేమిటి అలా ఎఱ్ఱగా ఉందేమని తప్పులెంచుతారు

భ్రాంతి, ఆత్మ, ప్రతిభ వేదార్థ ప్రతిపాదక సిద్ధాంతములు ఈ నాలుగు కన్పిస్తాయట కబీరు మహాకవి వ్రాసిన గీతాలలో (గూఢ్ పద్ల వంటివి.) అవి చతుర్విధమైన అనుభూతి స్ఫోరకములుగా ఉంటాయట. అక్కడది ఒక విశేషంగా భావించబడుతున్నదట. కాని ఈ ప్రాంతంలో ఒక రచయిత

తన రచనలో ఒక్క-అర్థాన్నిమించి వ్యాఖ్యానం చేయడానికి అవకాశమిస్తే చాలు తప్పుపట్టేస్తారు. పెద్ద దోషంగా ఎంచి దుమారం లేవకొడతారు...బంగాళాదుంపల పంటకువచ్చే అంటురోగాలకు ఇంగ్లాండులో క్రొత్తక్రొత్త వైద్యవిధానాలు కనిపెడుతున్నారట. కాని ఆ ప్రయత్నం ఈవిషయంలో చేస్తే బాగుండు. ప్రపంచంలో ఆ దుంపలవ్యాధికంటె అతివ్యాప్తంగా అంతకంటె ఎక్కువ ప్రమాదకరంగా కన్పిస్తున్న మానవజాతి మానసిక మాంద్యాన్ని-మానసికవ్యాధిని మాపేందుకు మంచి మందు కనిపెడితే బాగుండు. ఇలా చెబుతూ నాలో ఏదో ఒక నిగూఢత ఉన్నదనీ, మీకు తెలియని అతి నిగూఢమైన ఒక ఉన్నతస్థానాన్ని నేను ఆక్రమించుకొని ఉన్నాననీ నేను భావించడం లేదు. కాని ఒకటిమాత్రం నిజం. అర్థకాలేదన్న కారణంగా నావ్రాతల్లో మీరు తప్పుపడుతున్నట్లయితే అది నాకు గర్వకారణమే అవుతుంది. వాల్డన్ మంచుగడ్డ వ్యవహారం చూడండీ. అక్కడినుండివచ్చే మంచుగడ్డలు ఆకాశపురంగులో కొంచెం నీలంగా ఉంటాయి. ఆ నీలవర్ణం నిజానికి వాటి స్వచ్ఛందనాన్ని తెలియపరుస్తుంది.

కాని దక్షిణ దేశస్థులు వీటియందు తమ అయిష్టతను ప్రకటించి కేంబ్రిడ్జినుండివచ్చే మంచుగడ్డలనే మంచివిగా ఎంచుకొని కొంటున్నారు. మరి ఆ మంచుగడ్డలకు అక్కడ నీటిమొక్కలకూ నీళ్ళల్లోపెరిగే విత్తనాలకూ ఉండే రుచిఒకటి అంటుకొని ఉంటుంది. అలాగా అవి స్వచ్ఛంగా లేకపోయినా వాటికి వేరే అవాంఛనీయమైన రుచిఉన్నా వాళ్ళు వాల్డన్‌నుంచి లభ్య

మయ్యే మంచుగడ్డల సచ్ఛందనము అర్థంకాకపోవడం కారణంగా కాస్త తెల్లగాఉండాలికదా అని కేంబ్రిడ్జినుండి వచ్చే అయిసుముక్కలను కొనేస్తున్నారు. అంతమాత్రంచేత వాల్డన్ మంచుగడ్డలకు హీనతరాదు. తక్కువతనం ఆపాదింపబడదు. అలాగే నా రచనలకున్నూ. అందువల్ల నాకు అదిగర్వకారణమే అవుతున్నది. సామాన్యంగా ఆధునికులు - అందులో మన అమెరికన్లు బుద్ధివిషయికంగా అంటే మానసిక శక్తులను కొలచి చూచేపక్షంలో మన పూర్వులకంటె కనీసం ఎలిజబెత్తు యుగపువాళ్ళకంటె తక్కువ వాళ్ళనీ వారితో పోల్చినప్పుడు మనవారు మరుగుజ్జులుగా కన్పిస్తారనీ అంటూ మన చెవ్వుల దగ్గరచేరి అదరిపోయేలాగున అరచి గోలపెడుతున్నారు కాని ఎందుకాగోల! దానివల్ల మనకేం ఒరుగుతుంది? ఆమాటలవల్ల కలిగే పరమప్రయోజన మేమిటని నిష్కర్షగా ప్రశ్నించుకోండి. చనిపోయిన ఓ సింహంకంటె సంజీవంగా ఉన్న ఒక శునకం గొప్పదికదా! ఒకడు తాను మరుగుజ్జుల జాతికిచెందినవాడు కదా అని ఏడుస్తూకూర్చుంటాడా ఎక్కడైనా? అల్లా అని అతను గొంతుకకు ఉరిబిగించుకొంటాడా? ఆ మరుగుజ్జులలో కాస్త పెద్దమరుగుజ్జును కాకపోయానే అని ఆక్రోశిస్తాడా?... ఎందుకా ఆక్రందనం? ఏమిటి దానివల్ల ప్రయోజనం! ప్రతివ్యక్తీ తనపని తాను చేసికొనిపోవాలి. తాను ఎందునిమిత్తమై వినియోగింప పడ్డాడో, తన లక్ష్యమేమిటో కాస్త జాగ్రత్తగా విచారించుకొని అందునిమిత్తమై ఆ లక్ష్యసాధనకై కష్టపడి పనిచెయ్యాలి. అంతేకాని అల్లా నిరుత్సాహ పడకూడదు.

* * *

ఆ పిచ్చివృత్తిపనుల్లో, రకరకాల ఉద్యోగాలలో వివిధ ఉద్యమాలలో ధనసంపాదనాది విషయాల్లో మీ కందరికీ ఎందుకండీ అంతతొందర ? ఏమో విజయసాధనకు ఎందుకంత హైరానపడుతున్నారూ అని అడుగుతున్నాను. ఓ పరుగులు పెడుతూ తోడివారినికూడా మహా అదలిస్తున్నారే! ఆవురుకుల్లో మీతో పోటీపడినవాళ్ళను మందలిస్తున్నారే !

ఒకవ్యక్తి మీ పరుగుల్లో పోటీ పడడం లేదంటే అందుకు కారణం అతను మరోవిషయంలో ఆసక్తిపరుడైనా డన్నమాట. అతను వేరే సందేశాన్ని అందుకొన్నా డన్న మాట. వేరొక దివ్యవాణిని ఆలకించాడన్నమాట. అల్లా విని దానినతడు అనుసరిస్తున్నాడన్న మాట. అది ఎంత దూరదూరంనుండి వినిపించినా, ఎంత స్పష్టాస్పష్టంగా విని పించినా ఆ వినిపించే దివ్యగంధర్వగానానికి అనుగుణంగా అతన్ని అడుగువెయ్యనివ్వండి. తదా దేశానుసారం అతన్ని నడవనియ్యండి. అయినా మీకెందుకాతొందర. అతనుకూడా ఓ దేవదారుమొక్కలా, ఓ ఏపిలు అంట్లులా అంతవేగం ఈడేరాలనీ కాపుకు రావాలనీ ఎక్కడున్నదీ? అతడు తన వసంతాన్ని వేసవిగా మార్చెయ్యాలా? అతను తన సౌఖ్య మంతావిడిచిపెట్టి కష్టాలపాలవలేదనా మీఆరాటం? ఇప్పుడున్న పరిస్థితి – మనం ఎదుర్కొంటున్న పరిస్థితీ, మనచుట్టూ ఉన్న వాతావరణముసూ్నతగినది కాదనుకోండి. అది అపరిపక్వస్థితిలో ఉన్నదనే అనుకోండి. కాని దానికిప్రత్యామ్నాయంగా మరేమి ఉన్నది? మరే "సత్యం" సిద్ధంగాఉన్నది! చెప్పండి? వ్యర్థమైన,

నిష్ప్రయోజనమైన సత్యాలను గురించి మనం బెంగపడిపోము. అందుకై మనజీవిత నౌకలను భగ్నంచేసుకోము. నానానక్షత్రావడి మన నెత్తిపై దూరంగా పైన నీలవర్ణపు గాజుపలకలతో "స్వర్గాన్ని" కల్పించుకొని మళ్ళా తీరా అది పూర్తయ్యాక అది మనం కల్పించుకొన్నదే కానట్లు భ్రాంతిపడుతూ స్వచ్ఛాకాశంవైపు తిరిగి ఆసక్తిపరులమై స్వర్గాన్ని చూడ్డానికి సిద్ధపడతామా? ఎందుకా పని!

* * *

ఒకులెవరో ఒకరు మనకేమో ఒరిగిస్తారనుకోకండి. మనలనెంతో ఆలోచింపచేసిన వ్యక్తులందరికంటె ఇతర భౌతికమైన వస్తువులకంటె సత్యము ఒక్కటే మనకు ప్రయోజనకారి అవుతుంది. అది మన అండ నిలుస్తుంది. అదొక్కటే శాశ్వతమైనది. నూటికి తొంభై పాళ్ళు మనం ఎక్కడ ఉన్నామో అక్కడ ఉండడంలేదు. ఒక తప్పుచోట ఉన్నాము. ఒక మాయలో ఉన్నాము. మన మన ప్రవృత్తుల కారణంగా మనం ఒక బాహ్య ఆవరణాన్ని ఊహాకల్పనముతో నిర్మించుకొంటాము. అందులో ప్రవేశిస్తాము. కనుక అప్పుడు మనం ఒకే సమయంలో ఉంటామన్నమాట. మాయావాగురంలో నుండి బయట పడడమన్నది చాలాకష్టం......కాని...... అయినప్పటికీ ఒక్క యథార్థాన్ని మాత్రమే నిజం పరిగణించి, భావించి వాదనలు చేస్తుంటాము.

* * *

నీవు చెప్పదలచుకొన్నది - అంటే ఏమి చెప్పాలనీ నీకు హృదయంలో ఉన్నదో అది బాహాటంగా చెప్పేయ్. అంతేగాని ఏమి చెప్పవలసి ఉన్నదీ అని ఆలోచించి అది చెప్పకు. ఇతరులను నమ్మించాలని ప్రయత్నంతో చెప్పే మాటలకంటె ఏ విషయంలోనైనా 'సత్యం' చెప్పడం మేలు. ఆ సత్యం, ఆ చెప్పడం ఎంత నిష్ఠురంగా ఉన్నా ప్రమాద మేమీ లేదు. ఏమైనా సత్యం చెప్పడమే యోగ్యమైన పని. చూడూ - నీ జీవితం ఎంత దరిద్రంగా అధ్వాన్నంగా ఉన్నా పర్వాలేదు; దాన్ని ఊరికే తిట్టిపోయ్యకు. దాన్నుండి తప్పించు కొని పోవాలని ప్రయత్నించకు. దాన్ని ధైర్యంగా ఎదుర్కొని, జీవించు - అనుభవించు. అది "నీవు" ఉన్నంత అసహ్యంగా లేదు. చెడ్డగాలేదు. అది మంచి ఉచ్ఛదశలో ఉన్నప్పుడు కూడా నీకు అతి దరిద్రదశలో ఉన్నట్లు కన్పిస్తుంది. అల్లా నీకు కన్పించవచ్చు. అది దాని దోషంకాదు. అదీకాక తప్పులెంచేవాణ్ణి తీసుకొనివెళ్ళి స్వర్గలోకంలో కూర్చొ బెట్టినా అతను అక్కడ కూడా తప్పులెంచుతాడు. చూచారూ- పాపజాతికి సదా రంధ్రాన్వేషణము ప్రకృతిగుణము. కనుక అందుకు మనం బాధ్యులంకాము. నీ జీవితాన్ని - అది ఎంత దరిద్ర స్థితిలో ఉన్నా దాన్ని మనసారా ప్రేమించు. అది ఉన్న స్థితిలోనే దాన్ని ప్రేమించు.

నీవొక బీద ఇంట్లో, కాదు, కేవలం దరిద్రులకోసం ఏర్పాటు చేయబడిన సత్రంలో, ఉంటున్నా నీకు ఒక విచిత్ర మైన, ఆనందదాయకమైన, ఒడలు పులకరింపచేయడానికి శక్తి

మంతమైన, అనిర్వచనీయమైన అద్భుత శుభసమయం - అద్భుతానుభూతి ఎదురు కావచ్చును; కలుగవచ్చును. సూర్యాస్తమయ సమయంలో భాగ్యవంతుని ఇంటి కిటికీల గుండా దర్వాజాలగుండా ఎంత మనోహరమైన అరుణకాంతులు ప్రసరిస్తాయో దరిద్రుని ఇంట్లోనూ, సత్రంలోనూ అంత మనోహరమైన కాంతులూ ప్రసరిస్తాయి. ఇక్కణ్నించి చూస్తున్నా ఆ అస్తమిస్తూఉన్న సూర్యుడు అంత మనోరంజకంగానూ కన్పిస్తాడు. మనిషికీ శాంత మనస్కత అన్నది ఉండాలి. అది కనుక ఉంటే అతనిమనస్సు ఎక్కడ ఏ సత్రపుపంచలో అత నున్నా మహారాజ భవనంలో ఉన్నప్పటిలాగానే అంతకంటె ఎక్కువగానే సంతృప్తి చెందుతుంది. అతనికి అంత ప్రోత్సాహమూ కలుగుతుంది. అంత చక్కని ఆలోచనలూ వస్తాయి. ప్రకృతి అందరకూ సమాన అవకాశాలను కల్పిస్తుంది. పట్టణపు పేదప్రజానీకం అంతమందికంటె ఎక్కువ స్వేచ్ఛాయుతమైన జీవితం గడుపుతున్నదనే నా విశ్వాసం. వారు ఇతరుల నుండి తమకు కావలసినవి పుచ్చుకోవడంలో ఉదాత్తతనే ప్రకటిస్తున్నారు.

పట్టణాలలో చాలామంది ఒక విధమైన అపోహలో పడిఉన్నారు. ఒకళ్ల వలన సహాయం పొందడం మాత్రంచేతనే అలా అని అనుకొన్నంతమాత్రాన్నే తమ అభిమానాని కేదో దెబ్బ తగులుతుందనే దురభిప్రాయంతో బాధపడుతూ తాము ఏవిధంగానూ ఒరులపై ఆధారపడి ఉండడంలేదంటారు. పోనీ నిజంగానే వాళ్లేమైనా స్వతంత్రంగా ఉంటున్నారా అంటే అదీ

లేదు. వారు పాపం నూటికి తొంభైమంది అపమార్గాల్లోతప్ప ధనసంపాదన ఉదరపోషణ ఎరుగనివాళ్లు. మరి ఈ రెండవ మార్గం మనుష్యుల్ని మరింత అపఖ్యాతిపాలు చేసేదికదా!

బీదరికాన్ని చూచి అసహ్యించుకోకు. దానివలన కలిగే ప్రయోజనాలనూ అందుకోవడానికి సిద్ధపడు. దాన్ని పవిత్రంగా స్వీకరించు. ఉద్యానవనంలో పెంచే చిన్ని పూలమొక్కను లాగా దాన్ని సాకడం నేర్చుకో. క్రొత్త క్రొత్త వస్తువులనూ, దుస్తులనూ సంపాదించుకొంటూ పోవాలని ఊరికే తాపత్రయ పడకు. క్రొత్తస్నేహాలు సంపాదించాలని హైరానపడకు.

ప్రపంచంలోని 'వస్తువులు' ఏమీ మారవు. వాటిని చూస్తుంటే మనం మారుతుంటాము. 'అవసరమైతే వస్త్రాలమ్మేయ్ ఆలోచనలుమాత్రం ఉంచుకో'. ఒక వ్యక్తి ఒక ఏకాంత ప్రదేశానికి కట్టుబడి ఉన్నా అతని ఆలోచనలే అతనికి 'దగ్గర స్నేహితులు' అవుతాయి. అందువల్ల ప్రపంచాన్ని సరిగా అర్థంచేసుకోలేక పోతున్నామనే బాధ ఉండదు. ఆలోచనలే మనిషికి సర్వవిధములైన ఆస్తిపాస్తులు. లోకంలో దాన్నెవరూ దోచుకోలేరు. నీవు అట్టి దృఢనిశ్చయంతో ఉంటే ఈ సంఘంతో పనిలేకుండా జీవించేశక్తి నీకు భగవంతుడు ప్రసాదిస్తాడు. నామట్టుకు నేను ఏళ్ళకొద్దీ నన్ను ఓ గదిలోపెట్టి తాళంవేసినా అంచక్కా ఉండగలను. ఒంటరిగా ఏ సాలె పురుగులాగానో కాలం గడపవలసి వచ్చినా నా ఆలోచనలు నాకున్నంతకాలం నే నెటువంటి బెంగా పెట్టుకోను. బయట ఉన్నప్పుడు ఈ ప్రపంచం ఎంత విశాలంగా ఆకర్షణీయంగా

మనోహరంగా కన్పిస్తుందో అక్కడ ... స్థితిలో ఉన్నా నాకీ ప్రపంచం అల్లానే కన్పిస్తుంది. ... వ్యూహం పన్నిన సైన్యసమూహంనుండి నేన్పుడు ఆ సైన్యాధిపతిని బయటకు లాగేసి ఆ సర్వసైన్యాన్నీ కల్లోలపరచవచ్చును. కాని ఒకడు ఎంత నీచుడైనా ఎంత దరిద్రుడైనా వాని ఆలోచనలను మాత్రం ఎవ్వరం అపహరించలేము.

ఏదో అభివృద్ధి చెంది పోవాలని ... ఆరాటపడకు. నీపై పనిచేసే అనేక విషయాల ప్రభావానికి అంత చేటు అవకాశం ఇవ్వకు. వాటి ప్రభావానికి లోనుకాకు. అది ... వ్యర్థం. అల్లా చెయ్యడం ఉందే అది నీకు సహజంగా ప్రకృతిగతంగా లభించిన శక్తిసామర్థ్యాలను వృథా చెయ్యడం వంటిది. బీదరికంలో ఉండే ఉదాత్తత నీవు గమనించడం లేదు. పగటిపూట సూర్యకాంతి మనల నోరకంగా, మోసం చేస్తున్నది. స్వర్గసంబంధియైన ఆకాశపు వెలుగును మనకు కనపడకుండా చేస్తున్నదా కాంతి. చీకటిలోనో! ఆ నక్షత్రాల కాంతి కన్పిస్తుంది. స్వర్గధామానికి వెళ్లే వెలుగుబాటలు గోచరిస్తాయి. అల్లాగే దారిద్ర్యంలో జీవితాదర్శాలు, మానవుని వృత్తమ ప్రవృత్తులు, స్పష్టమై కన్పిస్తాయి. లోని ఉదాత్తత బాహిరింపబడుతుంది. దుర్దినాలలో దారిద్ర్య, కష్టాలూ అనే కారు మేఘాలు మనలను కమ్ముకొని చుట్టుముట్టినప్పుడు – (మనిషి కటిక దారిద్ర్యంలో ఉన్నప్పుడు–) అప్పుడే ప్రపంచం మన దృష్టికి విశాలతమమై కన్పిస్తుంది. అప్పుడే మన హృదయ వైశాల్యము అత్యంతమూ పెరుగుతుంది. లిడియా చక్రవర్తి

మైన క్రోషియస్ యొక్క భాగ్యభోగ్యాలన్నీ ధనధాన్య సంపదలన్నీ మనకు ధారపోసి మహోవైభవంగా మనకు పట్టం గట్టినా మన ఆదర్శాలు మాత్రం మారకూడదు. జీవిత సాధ నాలు కూడా ఎంతమాత్రం మారకూడదు. అంతేకాదు; నీకు దారిద్ర్యం మూలకంగా కొన్ని హద్దులు ఏర్పడిఉంటే కొన్ని ఆటంకాలు వచ్చి ఉంటే అంటే – ధనాభావంచేత నువ్వు వార్తాపత్రికలూ, పుస్తకాలూ అవీ కొనుక్కోలేక పోతే పర్వాలేదు. బెంగపడకు. ఆ స్థితిలో నీకు అతి ప్రధాన మైన నవ్యమూ దివ్యమూ అయిన అనుభూతి ఒకటి తప్పని సరిగా కలుగుతుంది. ఏకాంతంగా స్వయంగా ఆలోచించు కొనే అవకాశమేర్పడుతుంది. జీవితంలో అతి ప్రధానమైన సత్యాలను అన్వేషించడానికి, ముఖ్యమైన విషయాలను సరిగా అర్థంచేసుకోవడానికి అట్టి దివ్యానుభూతి కారణభూత మవుతుంది. అంత ఎందుకూ – ఓ విషయం చెబుతాను; అసలూ అనవసరపు వస్తువుల నన్నింటినీ, లేనిపోని జంజాటాల నన్నింటినీ, త్యజించినప్పుడే జీవితసౌఖ్యమన్నది దర్శనీయమవు తుంది.దర్శనమిస్తుంది.జీవితానికి సంబంధించిన ఇతర విషయాల్లో మనిషి ఉదాత్తంగా ఉన్నంతకాలం, అతను ప్రాపంచికసౌఖ్యా లనుచేకూర్చే ధనధాన్యాల విషయంలో, భౌతికమైనవస్తువాహ నాదుల విషయంలో దరిద్రుడు అయినా బెంగలేదు. అసలు అప్పుడే అతను వ్యర్థజీవి కాదనిపించుకొంటాడు.

అతి విస్తారమైన భాగ్యము మరింత సౌఖ్యాన్ని కూర్చే వస్తువులను కొనుక్కొనేందుకు, సమకూర్చుకొనేందుకు ఉపయో

గిస్తుంది. ఆత్మకు సంబంధించిన ఏ ఒక్క అవసరాన్ని సాధించ డానికైనాసరే డబ్బుతో ఏ విధమైన నిమిత్తమూ లేదు. డబ్బు దాన్ని కొనియివ్వలేదు.

ప్రేమకంటె, ధనంకంటె, కీర్తికంటె 'సత్యం' ప్రధాన మైనది. అదుగో దానినివ్వండి నాకు. దానికోసరమే నేను సదా అన్వేషిస్తున్నాను. నేనొకసారి ఒక భాగ్యవంతుని ఇంటికి విందుకు వెళ్ళాను. ఎన్నో తినుబండారాలు పళ్ళాలనిండా పేర్చారు. పైను కొల్లలుగా అందించారు. ఎవరికి ఏమికావాలన్నా చాలా తరచు అడిగి కనుక్కొని అందిస్తూ బానిసల్లాగా మిక్కిలి వినయంగా మెలగే సేవకులు చాలామందే ఏర్పాటయి ఉన్నారు...కాని నిజాయితీ-సత్యం ఇవిమాత్రమే లేవక్కడ. అవిమాత్రమే లోపించాయక్కడ. నిజమైన ఆతిథ్యం అగుపించని ఆయింటినుంచి నేను వెంటనే బయలుదేరి నిజంగా ఆకలి తోనే వెళ్ళిపోయాను. వారు చూపించిన-'మర్యాద' ఎందుకో గాని నాలో ఒకవిధమైన అసహనాన్ని రేకెత్తించింది. అందులో 'ఆర్ద్రత' లేదు. చలి వణికింపచేసే మంచుగాలిలో, మంచుగడ్డ లలో ఎంత సౌహార్ద్రమున్నదో వారి ఆదరణలోనూ అంతే ఉన్నది. వారంతా అక్కడ అందజేయబడిన ద్రాక్షసారాయ మును గురించి ఎంతో గొప్పగా వర్ణించి చెప్పారు, దాన్ని ఎంతోకాలంగా దాచిఉంచి మిక్కిలి రుచిమంతము చేయ బడ్డట్టుకూడా ప్రశంసించారు. కాని నేను అంతకంటె పురాతన మైనదీ, నూతనమైనదీ, స్వచ్ఛమైనదీ, అతి ఉదాత్తమైనదీ అయిన ద్రాక్షరసాన్ని గురించి జాగ్రత్తగా ఆలోచన చేశాను.

అది వాళ్ళదగ్గర లేదు. వాళ్లు దాన్నెక్కడా కొనలేరు. వాళ్ళ వినోదాలూ, ఆ దర్జా, ఆ యిల్లూ, నా కెందుకూ వినియోగ పడలేదు, అవి కించిన్మాత్రం కూడా నన్ను ఆకర్షింపలేదు. నేను మరోమారు రాజుగారి దర్శనానికై వెళ్ళాను. చాలాసేపు వారి రాకకై ఒకపెద్ద హాల్లో వేచిఉన్నాను. ఆయన ఆతిథ్య మివ్వడ మంటే ఏమిటోకూడా ఎరగనట్లుగా ప్రవర్తించారు. అడవిలో ఒక చెట్టుతొఱ్ఱలో నివసిస్తూఉన్న వ్యక్తి ఒకడు నా ఎరికలో ఉన్నాడు. అతను అత్యంత ఆర్ద్రహృదయుడు. సత్ప్రవర్తనము కలవాడు. నేను అతన్నే కనుకసందర్శించిఉంటే అదొక మంచి పని అయ్యేది. ఎంతో సంతోషించి ఉండేవాణ్ని. కాని అప్పుడు పొరపాటే చేశానుసుమా అని నొచ్చుకొన్నట్లు జ్ఞాపకం.

జీవితమన్నది ఒక నదీజలము వంటిది. మానవుడు పూర్వమెన్నడూ ఎరుగనంతటి ఎత్తుగా ఉధృతంగా ఆ నదీజలం పొంగి పొరలవచ్చును. అట్టి దినము చరిత్రలో సువర్ణాక్షరా లతో లిఖింపబడుతుంది. అల్లా పొంగివచ్చి ఎత్తైనమిట్టభూముల్ని కూడా ఆ నదీజలము తడిపివేస్తుంది. ఆ జలం పల్లపుచూపుల్ని ఒకసారి కడిగివేస్తుంది. ఆ నదీప్రవాహాన్ని శాస్త్రం కొంత కాలంనుండి మాత్రమే గుర్తించింది. కాని చరిత్రకందని కాలాన్నుండి కూడా అదిప్రవహిస్తూ ఉన్నట్లు నేను గుర్తిం చాను. అది ఒరుసుకొనిపారిన నదీతీరా లివిగో; నాకు స్పష్టం గానే కన్పిస్తున్నాయి. ఈ జీవనప్రవాహం ప్రాపంచిక విషయాల నన్నింటినీ ఒక్కసారి ముంచెత్తి మనలోని తక్కువస్థాయికి చెందిన ఆలోచనల నన్నింటినీ ఒక్కసారి తొలగించేసి ఉత్తమ

మైన ఉదాత్తమైన విషయాన్ని ఎరుకపరుస్తుంది; ఒక పరమ సత్యాన్ని బాహిరింపచేస్తుంది. మానవులు చాలా కాలంగా విషయాసక్తి పరులై కాలం గడుపుతున్నారు. దాదాపు వ్యర్థంగా కాలం గడుపుతున్నారు. కాని అంత కాలంనుండీ కూడా వారు తమ తమ అంతరాంతరాలలో ఆధ్యాత్మిక మైన ఒకసత్యాన్ని గూర్చి ఆరాటపడుతూనే ఉన్నారు. ఆ విషయాన్ని నేను సరిగానే గుర్తించాను.

మీరంతా ఆ నల్లికథ ఆసాంతం వినే ఉంటారు. మొత్తని కలపతో తయారుచేయబడిందో మేజాబల్ల. ఆ బల్ల మొదట కనక్టికట్ లోనూ, ఆ తర్వాత తర్వాత మెసాచుట్సు లోనూ పలుతావుల్లో ఉంచబడుతూ వివిధప్రాంతాల్లోకి మార్చబడుతూ వచ్చింది. అరవైఏళ్ళ తర్వాత ఓసారి ఒక చిత్రం జరిగింది. ఆ బల్ల ఉన్న కార్మికుని ఇంట్లో వారం రోజులుగా ఆ బల్ల నెవరో నిరంతరం గోకుతున్నట్లుగా శబ్దం వినవచ్చింది. ఆ మేజాబల్ల ఉన్న గిన్నెల వేడికి పొదుగబడి ఆ చెక్కలోని పొరలను క్రమంగా తొల్చుకుంటూ గ్రుడ్డు నుండి అరవైఏళ్ళ తర్వాత నల్లి తొల్చుకొని బయటికి వచ్చింది. ఈ కథ విన్నతర్వాత ఎవరిలో మాత్రం పున ర్జన్మయందూ జీవియొక్క ఆత్మయొక్క శాశ్వతత్వము నందూ నమ్మకం కుదరకుండా ఉంటుందో, చెప్పండీ! అటు వంటి అభిప్రాయాలు ఈ కథ విన్నాక బలపడకుండా ఉండ గలవేమో మీరే కాస్త ఆలోచించి చెప్పండీ! ఆ నల్లి అండస్థితిలో అరవైయేళ్ళు నిర్జీవంగా చైతన్యరహితంగా

పడిఉండి ఎండిన కలశనుండి ఆ పొరలనన్నిటినీ క్రమంగా ఛేదించుకొని బయటపడి చైతన్యవంతమైనది. అదీ అందు లోని వైచిత్ర్యం. ఎవరు చెప్పగలం – మానవునిలో అండ స్థితిలో ఉత్తమ జ్ఞానం ఆధ్యాత్మిక చింతన అతిపురాతన మైన నిర్జీవమైన అనేక సంఘాచారాల తాకిడికి తట్టుకొని వాటిని ఛేదించి విషయలౌల్యాన్ని విడనాడి-అది ఒకనాడు బాహిరింప బడుతుం దేమో! (చిత్ పదార్థముఅన్నది పరిపూర్ణ విజ్ఞానము. 'Absolute Intellegence' అది జీవిచేత చింతన చేయుబడునప్పుడు-జీవికీ ఆ విజ్ఞానానికీ సంయోగము కలిగి నప్పుడు అది చైతన్యమవుతుంది.) దాన్ని ఎవరుకాదనగలం! ఏమోఎప్పుడో స్వచ్ఛమైన పరిపూర్ణమైన ఆవిజ్ఞానము ఒక్క సారిఉద్భవించి ఉబికివచ్చిఉద్ఘాతమవుతుందో! ఏమో ఎప్పు డావిజ్ఞానము రెక్కలను విదల్చి-ఆ మనోహరములైన పక్షము లతో స్వచ్ఛాతి స్వచ్ఛమైన హంసవలె పైకెగసి ఏ దివ్యా కాశములో విహరింపబోతుందో ! అందువల్ల నాకీ విషయాల్లో ఆట్టే పెద్దఅనుమాన మేమీ లేదు. ఎంతటి విషయ లౌల్యంలో మునిగితేలుతున్న వ్యక్తికయినా (వ్యక్తి సము దాయానికైనా) కొన్నాళ్ళకు తప్పక జ్ఞానోదయం అవు తుంది. అయితీరుతుంది. ఉదయ సంధ్యారుణ కాంతుల్లా ఆ జ్ఞానలోకం అంతటా ప్రసరించి వెల్లివిరిస్తుంది.

—— ... ——